ప్రజలతో




ముఖ్యమంత్రి

# రాష్ట్ర ముఖ్యమంత్రితో మీరు మాట్లాడాలా?
# మీ కోసం ఒక వేదిక ఉంది. అదే...
# "ప్రజలతో ముఖ్యమంత్రి"

రాష్ట్రవ్యాప్తంగా నిరాటంకంగా కొనసాగుతున్న "ప్రజలతో ముఖ్యమంత్రి" కార్యక్రమం ఎన్నో సామాజిక సమస్యలను పరిష్కరించింది. 1997 ఏప్రిల్‌లో ప్రారంభమైన ఈ కార్యక్రమంలో ఎంతోమంది ప్రజలు స్వయంగా ముఖ్యమంత్రితో టెలిఫోన్‌లో మాట్లాడి సమస్యలను పరిష్కరించుకోవడం విశేషం. ఈ వినూత్న కార్యక్రమంలో ప్రజలు విలువైన సమయాన్ని వివేకవంతంగా వినియోగించుకోవాలి. సామాజిక సమస్యలతో పాటు, అభివృద్ధి పథకాలపై ప్రశ్నలు అడగాలి. పరిష్కారాన్ని అందుకోవాలి.

## ఒక ప్రత్యేక అంశం మీ అందరి కోసం దూరదర్శన్‌లో ప్రతి సోమవారం సా॥ గం.6.25 ని.లకు

### ఆలస్యమెందుకు...?

ఈ క్రింద టెలిఫోన్ నెంబర్లకు డయల్ చేయండి.

హైదరాబాద్ నుంచి : 23453229, 23453230

రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుంచి : (040) 23453229, 23453230, 23453231, 98480-54343

ప్రకటించిన అంశంపై ప్రశ్నలు అడగండి - పరిష్కారం పొందండి.

# ఇదీ సంగతులు

45

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

**Also available on net:**
**www.haasam.com**



ముఖచిత్రం
'సంబరం' లో
నితిన్, నిఖిత

## హాస్యం





## సంగీతం





'సెంటర్ స్ప్రెడ్' లో
'సంబరం', 'ధమ్'
సినిమా పాటల
పుస్తకాలు కలర్‌లో



సినారె గారిని గురించి ఆచార్య గోపి గారు రాసిన విషయాలు ఆకట్టుకున్నాయి. మరువడం ఆయన జీవితంలో లేదన్న మాట అక్షరసత్యం. నేను భిక్నూరు (నిజమాబాద్ జిల్లా)లో 1952లో ఒక ట్రయినింగు స్కూలులో పనిచేస్తున్నప్పుడు వారిని ఆహ్వానించటం జరిగింది. ఈనాటికి ఎక్కడైనా కనపడ్తే... "ఏమండి రామారావుగారు" అంటూ పలకరిస్తారు. హ్యూమర్‌బాక్స్ జోక్స్ బాగున్నాయి. ఆచార్య తిరుమలగారి వ్యాసం హైలైట్.

**-కె.రామారావు, హైదరాబాద్.**

ఫ్రెండ్‌షిప్ డే సందర్భంగా ఇద్దరు స్నేహితుల గురించి నాకు తోచింది రాస్తున్నా!

బాపూరే అనిపించును ఆ ఇద్దరి జంట
పులకించును తనూలతిక మొదలంట
రమ్యమైన వారి చిత్రరాజాలు చూడ ముచ్చటంట
మదిలో నవరసభావాల పంట, ప్రేర
ణగా నిలుచు వారి స్నేహం ఎందరికోనంట
స్నేహమంటే వారిదే స్నేహితులంటే వారే!

వారిద్దరిని విడదీసే ధైర్యం లేక కలిపి రాశాను. ఇంకెందరో అలాంటి స్నేహితులకందరికి ఫ్రెండ్‌షిప్ డే అభినందనలు!

**-నళినీ కుమార్, సికింద్రాబాద్.**

మణిశర్మగారు, కీరవాణిగార్ల గురించి ఇవ్వబడిన ఇంటర్వ్యూలు బాగున్నాయి. వారి చిత్రాల లిస్టులు అభిమానులు పదికాలాల పాటు దాచుకొనే విధముగా ఉన్నాయి. మృణాళినిగారు కీ॥శే॥మదన్ మోహన్‌గారి గురించి వ్రాసిన వ్యాసం ఆలోచనను రేకెత్తించే విధంగా ఉన్నది.

మదన్‌మోహన్‌గారు కంపోజుచేసిన మౌసమ్ 1976లో విడుదల అయినది. పొరపాటున మ్యాగజైనులో 1995 అని వేశారు.

**-టి.శ్రీనివాసరావు, గురజాల.**

నేను చెన్నైలో యం.యస్.సి చేస్తున్నాను. నేను 'హాసం' కి వీరాభిమానిని. మొట్టమొదటి సారిగా ఓ పత్రికకి నేను లెటర్ వ్రాస్తున్నాను. ఈలెటర్ కూడా ఒక ప్రత్యేక సందర్భంగా ప్రాధ్యామన్పించింది. అదేమిటంటే నేను 'హాసం' చదవడం ప్రారంభించి ఈ జులై1-15 సంచికతో ఒక సంవత్సరం అయింది. నిజంగా 'హాసం' అభిమానినైనందుకు గర్వపడుతున్నాను. తనికెళ్ళభరణి గారి వ్యాసం, ఆచార్య తిరుమలగారి శీర్షిక పత్రికకే తలమానికమైనవి. ఆపాత(ట)మధురంలో రాజాగారి విశ్లేషణ, పాట క్లిప్పింగులతో సహా ఇవ్వడం ఎంతమందికి సాధ్యపడుతుంది. కామెడీ సీరియల్స్ అద్భుతం. ఏ ఒక్క పేజీ కూడా వదలకుండా చదవాలి అనిపించే పుస్తకం ఇదొక్కటి మాత్రమే అని ఖచ్చితంగా చెప్పగలను. ఎంతో ఓర్పుతో విషయసేకరణ జరిపి పాఠకులకు అందిస్తున్న 'హాసం' బృందానికి హ్యాట్సాఫ్ చెప్పకుండా ఉండలేకపోతున్నాను.

**-మండవ ఆంజనేయులు, చెన్నై.**

కీరవాణి గురించి ప్రచురించిన వ్యాసం చదివిన తర్వాత యిది రాస్తున్నాను.



సుమారు రెండు సంవత్సరాల క్రితం సినిమాల్లో పాటలు రాయాలని హైదరాబాదు వెళ్ళాను. ఎవర్ని ఎలా కలవాలో తెలీదు. రాఘవేంద్రరావుగారి ఆఫీసుకు వెళితే ఆయన అప్పాయింట్‌మెంట్ దొరకలేదు. ఏం చేయాలో తెలీక తిరిగి హోటల్ రూమ్‌కి తిరిగొచ్చాను. నా దగ్గరున్న ఫోన్ నెంబర్లు వెతికి కీరవాణి గారి యింటికి ఫోన్ చేశాను. "కొత్తగా పాటలు రాస్తున్నాను సార్! మీ అప్పాయింట్ మెంట్ కావాల"ని అడిగిందే తడవుగా "మరుసటి రోజు ఉదయం మోహన్‌బాబుగారి ఆఫీసులో వుంటాను వచ్చి కలవండ"న్నారు. అడ్రస్ కూడా ఆయనే వివరంగా చెప్పారు. అప్పుడు ఆయన 'తప్పుచేసి పప్పుకూడు' పాటల కంపోజింగ్‌లో వున్నారు. నేనెవరో ఆయనకి అసలు తెలీదు అయినా మోహన్‌బాబుగార్కి పరిచయం చేశారు. ఆ తర్వాత నేను రాసిన పాటల స్క్రిప్ట్‌ను వినయంగా నిలుచుని రెండుచేతులు చాచి మరీ అందుకున్నారు. చదివారు. మోహన్‌బాబుగార్ని ఒకసారి అడిగి చూడండి అన్నారు. పాటలు బాగున్నాయి యిప్పటి ట్రెండుకు అనుకూలంగా వున్నాయి అంటూ ధైర్యాన్నిచ్చారు.

ఫలానా డైరక్టర్‌ని కలవండి అవకాశం యిస్తారని చెప్పారు. నేనుకూడా యిద్దరు ముగ్గురు నిర్మాతలకు చెబుతానని అభయం యిచ్చారు. అడ్రసు తీసుకున్నారు.

ఆ తర్వాత మా నాన్నగారు హఠాత్తుగా పోవడంతో కొంతకాలం నా ప్రయత్నాలు ఆపేశాను. మళ్ళీ యిప్పుడిప్పుడే మొదలెడుతున్నాను. కొత్తగా పాటలు రాసేందుకు వచ్చిన నన్ను ఆయన నిలువెత్తు వినయం ఒక రకంగా షాక్ యిచ్చింది. ఎదిగేకొద్దీ ఒదిగే మనిషి ఆయన. ఆయన పేరే కాదు, మనసు కూడా కీరవాణే! ఆయన సంస్కారానికి వెయ్యి చేతులెత్తి నమస్కరించినా అది చాలా తక్కువ. రాఘవేంద్ర స్వామి సర్వదా ఆయనను దీవించుగాక! రాగాల గని కీరవాణి! ఈయనకు నమస్సులు.

**-రాఘవేంద్ర శ్రీనివాస్, మచిలీపట్నం.**

నేను 'హాసం' గత సంవత్సర నుంచి రెగ్యులర్‌గా కొని చదువుతాను. అప్పట్నుంచి 'హాసం'లో వచ్చిన ప్రతి పాట నేను కలెక్ట్ చేసిపెడుతున్నాను. ఇంకా 'హాసం' నాలాంటి వర్ధమాన గాయకులందరికి పరిచయం చేస్తుంటాను. 'ఆడియో విశ్లేషణ'లను చదువుతూ, తెలియని విషయాలను తెలుసుకుంటున్నాను.

**-జె.ఎస్.అరవింద్, హైద్రాబాద్.**

'మధుర సంగీతం - మదన్‌మోహన్ సంతకం' శీర్షిక క్రింద 'మెలొడీ మాస్టర్' గూర్చి మృణాళిని గారి వ్యాసం కడు హృద్యంగా వుంది. శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం 'పాడుతా తీయగా' లో మదన్ గూర్చిన కొన్ని వివరాలు- లతా మంగేష్కర్ గృహం మదన్‌కు అతి చేరువగా వుండడం మంచి అవకాశం. మంచి ట్యూన్ తట్టగానే లతా సహకారంతో ఖాళీ క్యాసెట్టులో భద్రపరచేవారట. ప్రొడ్యూసర్లకు అవి వినిపించి వారి చిత్రాల్లో గీత రచయితలచే తగ్గట్టు వ్రాయించి చక్కటి పాటలను స్వరపరచేవారట. తండ్రి అధిక ద్రవ్యవంతులగుటచే తనకు ప్రీతికరమైన సంగీత సాగరంలో ఓలలాడి శ్రోతలకు మరపురాని మధుర గీతాలను తనదైన బాణీలో మలచారట.

**-పోకల వెంకటకృష్ణమోహనరావు, రామచంద్రాపురం**

నేను మీ 'హాసం' పత్రికకు అభిమానిని. నేను మొదటి నుంచి మీపత్రికను రెగ్యులర్‌గా ఫాలో అవుతున్నాను. నాకు సాగరసంగమం, సిరివెన్నెల, శంకరాభరణం, ఆనందభైరవి మొదలగు సినిమా పాటల పుస్తకాలు చాలా అవసరం. మీ పత్రికలో ఈ పాటలను అందిస్తారని మనసారా కోరుకుంటున్నాను. మణిశర్మ, కీరవాణిల గురించి వివరించిన తీరు బాగుంది. "కొమ్మ కొమ్మకో సన్నాయి"లో మహదేవన్ గురించి వివరించిన తీరు నాకు బాగా నచ్చింది.

**-పి.ఎమ్.కుమార్, పోడూరు.**

"తాషేర్‌ఘర్" గురించి వ్రాసినందుకు ఎమ్బీయస్ ప్రసాద్ గారికి కృతజ్ఞతలు. ఈ బెంగాలీ చిత్రం చూడాలని ఎన్నో సంవత్సరాలు ట్రై చేశాను. కానీ వీలువడలేదు. ఆశ వదులుకున్నాను. ఇప్పుడు, ఇలా హఠాత్తుగా 'హాసం' ద్వారా చూడగలిగే అవకాశం వస్తుందని కలలోకూడా ఊహించలేదంటే నమ్మండి. ఫోటోలతో సహా విశ్లేషణ చదువుతూంటే చిత్రం చూసిన అనుభూతి కలిగింది. 'ఇద్దరుమిత్రులు' సీరియల్‌కు తెరపడింది కదా వాట్ నెక్స్ట్? 'గుండమ్మ కథ' బాగుంటుందేమో ఆలోచించండి.

**-బి.శ్రీనివాసరావు, హైదరాబాద్.**

గత 11 మాసాలనుండి 'హాసం' చదువుతున్నాను. ప్రతి వ్యాసం అద్భుతం. ఇంతమంచి పత్రిక తెలియక మిస్సయ్యానని చాలా బాధపడ్డాను.

"అర్థం చేసుకుందాం - ఆస్వాదిద్దాం" లో హిందీ, తమిళ పాటలను గూర్చి తెలియజేయడం బావుంది. తమిళం నేర్చుకోవాలన్నా తీరలేదు. గత రెండు మాసాల నుంచి తమిళ పాటలను పరిచయం చేయడం వల్ల కొంచెం కొంచెం నేర్చుకుంటున్నాను.

**-బలుసరి విజయ్, సూగూరు.**

సంపుటి : 2 సంచిక:21

1-15 ఆగస్టు 2003

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

45

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-23541713

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

తమిళనాడులో బాగా వేళ్లూనుకున్న హ్యూమర్ క్లబ్బు ఉద్యమం క్రమంగా ఆంధ్రదేశాన కూడా వ్యాపిస్తోంది. నలుగురూ ఒకచోట చేరి సరదాగా జోకులతో కాలక్షేపం చేయడం దీని ముఖ్యోద్దేశం.

ఎవరికి వారు చదువుకోవడానికి జోక్స్‌బుక్స్ విస్తారంగా దొరుకుతున్న ఈ రోజుల్లో ఇటువంటివి అవసరమా అన్న అనుమానం రావచ్చు. ముళ్లపూడి వెంకటరమణగారు 'నవ్వితే నవ్వండి' పీఠికలో అన్నట్టు దేశకాల పరిస్థితులను బట్టి ఒక జోకుకు వచ్చే నవ్వు రకరకాలుగా ఉంటుంది. వాన చినుకు పెనం మీద పడితే ఇగిరి చక్కాపోతుంది. సముద్రంలో పడితే నామరూపాల్లేకుండా పోతుంది. తామరాకుమీద పడితే ముత్యంలా ప్రకాశిస్తుంది. ముత్యపు చిప్పలో పడితే ముత్యం అయి వూరుకుంటుంది.

అలాగే ఓ జోకు మీరొక్కరూ కూర్చుని చదువుకున్నప్పుడు చిరునవ్వు ఉదయిస్తే అదే జోకు నలుగురితో కలసి విన్నప్పుడు గొల్లున నవ్వొస్తుంది. ఇదే హ్యూమర్‌క్లబ్బు విజయరహస్యం. మనసును ఆహ్లాదపరచుకోవాలనే ఉద్దేశ్యంతో అక్కడకు వెళతాం కాబట్టి ఇదివరకు విన్న జోకైనా సరే, పక్కవాడితో బాటు పగలబడి నవ్వుతాం. కనీసం చిరునవ్వు చిందిస్తాం. బేసికల్‌గా సంఘజీవులం కదా!

లాఫింగ్‌క్లబ్బులు ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకుంటే, హ్యూమర్‌క్లబ్బులు ఆహ్లాదాన్ని దృష్టిలో పెట్టుకుంటాయి. కొద్దిపాటి వ్యవధిలో నలుగురితో పాటు కాసిన్ని జోకులు సేవించి, వీలయినప్పుడల్లా నెమరువేసుకునే సౌలభ్యం దాంట్లో ఉంది. ఊకదంపుడు ఉపన్యాసాలు, ఉపదేశాలు లేకుండా కార్యనిర్వాహకులు సరాసరి జోకులు చెబుతూ, ఆర్భాటాలు లేని స్కిట్‌లు ప్రదర్శిస్తూ కాసేపు అలరించాక సభికుల 'జోక్'యం కోరతారు. అప్పుడు సభికులు కూడా ముందుకువచ్చి వాళ్లకు నచ్చిన జోకులను వచ్చిన విధంగా చెబుతారు. ఈ విధంగా క్రమేణా కళాకారులు విస్తరిస్తారు.

ఇటువంటి క్లబ్బుల స్థాపనకై ఉత్సాహపడేవారికి 'హాసం' ఇవ్వగలిగే సూచన ఒకటే! - ఆర్థికపరంగా వీటి నిర్వహణ కష్టం కాదు. హాలు అద్దె కనక ఎవరో ఒకరు భరించగలిగితే చాలు. వీటిలో చందాలు, సభ్యత్వాలు ఉండవు కాబట్టి చాలామంది హాజరవుతారు కూడా. ఉన్న చిక్కల్లా వచ్చినవారిని ఆకట్టుకోవడం ఎలా అన్నది తెలియాలి. నిర్దేశించుకున్న వ్యవధిలో హాస్యంతో ఆకట్టుకోలేమనిపిస్తే సంగీతాన్ని రంగరించి ' హాసం క్లబ్బు' గా రూపొందించవచ్చు. మిగిలిన ఆ కాసేపు శ్రోతలను ఆకట్టుకోగల ఔత్సాహిక గాయనీగాయకులు ఉండకపోరు.

'హాసం క్లబ్బు' నిర్వహించాలంటే మెటీరియల్ కోసం తడుముకోనక్కరలేదు. 'హాసం' పత్రిక సంచికలన్నీ ఉంటే చాలు. సుమారు 800 జోకులు, 40 పైన పేరడీసాంగ్స్, 20 దాకా స్కిట్స్ - ఎందరో ప్రముఖుల గురించి ఎన్నో హాస్యపరమైన ముచ్చట్లు, వీటన్నిటితో బాటు పాటల లిరిక్స్ అన్నీ మీకు 'ఇన్‌స్టంట్ ఫుడ్' గా లభ్యమవుతాయి. జోక్స్ చెప్పడం అలవాటయితే క్రమంగా మీలోని కళాకారుడు నిగ్గు తేలతాడు. అప్పుడు మీరే ప్రొఫెషనల్ పెర్‌ఫార్మర్ అవుతారు.

పైన చెప్పినట్టు జోకును చెప్పవలసిన రీతిలో చెప్పగలిగితే అది ముత్యంలా ప్రకాశించడమే కాదు, ముత్యమే అయికూచుంటుంది. నవ్వు పదిమందికీ పాకుతుంది. ఆరోగ్యం పంచుతుంది. రోగనిరోధకశక్తి పెంచడమే 'హాసం' వారి లక్ష్యం, ఉద్దేశ్యం, మనుగడ. రోగాలు రాష్ట్రాన్ని పట్టిపీడుస్తున్న ఈ తరుణంలో అందరూ ఇంతకంటె ఏం కోరుకుంటారు కనక?



క్లాసిక్స్ రీటోల్డ్

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

## చమత్కార చంద్రికా ఘట్టాలు



కొన్ని కొన్ని సందర్భాల్లో కొంత కొంతమంది తమకెన్ని తెలివితేటలున్నా రాణించలేక పరాజయం పాలవుతారు. కొంత కొంతమంది తమకున్న కొద్దిపాటి తెలివితేటలతో, సద్యఃస్ఫూర్తితో ఎటువంటి క్లిష్ట పరిస్థితినైనా సునాయాసంగా అధిగమించి గుర్తింపు తెచ్చుకుని రాణిస్తారు. ఏది ఏమైనా అవసరానికి పనికిరాని తెలివి తెలివికాదు. కవులు, కళాకారులు ఎటువంటి సందర్భాన్నైనా తమకు అనుకూలంగా త్రిప్పుకుని లాభపడిన సంఘటనలు సాహిత్య చరిత్రలో కనిపిస్తాయి. ఆ చమత్కార, చాతుర్యాల్ని కొన్నిటిని మీకు పరిచయం చేస్తాను.

కొండవీటిరాజు పెదకోమటి వేమారెడ్డి యొక్క ఆస్థాన విద్యాధికారి శ్రీనాథ మహాకవి ఒకసారి అతని ప్రబల శత్రువైన సర్వజ్ఞ సింగభూపాలుని కొలువుకు వెళ్లి

సర్వజ్ఞ నామధేయము
శర్వునకే, రావు సింగ జనపాలునకే,
యుర్వింజెల్లును తక్కొరు
సర్వంజ్ఞుండనుట కుక్క సామజ మనుటే!!

అని పొగిడేసరికి సింగభూపాలుడు ఉబ్బితబ్బిబై శ్రీనాథునికి ఘన సన్మానం చేసి పంపించాడు. "సర్వజ్ఞ" అనేది బిరుదు. ఆ బిరుదు సింగభూపాలుడికే కాదు వేమారెడ్డికి కూడా ఉంది. పద్యభావం ఏమిటంటే - సర్వజ్ఞుడనే పేరు శివునికి, సింగభూపాలుడికే భూమ్మీద చెల్లుతుంది; ఇంకెవరినైనా సర్వజ్ఞుడంటే - అది కుక్కను ఏనుగు అనటమే అనిఅర్థం. కాబట్టి శ్రీనాథుడు తనను కీర్తించి, వేమారెడ్డినే అవమానించాడని మెచ్చుకుని సన్మానించాడు. ఈ విషయం తెలిసి, శ్రీనాథుడు వచ్చాక వేమారెడ్డి మండిపడుతూ "ఏమయ్యా! మా శత్రువు దగ్గరే మమ్మల్ని అవమానిస్తావా? ఇదేనా కృతజ్ఞత-" అని నిలేసే సరికి శ్రీనాథుడు నవ్వుతూ - "మహారాజా! సింగభూపాలుణ్ని నేను పొగడలేదు. తిట్టిన పద్యమది. అర్థం చేసుకోలేక పొగిడాననుకొని సత్కరించాడు" అని పై పద్యాన్ని వేమారెడ్డి దగ్గర - "సర్వజ్ఞ నామధేయము శర్వునకే - రావు సింగభూపాలునకు ఏ యుర్వింజెల్లును?" అని 'కే'ని విడదీసి చదివి, సర్వజ్ఞుడు శివుడే గానీ ఆ బిరుదు సింగభూపాలుడికి ఏ భూమి మీద చెల్లుతుంది? ఇతరుని సర్వజ్ఞుడనటం కుక్కని ఏనుగనటమే! - అని అర్థం చెప్పేసరికి వేమారెడ్డి భేష్ అని మెచ్చుకుంటూ శ్రీనాథునికి మళ్లీ ఘన సన్మానం చేశాడు.

18వ శతాబ్ది చివరలో విజయనగరాన్ని పూసపాటి చిన విజయరామరాజు పాలించాడు. అతని ఆస్థానకవి అడిదం సూరకవి. అతని మాట రెండు వైపులా పదునున్న కత్తిలా వుండేది. ఒకసారి తమ తమ ఆస్థాన కవులతో ఆనాటి రాజులంతా పెద్దాపురంలో కొలువు చేసి వుండగా సూరకవి రామరాజు మీద

"రాజు కళంకమూర్తి రతిరాజు శరీర విహీనుడంబికా
రాజు దిగంబరుండు మృగరాజు గుహాంతర సీమవర్తి వి
భ్రాజిత పూస పాడ్విజయ రామ నృపాలుడు రాజు గాక"

అని ఆపి మిగిలిన రాజుల్ని చూపిస్తూ - "యీ రాజులు రాజులా? పెను తరాజులు గాక ధరా తలంబునన్?" అని పద్యాన్ని పూర్తిచేసే సరికి అక్కడ కూర్చున్న రాజులందరూ కోపంతో మండిపడ్డారు. వెంటనే సూరకవి లేచి - "అయ్యా! నేను మిమ్మల్ని ఏమీ అనలేదు. విజయరామరాజు రాజు గాక మచ్చగల చంద్రుడు గాని, శరీరం లేని మన్మథుడు గాని, గుహలో వుండే సింహం గాని - రాజు లేని రతిరాజు, మృగరాజులా? తరాజులో వుండే 'రాజు' అనే మాటలే గాని నిజంగా రాజులు కారని మీకు చేతితో ప్రశ్నిస్తూ చెప్పానంతే!" అనేసరికి వారంతా సూరకవిని మెచ్చుకుంటూ సన్మానాలతో ముచ్చెత్తేశారు. నిజానికి, సూరకవి అక్కడున్న రాజుల్నే కించపరిచాడు. గడుసుగా వారిచేతనే సన్మానాలు పొందాడు.

ఇలాగే ఒకసారి కూచిపూడి భాగవతులు పేరు కోసం ఆశపడే లోభివాడైన ఓ జమీందారుని కల్సుకుని ప్రదర్శన తర్వాత చివరలో రాగాలు తీస్తూ ఇలా మొదలుపెట్టారు:-

**కూచిపూడి అగ్రహారం**
**మేముండేదే ఒక వారం**
**కులమున బ్రాహ్మణ వారం**
**నివశించేది కృష్ణా తీరం -**

అన్నారుట! ఆ జమీందారు మెచ్చుకుని "ఇంతకీ మీకేం కావాలయ్యా?" అని అడగ్గానే భాగవతులు ఆనందంతో ఓ రాగం తీసి "మేం కోరేది మీ మెడలో చంద్రహారం" అని ఆ హారాన్ని యిప్పించుకుని పట్టుకు పోయారట!

రాయల వంశీకుడైన ఒక సామాన్యుడు తిరుమల రాయడు. అతనికి కూడా కవులచే పొగిడించుకోవాలని, వారికి సన్మానాలు చేసి పేరు సంపాదించుకోవాలని చాలా కోరికగా వుండేది. కోరిక తప్ప పొగిడించు కొనేటంతగా వేరే అర్హత లేమీ లేవు సరిగదా ఒంటికంటివాడు. ఒకటే కన్ను. అతనొకసారి తెనాలి రామకృష్ణునితో తన కోరిక చెప్పి తనను వర్ణించమనగానే రామకృష్ణుడు - రాయణ్ణి ఎగాదిగా చూసి -

**అన్నాతిఁ గూడ హరుడవు**
**అన్నాతిని గూడకున్న నసుర గురుండౌ**
**అన్నా! తిరుమల రాయా!**
**కన్నొక్కటి లేకయున్న కౌరవ పతివే!!**

అని పద్యం చెప్పే సరికి మహాకవి తన మీద ఏదో గొప్ప పద్యం చెప్పాడనుకొని రామకృష్ణుని ఘనంగా సన్మానించి పంపించాడు. ఇంతకీ ఆ పద్య భావమేమిటంటే - ఓ తిరుమల రాయా నీకొక కన్ను, నీ భార్యవి రెండు కళ్లు, నీ భార్యతో నీవుంటే మీ యిద్దరివి కలిపి మూడుకళ్లు. అప్పుడునీవు ముక్కంటియైన శివుడంతటి వాడివి. ఆమెతో గాక ఒంటరిగా వున్నావంటే ఒక కన్ను గల రాక్షస గురువు శుక్రుడంతవాడివి. ఉన్న ఆ ఒక్క కన్నూ లేకుండాపోతే దృతరాష్ట్రుడంతటివాడివి - అని చేసిన హేళన అది. అదీ రామకృష్ణ కవి కొంటెతనం.

ఒకసారి శ్రీకృష్ణ దేవరాయలు కృష్ణా తీర శ్రీకాకుళ పుణ్యక్షేత్రంలో పండిత సభ చేసి శ్రీరాముని తమ్ములు గొప్ప వారా, ధర్మరాజు తమ్ములు గొప్ప వారా అని అడిగి, పండితుల అభిప్రాయాలు తెలుసుకున్న తర్వాత రాముని తమ్ముల కంటే ఏ ఈశ్వరాంశా లేని పాండవులే గొప్ప వారని తీర్పు చెప్పాడు. వెంటనే రాయల వెనక నిలిచి వింజామర వీస్తున్న రజకుడు - "దేవరకు ఈజన్మలో కూడా పాండవ పక్షపాతమేనా ప్రభూ!" అని నవ్వగానే కృష్ణరాయలు పరమానంద భరితుడై "ఏది కావాలో కోరుకో" అనగానే వాడు దురాశకు పోయి విజయనగరానికే ప్రభువై పోదామని "దేవరకోట ఇప్పించండి - ఏలుకుంటా"నని అడగ్గానే రాయలు తెల్లబోయాడు. అక్కడున్న తిమ్మరుసు మహామంత్రి ఇదంతా కనిపెట్టి బాగా ఆలోచించి, విజయనగర సామ్రాజ్యంలో ఎక్కడో వున్న 'దేవరకోట' అనే చిన్ని పల్లెటూరుని రజకునికి యీనాంగా యిచ్చి - వాణ్ణి కొలువు నుండి తీసేసి పంపించేశాడు. ఆ స్థానాల్లో ఎవరెవరి బుద్ధులెలా వుంటాయో, ఎవరెవరు లాభపడతారో తెలియదు.

16వ శతాబ్ది తర్వాత కృష్ణా తీర తెలుగుదేశాన్ని అమరావతి రాజధానిగా ఏలిన మహాదాత, శూరుడు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు. ఒకప్పుడు అతడు, నర్సారావుపేట మల్రాజు గుండారాయడు, నూజివీటి అప్పారావు, చల్లపల్లి నేలే అంకినేడు మొదలైన కొందరు జమిందార్లతో యిష్టగోష్టి వినోదంగా ఒక పండిత సభ పెట్టించినప్పుడు హాస్య చతురుడైన ఒక విద్వత్కవిని గుండారాయడు "మేం పోయిన తర్వాత మమ్మల్ని గూర్చి యీ లోకం ఏమనుకుంటుందో చెప్పు" అని అడిగాడట. అప్పుడా పండితుడు నిర్భయంగా - "అయ్యా! అప్పారావు గారు పోతే బైరాగు లేడుస్తారు, మీరు పోతే వేశ్యలందరూ ఏడుస్తారు. వెంకటాద్రిగారు పోతే అంతా ఏడుస్తారు, అంకినేడు గారు పోతే అందరూ ఆహా అని సంతోషిస్తార"ని చెప్పి కూర్చోగానే అంకినేడుతో సహా జమిందార్లంతా పగలబడి నవ్వుకుని ఆ విద్వత్కవిని ఘనంగా సన్మానించారు.

వెలుగోటి వారి వంశంలో సర్వజ్ఞ సింగభూపాలుని తర్వాత అంత ప్రసిద్ధి కెక్కిన విద్వత్ప్రభువు విద్వత్కుమార యాచమనాయడు. ఒకనాడొక మహాపండితుడాయన ఆస్థానానికి వచ్చి అక్కడి పండితుల్ని అందర్నీ శాస్త్రవాదాల్లో ఓడించే సరికి యాచమనాయడు సంతోషించి మీరు హాయిగా జీవించటానికి గాను ఏం కావాలో కోరుకోండని అడిగాడు. ఆ మాటతో ఆ పండితుడు పదిమందినీ విచారించి సర్వ సమృద్ధి కరమైన 'తీర్థంపాడు' అనే ఊరిలో వున్న ఒక చెరువుకు దక్షిణ తట్టు పొలం అడిగి దానపత్రం రాయించుకొని ఆ వూరు వెళ్లగా, అక్కడి కరణం - "అయ్యో! ఆ చెరువుకు సుక్షేత్రమైన ఉత్తరపు చేను కోరుకోక, వట్టి చౌటిపర్ర దక్షిణపు చేను కోరుకున్నావేమిటి? వెర్రి పనిచేశా"వన్నాడు. ఆ పండితుడొక్క క్షణం ఆలోచించి - "అయ్యా! నేను కోరిందదే - అలాగే రాయించా"నని చెప్పి,



చెరువుకు ఉత్తరపు చేనే విడుదల చేయించుకొని, రైతుని వెళ్లగొట్టే సరికి వాడు వెళ్లి యాచమ నాయనికి ఫిర్యాదు చేశాడు. ఆయన పండితుణ్ని పిలిచి అడిగితే "ఇందులో నా తప్పేముంది? తమరు దానపత్రంలో వ్రాయించినట్లే చెరువు ఉత్తరపు చేనే నేను స్వాధీనం చేసుకున్నా"నని జవాబు చెప్పాడు. పండితుని అంతరార్థం గ్రహించిన నాయడు "ఓహో! చెరువు పుత్తరపు చేననగా ఏ చేనుకు చెరువు ఉత్తరముగా వుందో ఆ చేనని మీరు బహువ్రీహి చేసినారా?" అని నవ్వాడు. వెంటనే ఆ పండితుడు - "అయ్యా! తమరిచ్చిన భూమి బహువ్రీహి గాక అల్పవ్రీహి కావచ్చునా?" అని చమత్కరించాడు. 'బహువ్రీహి' అంటే తెలుగులో 'కలది - కలవాడు' అని విగ్రహవాక్యంలో వచ్చే ఒక సమాసం పేరే కాదు, 'అధిక ధాన్యము కలది' అనే అర్థం కూడా గల మాటది. పండితుని చమత్కారానికి యాచమనాయడు పరమానంద భరితుడై దానపత్రాన్ని మార్చి పండితునికేది యిష్టమో అలా రాయించి పంపించాడు. విద్వాన్ సర్వత్ర పూజ్యతే - అంటే ఇలాంటిదే మరి!

రెడ్డి రాజుల్లో అనవేమారెడ్డి చాలా ప్రసిద్ధుడు, మహా విద్వాంసుడు. ఆయన ఆస్థానానికొకసారి ఒక ఆర్వేల నియోగి శాఖకు చెందిన బ్రాహ్మణ విద్వత్కవి వచ్చి -

**అనవేమ మహీపాల!**
**స్వస్త్యస్తు తవ బాహవే**
**ఆహవే రిపుదోర్దండ**
**చంద్రమండల రాహవే!!**

అనవేమ భూపాలా! యుద్ధంలో శత్రువుల భుజదండమనే చంద్రమండలానికి రాహువు లాంటి నీ బాహువుకు స్వస్తి! అని శ్లోకం చెప్పాడు. రాజు సంతోషించి కవికి రెండువేలు బంగారు నాణేలు కానుకగా ఇవ్వబోయాడు. కవి నవ్వుతూ - "అయ్యా! మీకు నేను నాలుగు వేలిస్తే, మీరు నాకు అంత తక్కువగా రెండు వేలిస్తారా? ఇది బాగుందా?" అని తన శ్లోకంలోని నాలుగు పాదాల్లోను నాలుగు 'వే'లు ఉండటాన్ని వివరించాడు. నాలుగు వేలంటే 'వే' అనే అక్షరాలు నాలుగని కవిగారి చమత్కారాన్ని మెచ్చుకుని రెడ్డిగారు ఐదు వేలివ్వబోగా కవి - "ప్రభూ! మేము ఆరువేల నియోగి బ్రాహ్మణులం కదా! మా గౌరవాన్ని మీరు నిలపవద్దా?" అని మళ్లీ చమత్కరించగానే రెడ్డిగారు ఆరు వేలివ్వబోగా - కవి "మాది మాకిస్తున్నారా" అనగానే ఏడు వేలివ్వబోయాడు. కవి "ప్రభూ! ఏడు రోదన సంఖ్య గదండీ!" అని నసిగే సరికి అనవేముడు ఆ కవి క్షణక్షణ చాతుర్యానికి అపరిమితంగా సంతోషించి ఎనిమిదివేల బంగారు నాణేలతో ఆ కవిని సత్కరించి పంపించాడు. రెండువేలివ్వాలనుకున్న రాజు నుండి తన వాక్చాతుర్యంతో ఎనిమిది వేలు బంగారు నాణేలు రాబట్టిన ఆ కవి యెవరో తెలియదు గానీ కవి లోకానికే ఆదర్శప్రాయుడు. ఆనాటి కవితా చమత్కారాలు, ప్రభువుల దాతృత్వాలు అలా ఉండేవి.

అఘటన ఘటనా సమర్థులైన కవులిలాగే సందర్భాన్ని పురస్కరించుకొని విద్వత్ప్రభులనే మెప్పించి, సన్మాన సత్కారాలు పొంది, సాహిత్య చరిత్రనే చమత్కార చంద్రికగా మార్చివేశారు. చివరగా, కవి కులగురువు కాళిదాసుని ఉపాసనా బలాన్ని తెలిపే ఓ సంఘటన చెప్పి ముగిస్తాను. భోజరాజు - కాళిదాసు లిద్దరూ సరసులూ, సహృదయులు, విద్వాంసులు, కవితా రస పిపాసులు. కాళిదాసుని భోజుడు, భోజుని కాళిదాసు - దొరికితే హేళన చేసి మందలించాలని చూసేవారు. ఇలా వుండగా ఒకనాడు కాళిదాసు చేపల బజారులో ఒక పెద్ద చేపను కొని, పొట్లం చుట్టించుకుని, చంకలో పెట్టుకుని వస్తూ వుండటాన్ని అటుగా వెళుతూ భోజరాజు చూసి, కాళిదాసుని ఆట పట్టించటానికి "తగిన సమయం, దొరికా"డనుకొని, ఎదురుపడి ప్రశ్నించటం మొదలుపెట్టాడు. కాళిదాసు సమాధానాలిచ్చాడు. చివరకేం జరిగిందో - వారి సంభాషణాత్మకమైన ఆ రసవత్తర శ్లోకంలో చూడండి.

**కక్షే కిం తవ? పుస్తకం, కిముదకం? కావ్యార్థ సారోదకం**
**గంధః కిం? ఘన రామరావణ మహాసంగ్రామ రంగోద్భవః**
**పుచ్ఛః కిం? ఘన తాళపత్ర లిఖితం, కిం పుస్తకం హే కవే?**
**రాజన్ భూసుర దైవతైశ్చ పఠితం రామాయణం పుస్తకం!!**

భోజరాజు : కక్షేకిం తవ? (నీ చంకన ఏమిటది?)
కాళిదాసు : పుస్తకం
భోజ : కి ముదకం? (కారుతున్న ఆ నీరేమిటి?)
కాళి : కావ్యార్థ సారోధకం (కావ్యం యొక్క అర్థసారం)
భోజు : గంధః కిం? (ఆ కంపేమిటి?)
కాళి : ఘన రామ రావణ మహా సంగ్రామ రంగోద్భవః
(రామ రావణ యుద్ధ రంగంలోని పీనుగుల వాసన)
భోజు : పుచ్ఛః కిం? (ఆ తోక ఏమిటి?)
కాళి : ఘన తాళపత్ర లిఖితం (తాటాకు మీద వ్రాయబడింది కదా!)
భోజు : కిం పుస్తకం హే కవే?
(ఓ కవీ! అదేమి పుస్తకం?)
కాళి : రాజన్ భూసుర దైవతైశ్చ పఠితం రామాయణం పుస్తకం.
(ఓ రాజా! ఇది పండితులే కాదు దేవతలు కూడా చదివే రామాయణ పుస్తకం)

భోజరాజుకి నమ్మకం కుదరలేదు. కాళిదాసుని 'ఏదీ చూపించు'మని అడిగాడు. కాళిదాసు కాళీమాతను ధ్యానించి, చంకలో వున్న చేప మూటని విప్పి చూపించాడు. మహాశ్చర్యం! ఆ చేప భోజుడికి రామాయణ మహాకావ్యమై కనిపించింది; మహానందంతో కాళిదాసుని కౌగిలించుకొని బావురుమన్నాడు. అలా జరుగుతుందా? జరుగుతుంది. నేటికీ అలాంటి ఆశ్చర్యకరమైన విషయాలు, సంఘటనలు మనమూ వింటున్నాం. చూస్తున్నాం. అక్కడ తర్కం లేదు, నిశ్శబ్ద వీక్షణం తప్ప. అది మానుష చర్య కాదు. అమానుష చర్య. అపరిమితం, అనన్యమైన ఆ అనంత దైవశక్తికి సాధ్యం కాని దేముంటుంది? పూర్వ కవులకు, పండితులకు అటువంటి అమానుష శక్తులుండేవి. వాటితో వారు చాలా సాధించే వారు. లోకానికి అపూర్వమైన జ్ఞానభిక్ష పెట్టేవారు. ఏ శక్తీ లేని మనమిప్పుడే శక్తినీ నమ్మం సరికదా మనమీద మనకే నమ్మకం లేదు. అదొక విశేషమేమీ కాదు గానీ యీ వ్యాసం మాత్రం మానుష, అమానుష శక్తుల మిశ్రమ స్పందనా చమత్కారమని నమ్మగలిగితే సంతోషం! ■



# "నమోనమః" (నాటిక)

- దివాకరబాబు

ప్రముఖ సినీ రచయిత





**జరిగిన కథ**

హైదరాబాదు నుండి ముంబాయి కి వెళ్లే ఓ విమానం కుప్పకూలుతుంది. పారాచూట్ సహాయంతో తప్పించుకున్న ధనవంతుడు నరసింహం, కవి అయిన కళాకారుడు, మేధావి అయిన సైంటిస్టు, మిస్ యూనివర్స్ పోటీకి వెళుతున్న ప్రజ అనే అందమైన అమ్మాయి - ఓ అడవిలో తారసిల్లుతారు. నరసింహం వద్ద సూట్‌కేసులో డబ్బుంటుంది.అందరూ తలో దారిని వెళ్లి దగ్గర్లో ఊరు ఎక్కడుందో కనిపెడదామని అనుకుంటారు. తన అందానికి ముగ్ధులైన ఈ ముగ్గుర్ని పెళ్లాడతానని ప్రజ అంటుంది. ఆకలితో అలమటిస్తున్న ప్రజ ఆకలి తీర్చటం కోసం ఒకరినొకరు చంపుకోవాలనుకుంటారు. -(ఇక చదవండి)

అందరూ పడుకున్నట్టు నటిస్తున్నారు.

కొంతసేపటికి పడుకున్న సైంటిస్టు లేచాడు.

అంతే వేగంతో కళాకారుడు లేచాడు.

కళా : (తడబడి)ఏంటి లేచావ్

సైంటి : వుత్తినే.. నువ్వెందుకు లేచావ్...

కళా : నేను కూడా వుత్తినే...

సైంటి : అయితే పడుకో..

కళా : ముందు నువ్వు పడుకో...

ఇద్దరూ పడుకున్నారు.

కాసేపటికి నరసింహం లేచాడు.

సైంటిస్టు లేచి పెద్దగా అరిచాడు.

కళాకారుడు లేచి అంతకన్నా పెద్దగా అరిచాడు.

ముగ్గురూ అరుస్తున్నారు.

సైంటి : ఏంటి లేచావ్

నర : వుత్తినే

కళా : నువ్వెందుకు లేచావ్

నర : వుత్తిత్తినే

సైంటి : అయితే పడుకో



ఇందులో 4 పురుష పాత్రలు, 1 స్త్రీ పాత్ర వున్నాయి. పురుష పాత్రల వయసు 25 సంవత్సరాలు, స్త్రీ పాత్ర వయసు 19 సంవత్సరాలు... 25 సంవత్సరాలు పైబడిన వయసు వాళ్ళయినా పురుష పాత్రల్ని పోషించవచ్చు. కానీ స్త్రీ పాత్ర మాత్రం ఖచ్చితంగా 19 సంవత్సరాలే..

-దివాకరబాబు

అందరూ పడుకున్నారు

కళాకారుడు లేచాడు.

పెద్దగా అరుస్తూ నరసింహం, సైంటిస్టు లేచారు.

సైంటి : ఏంటి లేచావ్

నర : నాకు ఎలుగుబంటి కల్లోకి వచ్చింది. నువ్వెందుకు లేచావ్...

సైంటి : నాకు సింహం కల్లోకి వచ్చింది.

కళా : నాకు పులి కల్లోకి వచ్చింది.

సైంటి : నిన్నెవరు అడిగారు?

కళా : సేఫ్ సైడ్ చెప్తున్నా.

అందరూ కూర్చున్నారు.

నర : పడుకోవచ్చుగా

కళా : నువ్వు పడుకోవచ్చుగా

నర : నాకు నిద్ర రావటం లేదు

కళా : నాకూ నిద్ర రావటం లేదు.

సైంటి : అదేంటో నాకూ నిద్ర రావటం లేదు.

కళా : ప్రజ హాయిగా నిద్రపోతోంది.

నర : మన ముగ్గురం అండగా వున్నామన్న ధైర్యం.

సైంటి : మనకే ఎవరూ అండ లేరు.

అంటూ ముగ్గురూ నిద్రపోకుండా కూర్చున్నారు భయంతో.

వెయిటింగ్ లోనే తెల్లారింది.

సైంటి : కనిపెట్టా.. నే కనిపెట్టా...

ఇద్దరూ: ఏంటీ?

ప్రజలేచింది.

సైంటి : తెల్లారింది.

కళా : చంపుతున్నాడు నిన్నటి నుంచి.

ప్రజ : అమ్మో....

నర : ఇప్పుడు ఇది చంపుతుంది.

ప్రజ : అమ్మా ఆకలి... అమ్మో ఆకలి... ఈ బాధ భరించడం నావల్ల కాదు. ఆకలి... ఆకలి...

అంటూ మెలికలు తిరుగుతుంది.

OBV : ఓహో... ఎవరాడ....?

ఆ కేక ఎటునుంచి వచ్చిందో అర్థంకాక చుట్టూ చూస్తూ.....

సైంటి : ఇంకో వికెట్ పడింది.

కళా : రా నాయనా రా! ఇక్కడ వనభోజనాలు జరుగుతున్నాయి.

రైతు వచ్చాడు. అతని భుజాన గొడ్డలి, గొడ్డలికి చిన్నమూట, ఓ తాబేటికాయ వున్నాయి మెలికలు తిరుగుతున్న ప్రజని చూసి

రైతు : అరెరె!

నర : వీడు మన బ్యాచ్‌లా లేడే...

రైతు : అరెరె! ఆడమడిని అట్టా బాధతో మెలికలు తిరిగిపోతావుంటే చూత్తా వున్నరేంది?

కళా : చూడటం తప్ప ఎవ్వరూ ఏం చెయ్యలేం. ప్రజ బాధని తీర్చటం కళాకారుడ్ని నావల్లే కాలేదు.

నర : ధనవంతుడ్ని నా వల్లా కాలేదు.

సైంటి : సైంటిస్ట్‌ని నా వల్ల కూడా కాలేదు.

రైతు : అలా అని సేతులు ముడుసుకూర్చుంటారా ఏంది. ఆ బాధేంటో సెప్పండి సేతనైన సాయం సేత్తా....

ప్రజ : ఆకలి....

రైతు : ఆకలా... ఓస్ ఇంతేనా..

కళా : ఓస్ ఇంతేనాట

సైంటి : విమానం లోంచి పడితే తెలిసేది.

నర : వెళ్ళు.. చికెన్ బిరియాని పెడతాడు.

ప్రజ వెళ్ళింది.

నరసింహం, సైంటిస్టు, కళాకారుడు పక్కకి వెళ్ళి ఏదో మాట్లాడు కుంటున్నారు, మైమ్.

రైతు : మాది ఈ అడవికి పదికోసుల దూరంలో వున్న పల్లెటూరండి. అడవిపందులు పంటపొలాలు పాడుసేత్తాంటే కంచె వెయ్యటానికి కర్రలు కొట్టుకుందామని వచ్చానండి. మాయమ్మ సద్దన్నం మూటకట్టి ఇచ్చింది. తిను.

'తిను' అన్నమాట విని ముగ్గురూ తోసుకుంటూ....

ముగ్గురూ: నాకు... నాకు...

రైతు : గోల చేయకండి. అందరికి పెడతా. ఆకులు తెచ్చుకోండి.

నర : ఆకులు వొద్దు కానీ పెట్టు.

అందరికీ పెట్టాడు. ప్రజకి నీళ్ళు యిచ్చాడు...

నరసింహం నీళ్ళు తీసుకున్నాడు.

కళా : నాకు.... నాకు.....

సైంటి : ఏంటది

నర : నీరు.... మీరు....

సైంటి : నాకు కాసిని వుంచు.

అంటూ తాబేటి కాయ తీసుకుని నీళ్ళు తాగాడు

కళా : ఆహా.... అద్భుతం... అమోఘం... ఫుడ్ అద్దిరిపోయింది. ఆకలి ఎగిరిపోయింది.

సైంటి : ఇంత మంచి ఫుడ్ కనిపెట్టిన మీ అమ్మకి నోబెల్ ప్రైజ్



ఇవ్వాలి.

నర : వరల్డ్ వైడ్ అన్నీ స్టార్‌హోటల్స్‌లో తిన్నాను. అసలు ఈ 'చద్దన్నం' అన్న ఐటమ్ ఎక్కడా లేదు. వాట్ ఎ టేస్ట్!

ప్రజ : డెలిషియస్... చాలా రుచిగా వుంది.

రైతు : భలే వారండీ... మీకు శానా ఆకలి ఏసుంటది... అందుకే రుచిగా అనిపిస్తుంది. లేకపోతే పచ్చడి మెతుకులు రుచేంటండి- ఏంటోనండి కడుపుడు పెట్టలేకపోయాను ఇదిగా వుందండి.

నర : ఇట్సాల్ రైట్, బిల్ ఎంతైందో చెప్పు.

రైతు : బిల్లేటండి...

నర : తిన్నదానికి డబ్బులివ్వాలి కదా...

రైతు : భలేవారే ఈ నేల తల్లి నాకిచ్చింది. నేను మీకు పెట్టాను. మధ్యలో నాకు డబ్బులివ్వటం ఏంటండి.

సైంటి : వుత్తినే తింటే అరగదు

కళా : తిన్న రుణం తీర్చుకోవాలిగా...

రైతు : ఈ నేల తల్లి రుణం తీర్చుకోవడం ఎవడి వల్లా కాదు.

నర : సో... డబ్బులేం వద్దంటావ్... ఓకే థాంక్స్! అవునూ మే వూళ్ళోకి వెళ్ళాలంటే ఎటెళ్ళాలి?

రైతు : ఇటేనండి... తిన్నగా పది కోసులెల్లారంటే మా పల్లె వచ్చేత్తది!

నర : అక్కడ ఫోన్ వుందా?

రైతు : వుందండి.

నర : ఓకె. పద ప్రజా

ప్రజ : ఎక్కడికి?

నరం : పల్లెకి. అక్కడికెళ్ళి ఫోన్ చేసి హెలికాప్టర్ తెప్పిస్తా సిటీకి వెళ్దాం.

ప్రజ : ఎందుకూ

నర : ఎందుకేంటి? సిటీ వెళ్ళి మనం పెళ్ళి చేసుకోవాలిగా

ప్రజ : నో. నేను మీతో రాను.

నర : (షాక్ అయి) వై ?

కళా : ఎందుకు??

సైంటి : ఎందుకు రావు ప్రజా..?

ప్రజ : నా అభిప్రాయం మార్చుకున్నాను. ఈ రైతు ఒప్పుకుంటే ఇతన్ని పెళ్ళి చేసుకుని ఇక్కడే వుండిపోతాను.

ముగ్గురు : వాట్!!!

రైతు : ఆఁ!




## "విజేతలు విలక్షణమైన పనులు చెయ్యరు చేసే పనిని విలక్షణంగా చేస్తారు"- అని నానుడి!



ఆ కోవకి చెందిందే ఈ నమోనమః నాటిక. కథావస్తువు పాతదే కానీ అదే వస్తువుని వినూత్నంగా విస్మయపరిచేలా చెప్పడంలో నూరుశాతం విజయం సాధించారు దివాకరబాబుగారు.

అన్నం పెట్టే రైతే అందరి కన్నా గొప్పవాడు, ఆరాధ్యనీయుడు అని చెప్పడం రచయిత వుద్దేశ్యం. అయితే రైతుతో ప్రారంభించలేదు నాటికని అసలు రైతు గురించి క్షణమైనా ఆలోచించే తీరికలేని పాత్రల్ని ఆకాశం నించి భూమ్మీదకి దింపడంతో ప్రారంభించారు. A great begining! అన్ని పాత్రలూ ఒక్కో వర్గానికి ప్రతీకలు! ఆ తర్వాత జరిగిన Incidents ద్వారా వాళ్ళు తమకన్నా రైతు గొప్పవాడని, రైతులేనిదే మనం లేమని తెల్సుకుంటారు!

ప్రారంభం ఎంత Thrilling గా వుందో ముగింపు అంత ఆలోచింప చేసేదిగా వుంది... "రైతు వుంటే చాలు ఎవరూ అవసరం లేదు" అని ప్రజ ఆవేశంతో అంటే ప్రజ ఆవేశాన్ని చల్లబరిచి "సీమ కాడ్నించి ఆ సీమని పుట్టించిన బెమ్మదేవుడి దాకా ఒకరి అవసరం వొకరికి వుంటుంది" అని చెప్పించడంలో రచయిత హుందాతనం వ్యక్తమవుతుంది.

ఇందులో నాకు ప్రత్యేకించి నచ్చిన dialogue... "విశ్వసుందరి, విశ్వసుందరి అంటూ నావెంట పడ్డారు. నేను కాదురా విశ్వసుందరిని.... అసలైన విశ్వసుందరి ఈ భూమాతరా!" అని ప్రజ చెప్పే dialogue.... Simply Superb!

చలన చిత్ర రంగంలో ఎంతో బిజీగా వున్నా ఈ స్థాయికి ఎదగడానికి దోహదం చేసిన నాటకరంగాన్ని మరువకుండా మంచి నాటికని రాసిన మా దివాకరబాబుగార్కి, పాఠకులకి మంచి రచన చదివే అవకాశం కల్పించిన 'హాసం' ఎడిటర్ శ్రీ రాజాగార్కి, ముచ్చటైన Illustrations గీసిన శ్రీ బాలిగార్కి, ప్రచురణాలయం నించి పాఠకుల దాకా వచ్చేందుకు కృషి చేసిన ప్రతివొక్కరికీ "నమోనమః".

మీ
ఎస్వీ. కృష్ణారెడ్డి,
చిత్రదర్శకుడు.

ప్రజ : యస్... నేను రైతునే పెళ్ళి చేసుకుంటా

నర : రైతుని పెళ్ళి చేసుకుంటావా? నీకు ఆస్తి, ఐశ్వర్యం, హోదా, దర్జా ఇవేం వద్దా?

ప్రజ : వద్దు

సైంటి: శాశ్వతంగా వుండిపోయే అందం వద్దా?

ప్రజ : వద్దు

కళా : గాలిలో తేలిపోయేలా చేసే పొగడ్తలు వద్దా?

ప్రజ : వద్దు.... ఏమీ వద్దు

నర : ప్రజా

ప్రజ : కాను... నేనిపుడు ప్రజా అని అందంగా పిలిపించుకున్న ప్రతిభావంతుల జగదీశ్వరిని కాదు. విశ్వసుందర్ని అంతకన్నా కాదు. విశ్వసుందరి... విశ్వసుందరి అంటూ నావెంట పడ్డారు. నేను కాదురా విశ్వసుందరిని అసలైన విశ్వసుందరి ఈ భూమాతరా! నేను మామూలు ప్రజల్లో ఒకదాన్ని. ఆకాశం నించి

భూమ్మీద పడ్డాక నాకు బుద్ధొచ్చింది. ఆకలి బాధ నుంచి బైట పడ్డాక తెలిసొచ్చింది. నాకేం కావాలో - నాకెవరు కావాలో! కడుపుకింత తిండి పెట్టలేని
నీ డబ్బేం చేసుకుంటాను?
నీ తెలివేం చేసుకుంటాను?
నీ కళనేం చేసుకుంటాను?
ఈ రైతు లేకపోతే... నువ్వూ, నువ్వూ, నువ్వూ... నేను.. ఎవ్వరం లేం.
మనందరిని బ్రతికిస్తున్న ఈ రైతుతోనే బ్రతుకు పంచుకోవాలనుకుంటున్నాను.

రైతు : మట్టి పిసుక్కునే వాడ్ని పెళ్ళి చేసుకోవడానికి పల్లెటూళ్లలోనే ఏ ఆడపిల్ల ఒప్పుకోవడం లేదు, అలాంటిది నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటానంటావేంటి?

రైతుని ప్రజ బ్రతిమాలుతోంది మైమ్
మరోపక్క -

కళా : ప్రజ మనల్ని ఇంత మోసం చేస్తుందా?
సైంటి : ఇంత ఫుడ్ పెట్టగానే వాడివైపు టర్న్ అయిపోయింది.
నర : ఈ రైతుని లేపేస్తేగానీ ప్రజ మనకి దక్కదు.
కళ : అయితే వాడ్ని చంపేద్దాం.
సైంటి : ప్రజని దక్కించుకుందాం.

రైతుమీదకి వచ్చారు.

రైతు : ఏందండి.. ఏందట్టా మీదమీదకి వత్తన్నారు?
నర : ఎన్నో ఆశలు పెట్టి మేం ప్రజని మా మావైపు తిప్పుకుంటే జస్ట్ అన్నం పెట్టి నీవైపు తిప్పుకుంటావా?
కళా : దట్ టూ చద్దన్నం
మేధా : నిన్ను బతకనివ్వం రా.

రైతుని చంపబోయారు

ప్రజ : రేయ్ (గొడ్డలి తీసుకొని)వదలండి అతన్ని వదలకపోతే మిమ్మల్ని నరికి పారేస్తా (రైతుని వొదిలి పారిపోయారు). ఛ... మీరసలు మనుషులేనా? అన్నం పెట్టిన రైతుని చంపాలనుకుంటారా... లాభాల మీద ఆశతో ఉన్న డబ్బంతా వ్యాపార రంగంలో పెట్టుబడి పెడుతూ వ్యవసాయరంగం గురించి ఆలోచించని నీలాంటి డబ్బున్నవాళ్ళు రైతుని కొంత చంపేసారు.
డబ్బుకి కక్కుర్తిపడి రైతుకి అన్యాయం జరుగుతుందని తెల్సినా నీలాంటి సైంటిస్టులు కొందరు నకిలీ విత్తనాలు, నకిలీ పురుగు మందులు కనిపెట్టి రైతుని ఇంకొంత చంపేసారు.
అన్యాయమైపోతున్న రైతుల కథ గురించి ఆలోచించకుండా, వాళ్ళ కథ వ్యథ ప్రజలకి తెలియచేయకుండా ప్రేమకథల మత్తులో మునిగిపోతున్న నీలాంటి కళాకారులు రైతుని మరికొంత చంపేసారు.
ఆఖరికి....కొనవూపిరితో కొట్టుమిట్టాడుతున్న రైతుని పూర్తిగా చంపటం కోసం ముగ్గురూ ఏకమయ్యారు. మీకన్నా జంతువులే నయంరా.
ఈ అడివిలో జంతువులు
నీలాగా ఇండస్ట్రియలిస్ట్ కావు.
నీలాగా సైంటిస్ట్ కావు
నీలాగ ఆర్టిస్ట్ కావు.
కానీ అవి మీకంటే హాపీగా బ్రతుకుతున్నాయి.

"దేశానికి రైతే వెన్నుముక"- అని చాటి చెప్పే 'నమోనమః' నాటిక రచయిత - నాటిక కథను ఓ వినూత్న పద్ధతిలో చెప్పడం ప్రేక్షకుడికి మంచి రిలీఫ్‌ను ఇవ్వడమే కాక ప్రతి ఒక్కరిని ఆలోచింపజేసింది. ఇది రచయిత మేథాశక్తికి నిదర్శనం!

నాటిక కథ చిత్రమైన మలుపులు తిరుగుతుంది. చివరికి సైంటిస్టు, కళాకారుడు, ధనవంతుడు, యువతి ప్రజ ఆకలిగా వుండటంతో భరించలేని ఆకలినొప్పి వారిని ఆవరించడం వల్ల ఒకరినొకరు చంపుకుని కాల్చుకుని తినేస్థితికి వస్తారు. అదే సమయంలో ఓ రైతు సుదూరప్రాంతం నుండి చద్దిఅన్నం, మంచినీళ్ళు తీసుకుని ఆ దారిన పోతూ వారికి ఆకలి తీరుస్తాడు.

నిజాన్ని గ్రహించిన ఆయువతి ఆరైతు అందరికన్నా గొప్పవాడని - అన్నం పెట్టగలిగిన వాడే నిజమైన హీరో అని- ఇది ప్రపంచ సత్యమని - అందరి కంటే విశ్వసుందరి ఈ భూమాతేనని - రచయిత చెప్పడం హేట్సాఫ్.

పి.అబ్బులు, (ఎడిటర్-కళాజగతి),
న్యాయనిర్ణేత,
చెన్నమల్లేశ్వర కళాపరిషత్,
అమలాపురం.

అంటే.. ఒక ప్రాణి సంతోషంగా బతకటానికి
డబ్బు అవసరం లేదు.
తెలివితేటలు అవసరం లేదు.
కళ అంతకన్నా అవసరం లేదు.
తింటానికింత తిండి వుంటే చాలు.
ఆ తిండి పెడుతున్న దేవుడ్రా ఈ రైతు.
దేవుడు మనకి ప్రాణం మాత్రమే ఇచ్చాడు. కానీ రైతు ప్రతి పూటా మనకి తిండి పెడుతూ ఆ ప్రాణాన్ని నిలబెడుతున్నాడు. అటువంటి రైతు ప్రాణాలు తియ్యాలని చూసిన మీరు ప్రాణాలతో వుండకూడదు. ప్రాణాలతో వుండకూడదు.

గొడ్డలి ఎత్తింది.

నర : మమ్మల్ని క్షమించు
ప్రజ : మిమ్మల్ని క్షమించడమా నెవర్

చంపబోయింది.

ముగ్గురూ: వద్దు.... మమ్మల్ని చంపొద్దు.

పరిగెత్తారు.



వెంటపడింది.

ముగ్గురూ పరిగెత్తి చివరికి రైతు కాళ్ళమీద పడి

నర : రైతూ.. కాపాడు..

సైంటి : ప్రజ ఆవేశం చూస్తుంటే... మమ్మల్ని చంపేసేలా వుంది.

కళా : నువ్వు చెబితే కాని ప్రజ ఆగదు మా ప్రాణాలు కాపాడు ప్లీజ్

రైతు : ఆగు....

ఆగింది.

ప్రజ : ఆగను.. వాళ్ళని చంపి తీరుతాను.

రైతు : నేను నీకు కావాలంటే... నువ్వాళ్ళని చంపకూడదు.

ప్రజ : రైతూ!

రైతు : ఏంది పెజా ఏందీ నీ ఆవేశం అంటే నీకే పిచ్చిపడితే ఆ పిచ్చేనా ఏ గాలి పడితే ఆ గాలేనా? ఏందనుకుంటనావ్ అసలు... ఏం తెల్సు నీకసలు...

ఇప్పుడు నీకన్నం పెట్టాను. ఆకలి తీరింది.

మల్లా ఆకలేసే వరకూ ఏం చేత్తా... కాలచ్చేపం కావాలిగా... కావాలంటే మరి... హరికథో, బుర్రకథో,

(కళాకారుడ్ని వుద్దేశించి)- నాటకమో, సినిమానో ఈయన సూపించాలి కదా. ఇంతకు ముందు పంటకు సీడ పురుగు పడితే బాధపడటం తప్ప ఏంసేసేవాళ్ళం కాదు. ఇప్పుడు మందు కొట్టి సీడ వదిలించుకుంటున్నాం.

అలాంటి మందు కనిపెట్టాలంటే ఇలాంటి

(సైంటిస్టుని వుద్దేశించి)- మడిసి కావాలి కదా.

ఈల్లందరూ ఇయన్నీ సేయాలంటే ఇలాంటి

(నరసింహాన్ని వుద్దేశించి)-

మారాజు డబ్బు ఇవ్వాలి కదా

అంటే ఏటీ.. సీమకాడ్నించి ఆ సీమని పుట్టించిన బెమ్మదేవుడి వరకూ ఒకరవసరం ఒకరికి వుంటుంది.

అందుకే

మడిసిని మడిసి సంపుకోకూడదు.

మడిసిని మడిసి బతికించుకోవాలి.

ప్రజ : చూడండ్రా...

అన్నం పెట్టిన అతన్ని చంపాలనుకున్నార్రా మీరు. తనని చంపాలనుకున్న మీరు బతకాలనుకుంటున్నాడు అతను.

ముగ్గురూ మౌనంగా వున్నారు.

ప్రజ : ఇంకా అలా పశువుల్లా నిలబడ్డారేంటి? క్షమాపణ అడగండి.

నర : మమ్మల్ని క్షమించు రైతూ

రైతు : భలేవారే... నేను చెమించడం ఏంటి?

నర : రైతన్నా.. నిన్ను నిర్లక్షం చేసిన మా కళ్ళు తెరిపించావ్.

సైంటి : నీకు మా అందరి అవసరం కన్నా మా అందరికీ నీ అవసరం ఎక్కువుంది.

కళా : శ్రీశ్రీ గారు చెప్పినట్టు ఈ దేశానికి కావాల్సింది అణ్వస్త్రాలు కాదు అన్నవస్త్రాలు.

నర : నువ్వు రైతువు కాదు ప్రత్యక్ష దైవానివి.

కళా : అపర అన్నపూర్ణ అవతారానివి.

సైంటి : అన్ని దానాల్లోకి అన్నదానం గొప్పదంటారు.

నిత్యాన్నదానం చేసే అన్నదాతా

నమోనమః

చేతులెత్తి రైతుకి దండం పెడుతూ ఒకేసారి...

అందరూ : నమోనమః

- శుభమ్-

## అంకితం



వాడ్ని

తమ్ముడు అనడం కన్నా మిత్రుడు అనడం నాకిష్టం!

వాడూ, నేనూ

పలకా, బలపంనించి

కలమూ పుస్తకం వరకూ

కలిసి చదువుకున్నాం

కలిసి కలలు కన్నాం!

ఆ కలలు కల్లలు కాలేదు.

వాడు

చిత్రకారుడు అయ్యాడు

నేను

రచయితని అయ్యాను.

అకస్మాత్తుగా, అయిదు పదులు నిండీ నిండగానే

వాడ్ని 26.06.2003 తేదీన

తిరుమలేశుడు తన సన్నిధానానికి పిలిపించుకుని

దర్శనం ఇచ్చి మరీ తనలో ఐక్యం చేసుకుని మోక్షం ప్రసాదించాడు

ఈ లోకానికి ఇక తిరిగిరాని

శ్రీమాన్ "మాడభూషి దినకరబాబు"

దివ్యస్మృతికి ఈ 'నమోనమః" నాటిక అంకితం.

- దివాకరబాబు

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-27402993

## జగతి రథం జై కొడుతూ



ప: జగతి రథం జైకొడుతూ
ప్రగతి పథంపై పోనీ
ప్రగతి పథంపైన జగతి
పండు వెన్నెలై రానీ

చ॥ స్వార్థానికి కట్టనిమ్ము
శాశ్వతముగ సమాధి
అదియే దేశాభ్యుదయపు
అందమైన పునాది ॥జగతి॥

చ॥ హద్దులేక వ్యాపించే
అవినీతిని అణచనీ
మంచిదారిలోకి తిరిగి
మనజాతిని మలచనీ ॥జగతి॥

చ॥ మనిషి మనిషి కల్లనీ
మమతయనే అనుబంధం
అన్ని దిశల చల్లనీ
అనురాగం సుమగంధం ॥జగతి॥

రచన : డా॥వడ్డేపల్లి కృష్ణ
గానం, సంగీతం : చిత్తరంజన్
రాగం : నఠభైరవి 20వ మేళకర్త రాగం
ఆరోహణ : స రి గ మ ప ద ని స
అవరోహణ : స ని ద ప మ గ రి స
- అసావ్‌రీ థాట్ (హిందుస్తాని సం॥)
తాళం : త్రిశ్రగతి (కర్ణాటక సం॥)
దాద్రా (హిందుస్తాని సం॥)

షడ్జము, చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

ఇవేగాక యీ రాగానికి అన్యస్వరమైన చతుశ్శృతి దైవతాన్ని కూడా మిశ్రమం చేసి బాణీని కూర్చాను. లలిత సంగీతానికి ఎంతో అనువైన రాగం నఠభైరవి. శాస్త్రీయ సంగీతంలో కంటే లలిత సంగీతంలోనే యీ రాగం ఎక్కువగా ప్రాచుర్యాన్ని పొందింది. చాలా మంది స్వరకర్తలు ఎన్నో పాటలను యీ రాగంలో కూర్చి మనకందించారు. హిందుస్తానీ సంగీతంలో ఏ రాగానికైనా, అన్యస్వరాలను భావ, రస సిద్ధికై మిళితం చేసి ఆ రాగం పేరుకు 'మిశ్ర్' అని కలిపి వాడడం ఆనవాయితీగా వస్తున్న ఆచారమే. ఠుమ్రీ, భజన్, లైట్ ధున్ మొదలగు వాటిని కచేరీలలో ఆ 'మిశ్ర్' రాగాలలో గానం చేస్తుంటారు విద్వాంసులు. అలాగే లలిత సంగీతంలో కూడా రాగాలకు మిశ్రమం చేసి సంగీతం కూర్చడం పరిపాటి. నవ్యత కోసం, భావవ్యక్తీకరణ కోసం అవసరాన్ని బట్టి రాగాలలో మిశ్రమం చేయడం లలిత సంగీతంలో ఒక ప్రాముఖ్యత గల అంశం కూడా. అయితే నఠభైరవికి అన్య స్వరమైన చతుశ్శృతి దైవతాన్ని కూర్చడం విశేషం. ఆకాశవాణి ప్రసారం చేసిన గీతాలలో రజని గారు రచించి స్వరపరచిన "మన భారత రథకేతనమున త్రివర్ణ రాగం", నా సంగీతంలో డా॥బి.ఆర్.శాస్త్రి గారి రచన "మరచితివానను పరమేశ్వరి", విజమూరి శివరామారావు రచించిన "ఓ నవభారత జాతిపితా" మొదలైన గీతాలు చతుశ్శృతి దైవతం యొక్క మిశ్రమంతో రూపొందినవి. హిందీ చలన చిత్రాలలో శంకర్‌జైకిషన్, హేమంత్‌కుమార్, మదన్‌మోహన్, సలిల్ చౌదరి వంటి సుప్రసిద్ధ సంగీత దర్శకులు కూడా యీ మిశ్రమంతో పాటలెన్నిటినో మనకందించారు.

సమాజ శ్రేయస్సుకు, దేశ ప్రగతికి అవరోధమైన స్వార్థాన్ని, అవినీతిని వీడి మానవుడు తన తోటి వారికి మమతానురాగాలను పంచి అందరితో కలిసి జాతి పురోగతికై పాటుపడాలని చాటి చెప్పే వడ్డేపల్లి కృష్ణ గారి "జగతి రథం జైకొడుతూ ప్రగతి పథంపై పోనీ" అనే గీతం 1972లో ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో నేను పాడగా 'ఈ మాసపు పాట'గా ప్రసారమై విస్తృత ప్రచారాన్ని పొందింది.

ప॥ పపప | ససా | నిదేని | నినీ |
జగతి | రథం | జై . కొ | డుతూ |
పపద | పమా | పాస | , సా |
ప్రగతి | పథం | పైపై | . కి |
సగరి | సని | నిద | నినిని |
ప్రగతి | పథం | పైప | న జగతి |
పనిద | పగమ | పాసే | నిదప |
పం. డు | వె. న్నె | లై రా | . నీ. ॥జగతి॥

1.చ॥ నిని | , నిని | దానిద | మామ |
స్వార్థా | . నికి | కట్టె . | నిమ్ము |
మపమ | రిరిమ | దపా | పా, |
శా . శ్వ | తముగ | సమా | ధి . |
పపని | పద్దేని | రిరి | రిరిరి |
అదియే | . దే . | శాభ్యు | దయపు |
సరిస | నిదేని | పదస | సా , |
అం. ద | మై . న | పునా . | ది . ॥జగతి॥

మిగిలిన రెండు చరణాలు కూడా మొదటి చరణంవలె పాడాలి.

దే = చతుశ్శ్రుతి దైవతం



## డా॥ వడ్డేపల్లి కృష్ణ

ఆధునిక తెలుగు సాహిత్యంలో మంచి గేయకవిగా పేరొందిన శ్రీ వడ్డేపల్లి మూడు దశాబ్దాలకు పైగా ఆ రంగంలో సేవలందిస్తున్నారు. 1969 నుండి ఆయన గేయాలు ఆకాశవాణి ద్వారా ప్రసారమౌతున్నాయి. సుమారు 500 పాటలు ఆకాశవాణిలోను, 200 పాటలు దూరదర్శన్‌లోను ఆయనవి యీనాటివరకూ ప్రసారమైనాయి. ఇవేకాక ఆయన తెలుగు చలనచిత్రాలకు కూడా చాలా పాటలు రచించారు. తపాలా శాఖలో వృత్తిని ముప్పై సంవత్సరాల వరకు నిర్వహించి పదవీ విరమణ తరువాత కూడా రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తున్నారు కృష్ణగారు. ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలు నిర్వహించిన పలు కవి సమ్మేళన కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆకాశవాణి, దూరదర్శన్ కార్యక్రమాలలో చాలా మంది స్వరకర్తలు కృష్ణగారి గీతాలకు సంగీతం కూర్చారు. టి.ఆర్.జయదేవ్, పాలగుమ్మి



విశ్వనాథం, శ్రీమతి సి.ఇందిరామణి మున్నగువారు ఆయన పాటలను స్వరపరిచారు. నా సంగీతంలో కూడా ఆయనవి చాలా పాటలు ఆకాశవాణిలో ప్రసారమైనవి - 'అంతులేని ఆశలున్న అంతరంగమా', 'జగతి రథం జైకొడుతూ', 'వెన్నెలంత చల్లనిది స్నేహము', మొదలగునవి మచ్చుకు కొనన్ని. 'మళ్ళీ జన్మించు ప్రభూ' - క్రీస్తు జన్మదిన సందర్భాన్ని పురస్కరించుకుని 1983 డిసెంబరులో 'ఈమాసపు పాటగా ప్రసారమైన యీయన రచనను మానాప్రగడ నరసింహమూర్తి నా సంగీత సారథ్యంలో గానం చేశాడు. అనేకమైన సంగీత రూపకాలు కూడా కూడా ప్రసారమైనాయి ఆకాశవాణిలో. 1995లో కృష్ణగారు రచించిన 'మనమంతా ఒక్కటనే మంచి మనసుతో పెరగాలి' అనే పాటకు నేను సంగీతం కూర్చి స్కూలు విద్యార్థులచే పాడించగా ఆ గీతం వివిధ భాషలలో నిర్వహించబడే సామూహిక గేయ శిక్షణ కార్యక్రమానికై జాతీయ స్థాయిలో గుర్తింపు పొంది ఆ ఏడాది సెప్టెంబరు మాసంలో దేశంలోని అన్ని రేడియో కేంద్రాల నుండి ప్రసారమయింది.

శ్రీ, భక్త కవిపోతన, అయ్యప్ప అవతారం, భారతీయ సంస్కృతి శిఖరాలు, శ్రీ గురు

రాఘవేంద్ర స్వామి మొదలగు టి.వి.సీరియల్స్‌కు కథ, సంభాషణలు, పాటలు రచించారు. ఇవేకాక ఈటీవి, జెమిని మొదలైన ఛానల్స్‌కు కూడా వ్రాస్తున్నారు. కొన్నిటికి కో-ఆర్డినేటర్‌గా పనిచేశారు. 'కనరానీదేశం', 'వెలుగుమేడ', 'రాగరథం', 'చిరుగజ్జెలు', 'వడ్డేపల్లి కవిత', 'వడ్డేపల్లి గేయవల్లి' యిత్యాదివి ఆయన వెలువరించిన గ్రంథాలు. ఆడియోక్యాసెట్లు, ఆల్బంలుగా ఎన్నో వెలువడినాయి. 1989లో 'ఉగాది వేళ' అనే రూపకం దూరదర్శన్ నేషనల్ నెట్‌వర్క్‌లో ప్రసారమైంది. 'వడ్డేపల్లి గేయవల్లి' పుస్తకానికి తెలుగు విశ్వవిద్యాలయం వారి 'సాహిత్య పురస్కారం', 'సాహితీ గౌతమి' అవార్డు (1996), 'దేవులపల్లి కృష్ణశాస్త్రి' అవార్డు (కృష్ణగారి హాలాహలం' గ్రంథానికి ఆంధ్ర మహిళాసభ వారిచే) యింకా అనేక అవార్డులు కృష్ణగారు పొందారు. 'తెలుగులో లలిత గీతాలు' అనే అంశంపై పరిశోధన గావించి డాక్టరేట్‌ను పొందారు.

సాహితీ రంగంలో నిరంతరం విశేషకృషితో నిర్విరామంగా సేవలందిస్తున్న 'గేయకిరీటి' బిరుదాంకితుడు డా॥వడ్డేపల్లి కృష్ణ నాకత్యంత ఆత్మీయుడు.

'పిల్ల జమిందార్' సినిమాతో సినీ పరిశ్రమలో కూడా అడుగుపెట్టిన వడ్డేపల్లి కృష్ణ ఇప్పటివరకు 50 చిత్రాలలో 70 పాటలు రాశారు. 'భైరవద్వీపం' సినిమాలోని 'అంబాశాంభవి భద్రరాజగమనా' పాట ఆయన హిట్‌సాంగ్స్‌లో ఒకటి.

**'హాసం' 16-31 మే 2003 సంచికలో నరభైరవి/మిశ్రమ నరభైరవి రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు ప్రచురించబడినవి.**

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

## 1957


షమ్మీ కపూర్

'తుమ్‌సా నహీ దేఖా' సక్సెస్‌తో షమ్మీ కపూర్ సరికొత్త ఇమేజ్ సంపాదించుకోగలిగారు. 'జవానియాఁ యే మస్త్ మస్త్ బిన్ పియే', 'చుప్‌నే వాలే సామ్‌నే ఆ..', 'సర్ పర్ టోపీ లాల్', 'ఆయీ హు దూర్ సే', 'దేఖ్ కసమ్ సే' పాటలు మంచి హిట్ అయ్యాయి.

భాంగ్రా-పాప్ మ్యూజిక్‌లు రాజ్యమేలుతున్న దశలో ఈ రెండు చిత్రాలతో(నయాదౌర్, తుమ్‌సా నహీఁ దేఖా) ఒకే సంవత్సరంలో మూడు సూపర్‌హిట్స్‌ను ఓ.పి. సాధించగలిగారు.


మదన్‌మోహన్

మదన్‌మోహన్‌కు కంపోజర్‌గా చక్కటి గుర్తింపు తీసుకువచ్చిన సంవత్సరమిది. 'కౌన్ ఆయా మేరా మన్ కే ద్వారా'(మన్నాదే), 'హమ్‌సే ఆయా న గయా'(తలత్), 'మేరీ వీనా తుమ్ బిన్ రోయే'(లతా) లతో హిట్ సాధించటమే కాదు, రఫీతో పాడించిన డివోషనల్ సాంగ్ 'ఓ మాతీ కే పుత్లీ', 'గేట్ వే ఆఫ్ ఇండియా' చిత్రంలోని 'సప్నే మేఁ సాజన్', 'న హంసోఁ హమ్‌సే' పాటలు మంచి హిట్స్.


'మదర్ ఇండియా' లో నర్గీస్

కిశోర్‌కుమార్, ఆశాభోంస్లేలతో రెండు వెర్షన్లతో సి.రామచంద్ర పాడించిన 'ఇనా మీనా దేఖా...' పాట సూపర్‌హిట్ కావటమే కాదు 'శారదా' చిత్రం కోసం ఆయన స్వరపరచిన 'యేచాంద్ జహాఁ హో జాయే' గీతం లతా హిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది.

ఈ సంవత్సరం విడుదలై మ్యూజికల్‌గా సూపర్‌హిట్ సాధించిన చిత్రం 'మదర్ ఇండియా'. నౌషాద్ స్వరపరచగా ఆశా, షంషాద్, రఫీ, మన్నాదే గానం చేసిన 'దుఖ్ భరే దిన్ బీతే రే భయ్యా', లతా, రఫీ గానం చేసిన 'మత్‌వాలా జియా', లతా గానం చేసిన 'నగరీ నగరీ ద్వారే..', దునియా మేఁ హమ్ ఆయే హై తో' పాటలు మంచి హిట్ అయ్యాయి.


రవి

'ఏక్ సాల్' చిత్రం కోసం రవి స్వరపరిచిన 'సబ్ కుచ్ లుటాకే హోష్ మేఁ ఆయే' పాట తలత్ మొహమూద్ హిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది.

ఏ.వి.యం.సంస్థ నిర్మించిన 'భాభి' చిత్రంతో చిత్రగుప్త అగ్రశ్రేణి సంగీత దర్శకులలో ఒకరిగా చేరిపోయారు. లతా, రఫీ గానం చేసిన 'చలీ చలీ రే పతంగ్', రఫీ పాడిన 'చల్ ఉడ్ జా రే పంఛీ' ఈ చిత్రం లోని హిట్ గీతాలు.


చిత్రగుప్త


దిలీప్‌కుమార్

లతా డ్యూయెట్ 'లగీ నహీఁ ఛుటే రామ్...' (ముసాఫిర్)ద్వారా దిలీప్ కుమార్‌ను సింగర్‌గా సలీల్‌చౌదురి పరిచయం చేశారు. కిశోర్ పాడిన 'మున్నా బడా ప్యార్' కూడా ఆ చిత్రంలోని చక్కటి హిట్ గీతం.

-(వచ్చే సంచికలో మరికొంత)


ఐ లవ్ యూ జయశ్రీ
?!!!
అలాగా?!
సారీ సార్ పోలీసుల్ని పిలవకండి సార్... ప్లీజ్ సార్ సార్
అదికాదు లేవోయ్ ఆ పోలీసు యూనిఫాం మీదున్న నంబరు చూడు
చూశాన్సార్ నం.222
జయశ్రీ పెళ్ళాడ్డానికి ఒప్పుకుంటే వెయిటింగ్ లిస్ట్ లో ఉన్నాని నంబర్ అదన్నమాట
కుయ్యో బాబోయ్
వాడి నంబర్ సరే. నంబర్ వన్ ప్లేస్‌లో ఉన్నదెవరో చెప్పుకో చూద్దాం
త్రినాథ్ రావు ఉంటాడు
బడాయిపోకు. సిన్సియర్‌గా చెప్పు
సరే... అయితే చిన్నారాయుడు అయి ఉంటాడు
ఎవరెవరి పేర్లో చెప్పావు కానీ నీ పేరెందుకు చెప్పవ్?
!!!
చెప్పకూడదు.... ఎందుకంటే నువ్వున్నది నా వెయిటింగ్ లిస్ట్‌లో కదా?




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం
బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్లపూడి వెంకటరమణ

వెండితెర నవల
ప్రారంభం

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు





అదొక లోకం. ఏ లోకమో కరెక్టుగా తెలియదు. అంతటా దట్టంగా వేంఘాలు. బహుశా శూన్యలోకం కావచ్చు. వెండకు మహతిని తగిలించుకుని, ఒక చేతితో చిట్టి తాళం వాయించుకుంటూ ఏదో పాట పాడుతూ ట్విస్టు డాన్సు చేస్తూ వెళ్తున్నాడు నారదుడు. ఎప్పుడూ నీరదాల మధ్య తిరుగుతారు కాబట్టి నారదుడయ్యాడేమో!

ఆయనకిప్పుడు చచ్చే ఆకలిగా ఉంది. పండ్లు ఫలాలు, అన్నం, పప్పు కూరలతో ఆయన కడుపునిండదు. ఆయనకు ఎంతో ఇష్టమైంది. ప్రీతిగా ఆరగించేది కలహభోజనం. ఎవరో ఒకరి దగ్గరకెళ్ళి అవతల వాళ్ళ మీద ఏదో చెబుతాడు. వారి కడుపు రగిలిపోయేలా చేస్తాడు. వారిచేత అవతల వారిని నాలుగు మాటలనిపిస్తాడు. వారు కోపంతో భగభగమండిపోతుంటే ఆయన పొట్ట నిండుతుంది. అంతేకాదు. కడుపుబ్బరం భుక్తాయాసం కూడా వస్తాయి. అవి దిగిపోయిందాకా విలవిలలాడుతాడు. ఒక డైజిన్ టాబ్లెట్టో, జెలుసిల్ సిరప్పో పుచ్చుకుంటే ఆ ఉబ్బరం తీరదు. తాను కలిసి వచ్చిన వ్యక్తి అన్నమాటలు అవతలి వారి చెవిలో ఊదాలి. వారికి కోపం తెప్పించాలి. ఇద్దరూ జుట్టుజుట్టు పట్టుకుని సిగపట్లు పడుతుంటే కడుపు నిబ్బరించి సుబ్బరంగా నవ్వుకుంటూ మరో చోటికి వెళ్తాడు.



ఈ జగడాలు పెట్టడం వేర్వేరు వ్యక్తులకు కాక ఒకే కుటుంబంలో నివసించే భార్యాభర్తలు, తండ్రీకొడుకులు, అన్నాచెల్లెళ్ళు ఇటువంటి వారి మధ్య పెడితే ఆ మజాయే వేరే. వాళ్ళిద్దరూ నువ్వెంత అంటే నువ్వెంత అని పోట్లాడుకుంటుంటే వదహారు కూరలతో భోంచేసినంత తృప్తి ఆయనకు.



ప్రస్తుతం ఆయన ఆ పని మీదే ఉన్నాడు. వైకుంఠం చేరాడు. ద్వారం తెరుచుకుంది.

మామగారి దగ్గర కట్నంగా కొట్టేసిన పాలసముద్రం మీద మెత్తని పట్టు చర్మం గలిగిన పాము సోఫాలో ఏదో ఆలోచిస్తూ విలాసంగా ఒత్తిగిలి వడుకున్నాడు నారాయణుడు. పట్టుచీర కట్టుకుని, నడుముకు వడ్డాణం పెట్టుకుని నెత్తిన కిరీటం ధరించి మెడనిండా నగలు వేసుకుని భర్త పాదాల చెంత కూర్చుని పాదాలను వత్తుతున్నది లక్ష్మీదేవి.



ఈ దేవతా స్త్రీలేంటో? ఒట్టి 'సత్తెకాలెపు సత్తెమ్మ'ల్లా పతిదేవుని పాదాల వద్దే పడివుంటారు. వారు అడవులకు వెళ్తే వీరూ అడవులకెళ్తారు నారచీరలు ధరించి.

ఇంత సిరి సంపదలున్నా, గూడలు విరిగిపోయేలా అస్తమానం భర్త కాళ్ళు పిసుకుతూ కూర్చునే ఖర్మ ఏమిటో? ఏంటో ఆ బ్రహ్మరాత! ఇలా ముప్పొద్దులా పెళ్ళాం చేత కాళ్ళు పిసికించుకుంటాడు కాబట్టే ద్వాపరయుగంలో పెళ్ళాం కాలి దెబ్బ రుచి చూశాడు శ్రీహరి.



'లక్ష్మీం క్షీర సముద్ర రాజతనయాం' అన్నాడు నారదుడు.

నారదుడి స్తోత్రం విని ఆనందపడి 'చూశావా నా గొప్ప' అన్నట్లు భర్త వంక చూసింది శ్రీదేవి.



శ్రీరంగధామేశ్వరీ
దానీభూత సమస్త
దేవవనితాం

లక్ష్మికి మరంత ఆనందం వేసింది. నారాయణుడికి తిక్కరేగి 'ఎవడ్రావీడు?' అన్నట్లు కనుగుడ్లు ఎడమవైపు తిప్పి నారదుడిని చూశాడు. నా గురించి ఒక ముక్క కూడా అనడేం? అన్నట్లు ఫీలింగ్ ఇచ్చాడు. గ్రహించాడేమో నారదుడు - విష్ణువుకు నమస్కరిస్తూనే



వందేముకుందప్రియామ్

అన్నాడు. విష్ణువు ధీమాగా లక్ష్మి వంక చూసి 'ముకుందుడి ప్రియురాలిగానే నీకు గుర్తింపు సుమా' అన్నట్లు చూశాడు. నారదుడు కొనసాగించాడు.

శ్రీ మన్మంద కటాక్షలబ్ధ విభవత్
బ్రహ్మేంద్ర గంగాధ రాయ్

విష్ణువుకు కొంచెం ఆనందం కలిగి లేచి కూర్చున్నాడు. భజన చేసే వారికే కదా బాసుల దీవెనలు!

అయితే నారదుడు విష్ణువును చూసీ చూడనట్లుగా దాటుకుంటూ వెళ్ళిపోయి లక్ష్మీదేవి ముందు వంగొని చేతులు జోడించాడు. నారాయణుడు చిరాకుపడ్డాడు.



త్వం త్రైలోక్య
కుటుంబినీ సరసిజాం
వందేముకుంద ప్రియాం

అన్నాడు. సిరిసంపదలతో తులతూగేవారి వద్దకే కదా ఎవరైనా వెళ్ళేది!

'ఏమిటి విశేషాలు నారదా' అని కళ్ళతోనే ప్రశ్నించింది కమలాలయ.



"అమ్మా! నాదొక్క ధర్మ...." మైకు అవసరం లేకపోయినా నాలుగు మైళ్ళ దూరం అయినా వినిపించేంత పెద్దగా పద్యం పాడే సూరిబాబు గొంతుతో.

"ష్... ఆయన నిద్రలో ఉన్నారు. మెల్లగా మాట్లాడు" సైగలు చేసి చెప్పింది మున్నీటి పట్టి.



గొంతుస్థాయి బాగా తగ్గించి 'నాదో ధర్మసందేహం' అన్నాడు నారదుడు.

"నా భార్యతో ఏంటి వీడు మాట్లాడేది రహస్యంగా" అన్నట్లు చిరాగ్గా చూశాడు శ్రీహరి.

"నాయనమ్మగారూ... మరీ" చెప్పబోయాడు నారదుడు.



ఆ సంబోధన కోపం తెప్పించింది లక్ష్మికి. తాను అంత వృద్ధురాలినా అని బాధపడింది. ఐదేళ్ళ పిల్లాడు పదేళ్ళ పిల్లను 'ఆంటీ' అని పిలిచే పాడురోజులాయే. నారదుడు దేశ దిమ్మరిలా ముల్లోకాలూ తిరుగుతుంటాడు. కాబట్టి లేటెస్టు ట్రెండులన్నీ ఆయనకు తెలుసు. పాపం! తనేమో పతి పాదాలను వదలదాయె! లక్ష్మికి కోపం వచ్చిందని గ్రహించిన నారదుడు వివరణ ఇచ్చుకున్నాడు.

"అంతేకదమ్మా! నన్ను కల్పించిన మా నాయన బ్రహ్మను కల్పించిన వాడు మీ ఆయన. అంటే నేను నీకు మనవడి వరసే కదమ్మా నాయనమ్మా" అన్నాడు లక్ష్మి కళ్ళలోకి సూటిగా చూస్తూ.



లక్ష్మి తెల్లబోయి చూసింది. నిజం నిష్ఠూరంగానే ఉంటుంది కదా! తలాడించింది.

"సరె సరె! సంగతేంటో చెప్పు" అడిగింది.

"తాతయ్య గారెపుడూ జబ్బు మనిషిలా కాళ్ళు జాపుకుని పడుకుంటాడు. నువ్వెపుడూ ఆయన కాళ్ళు పడుతుంటావు".

లక్ష్మి మరోసారి తెల్లబోయింది. నారదుడి పొట్టనిండటం ఆరంభించింది.

"ఆయనేమంత కష్టపడి పోతున్నాడని?" గూట్లో మరో రాయి విసిరాడు నారదుడు.

దొంగ చెవులతో ఆ మాటలు విన్న నారాయణుడు కంగారు పడ్డాడు.



"నువ్వెందుకు అస్తమానం ఆయన కాళ్ళు పట్టాలి?" అగ్నిలో మరో గరిటె ఆజ్యం పోశాడు నారదుడు.

లక్ష్మి ఆలోచనలో పడింది. నారదుడు ఇదే సమయమని భావించి మరి కొంచెం ఎక్కించాడు.

"ఆయన ఎక్కువేంటి? నీ తక్కువేంటి? ఏమిటీ విష్ణుమాయ?" అన్నాడు.



విష్ణుమాయ అన్న పదం వినపడగానే ఒడిలోనున్న విష్ణు పాదాలను కిందికి విసిరి కొట్టింది పద్మ కర. చేతులు కట్టుకుంది.

నారదుడి పొట్ట నాలుగో వంతు నిండింది. బ్రాహ్మడు దొరికినపుడే తద్దినం పెట్టాలన్నట్లు ఇంకాస్త రెచ్చగొట్టాడు.

"నీకు హృదయంలో స్థానమిచ్చానని అన్నాడు. కానీ పాదాల దగ్గర

కూర్చోబెట్టాడు. మాయదారి తాత కూడా మాయం చేస్తున్నాడు." అన్నాడు.



కొంపకు ఎసరొచ్చిందని అర్థమైంది కమల నయనుడికి. తటాలున కాళ్ళు లాక్కుని బాసింపట్టు వేసుకుని కూర్చున్నాడు.

"ఇందులో నీకొచ్చిన బాధేమిటి మనవడా?" అన్నాడు వెటకారంగా.



విష్ణువును అప్పుడే గమనించినట్లు ఆశ్చర్యం ప్రకటించి ఆయన వైపు తిరిగి నమస్కరించాడు నారదుడు.

"ఈ వంక దణ్ణాలు సరే... ఎవరు ఎక్కడ కూర్చుంటే నీకేం? ఎవరు ఎవరికి సేవ చేస్తే నీకేం? - అదీ ఆలుమగల మధ్య తంపులు పెడతావా? హన్నా" కోపంగా అన్నాడు శ్రీహరి.



నవ్వాడు నారదుడు. "ఆది దంపతులు! భూలోకానికి వరవడి మీరే కదా!" అన్నాడు.

"ఊ... అయితే?" ప్రశ్నార్థకంగా చూశాడు విష్ణువు. నారదుడు అటు ఇటు తిరుగుతూ "అక్కడ భూలోకంలో కూడా మగాళ్ళందరూ మీ ఈ జాయింటు ఫోటోలు చూపించి ఆడవాళ్ళ చేత బండ చాకిరీ చేయించు కుంటున్నారు. సేవ పొందడం మా హక్కు చెయ్యడం మీ ఖర్మ అని దబాయించి చెలాయిస్తున్నారు" అన్నాడు.



"అలా అడుగు నారదా అలా అడుగు గట్టిగా" కోపంగా అన్నది లక్ష్మి.

స్వామి లక్ష్మి వైపు కోపంగా చూశాడు. లక్ష్మి శేష తల్పం నుంచి కిందికి దిగి వీరావేశంతో నృత్యం చేస్తూ పాటందుకుంది.

అడగవయ్యా అయ్యగారి ఎక్కువేమిటో
చెప్పమను ఆడవాళ్ళ తక్కువేమిటో



నారదుడు తానొచ్చిన పని సఫలం అవుతున్నందుకు సంతోషించి తానూ అడుగులో అడుగు వెయ్యసాగాడు.

ఆ ఎక్కువేమిటో
ఈ తక్కువేమిటో

ప్రశ్నలు సంధించింది లక్ష్మి.

నారదుడి వైపు చూశాడు నారాయణుడు ఏం చెప్పాలో తోచక. నారదుడు ఆలోచనలో పడ్డాడు.



తటాలున ఏదో ఆలోచన వచ్చింది. సైగల ద్వారా నారాయణుడి చెవిలో ఊదాడు. నారాయణుడు కూడా ఆనందంతో నృత్యం మొదలు పెట్టాడు.

పదునాలుగు
భువనాలన్నీ
పాలిస్తున్నాను-
పరి పాలిస్తున్నాను.

కాబట్టే నేను ఎక్కువ అన్నట్లు ఫోజు పెట్టాడు. విష్ణువు చెబుతుండగా నారదుడు మెల్లగా లక్ష్మి చెవి దగ్గర చేరాడు. లక్ష్మి చెప్పింది.



ఆ భువనాలను
భువనాలను
పోషిస్తున్నాను.
నేను పోషిస్తున్నాను
సిరిలేని హరి
ఒట్టిదేశ దిమ్మరి
నేను వదిలి వెళ్ళినా
తనకు లేదు ఠికానా

సందర్భం అర్థమైంది నారదుడికి.



ఓ... ఏడుకొండలవాడి కథా
నువ్వు చెప్పేది! బాగుందమ్మా
కానీ కానీ

అంటూ ఇంకాస్త రెచ్చగొట్టాడు. దాంతో లక్ష్మికి హుషారొచ్చింది.



పెళ్ళి కోసం తిప్పలు -
చేశాడండీ అప్పులు -
నాతో పెళ్ళి కోసం తిప్పలు
చేశాడండీ అప్పులు -

రిపీట్ చేసింది.

నారదుడు నవ్వుతూ "వడ్డీ కాసుల వాడా - వెంకట రమణా - గోవిందా గోవిందా" వ్యంగ్యంగా అని నమస్కారం పెట్టాడు. లక్ష్మీదేవి ముఖాన నవ్వు విరిసింది.



లక్ష్మి దెప్పిపొడుపులకు జవాబిచ్చాడు విష్ణువు.

కొండమీద నేను -
మరి కొండకింద ఎవరో
నువ్వే అడగవయ్యా

నారదుని వైపు తిరిగి అన్నాడు. లక్ష్మి జవాబుతో

సిద్ధంగానే ఉంది.



నడిరేయి దాటగానే
దిగివచ్చేదెవరో
అడగవయ్యా
మగవాళ్ళ
గొప్పలేమిటో
చెప్పమను ఆడవాళ్ళ
తక్కువేమిటో

అన్నది.

శ్రీహరి మళ్ళీ శిరస్సు తడుముకున్నాడు. మళ్ళీ నారదుని వైపు దీనంగా "కింకర్తవ్యమ్?" అన్నట్లు చూశాడు. తన ఎత్తు పారి మొగుడూ పెళ్ళాలు తన్నుకుంటున్నందుకు తెగ సంబరపడిపోతున్న త్రిలోక సంచారి శ్రీహరివైపు కౌమోదకిని భుజాన పెట్టుకుని వానర ముఖ్యునిలా మూతి పెట్టి ఏదో అయిడియా ఇచ్చాడు. లక్ష్మీదేవి అను మానంగా వారివంక చూసింది. శ్రీహరి చిద్విలాసంగా నవ్వి తన గొప్పదనమేంటో ఈవిధంగా చెప్పాడు.



త్రేతాయుగాన నేను
ఆ శ్రీరామచంద్రుడిని

అన్నాడు. అయినా ఆ సిరుల రాణి జంకుతుందా?

అయినా సీతాపతి
అని పిల్చారండీ.
మిమ్ము పిల్చారండీ.

జవాబిచ్చింది ధీటుగా.



నరకాసుర వధ చేసిన
కృష్ణుడిని తెలుసా?

అన్నాడు నారాయణుడు. అయితే మాత్రం? మాటకు మాట అనకపోతే ఆమె పెళ్ళాం ఎలా అవుతుంది? అందుకే అన్నది.

సత్యభామను!
విల్లమ్ములు తెల్లంబుగ
పట్టిన సత్యభామను
వీరభామను

చెప్పింది.



పాపం శ్రీహరికేం తోచలేదు. ఇలా మాటకు మాట జవాబిచ్చే పెళ్ళాం ఉన్నవాడికి బుర్ర ఏం పనిచేస్తుంది? ఎన్ని భువనాలను ఏలినా పెళ్ళాం దగ్గర పిల్లే!

ఒకానొక న్యాయవాది గారు కోర్టుకు హాజరై కేసు విషయంలో తనవాదన వినిపించమని జడ్జిగారు ఆదేశించగానే 'మిలార్డ్... ఇవాళ పొద్దుట్నుంచి మా ఆవిడతో వాదించి వాదించి నా నోరు పడిపోయింది. మెదడు మొద్దుబారిపోయింది. ఇహ ఇక్కడ కూడా వాదించే ఓపిక లేదు. కేసు వాయిదా వెయ్యండి' అన్నట్టు!



అలాగే మధుసూదనుడికి కూడా మెదడు స్థంభించి పని చెయ్యడం మానేసింది. గొర్రె కసాయివాడినే నమ్మినట్లు మళ్ళీ నారదుడి సలహానే ఆశ్రయించాడు అంబుజనాభుడు. అప్పటికే కమ్మని కలహభోజనం కుతికల వరకూ వచ్చింది నారదుడికి. నారాయణుడు తననే సలహా అడగడం విస్తరి మడుస్తుండగా వడ్డించేవాడు మోసుకుపోతున్న బేసిన్‌లోంచి నాలుగు అప్పడాలు జారి తన విస్తట్లో పడ్డంత ఆనందం కలిగింది సైగలు చేసి ఏదో చెప్పాడు. విష్ణువుకు తగిన జవాబు దొరికింది.



భామగారి నోరు
బలే జోరుజోరు
మొగుడిని
దాన మిచ్చినారు
మొగసాలకెక్కినారు
ఆ తులాభారం
అదో తలభారం

అన్నాడు.



పుండుమీద కారం చల్లినట్లు పాత విషయాలను మరి కొంచెం తోడి -

భలే మంచి
చౌకబేరము

అన్నాడు నారదుడు.

శ్రీదేవేమైనా తక్కువ తిన్నదా?



అయ్యా -
దొరగారి పరువు
తులసీదళం బరువు!

బాణం విసిరింది.

నారదుడు పెద్దగా నవ్వి -

సత్యం సత్యం
పునః సత్యం
శ్రీమద్రమారమణ
గోవిందో హరి



అన్నాడు నమస్కారం పెట్టి తన కడుపునిండి పోయిందన్నట్లు ఫోజిచ్చాడు.

వాద ప్రతివాదాలు జోరుగా జరిగిపోవడంతో లక్ష్మీ నారాయణులిద్దరూ ఎడమొగం పెడమొగమై చెరో దిక్కు తిరిగారు.

-(ఇంకావుంది)

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | | |
|---|---|---|
| చిత్రం | : వీరాభిమన్యు(తెలుగు) | వీర అబిమన్యు(తమిళం) |
| రచన | : ఆరుద్ర | కణ్ణదాసన్ |
| సంగీతం | : కె.వి.మహాదేవన్ | కె.వి.మహాదేవన్ |
| గానం | : ఘంటసాల, పి.సుశీల | పి.బి.శ్రీనివాస్, పి.సుశీల |



తెలుగులో 'వీరాభిమన్యు' చిత్రమూ తమిళంలో 'వీర అబిమన్యు' చిత్రమూ దాదాపు ఒకేసారి రూపొందాయి. రెండు చిత్రాలకూ-దర్శకుడు వి.మధుసూదనరావు. సంగీతం సమకూర్చినవారు కె.వి. మహాదేవన్. రెండు చిత్రాలలోనూ నాయిక కాంచన. తెలుగులో శోభన్‌బాబు ధరించిన అభిమన్యుడి పాత్రను తమిళంలో ఎ.వి.ఎం.రాజన్ ధరించారు. (తమిళంలో 'అభిమన్యు' అనే ఉచ్చారణ లేదు. అందువల్ల చిత్రం పేరు 'వీర అబిమన్యు' అయింది).

తెలుగు చిత్రంలోని 'చల్లని స్వామివి నీవైతే', 'తాకిన చోట', 'రంభా ఊర్వశి తలదన్నే', 'అదిగో నవలోకం', 'చూచి వలచి' మొదలైన పాటల సందర్భాలలో తమిళ చిత్రంలో చోటు చేసుకున్న పాటలను కణ్ణదాసన్ రాశారు.

తెలుగు చిత్రంలోని 'చూచి వలచి' పాట ఉన్న చోట తమిళ చిత్రం కోసం కణ్ణదాసన్ రాసిన పాట 'తేన్ పాట్టు' (తేనె పాట) గా ప్రసిద్ధం. ఆ పేరు ఎందుకు వచ్చిందో ముచ్చటించుకొనే ముందు తెలుగు చిత్రం కోసం ఆరుద్ర రాసిన పాట పరిశీలించాలి. తెలుగు పాటను పాడినవారు ఘంటసాల, పి.సుశీల.

అతడు : చూచి వలచి చెంతకు పిలిచి
నీ సొగసులు లాలన చేసి
నీ సొంపుల ఏలికనైతి
ఆమె : చూచి వలచి చెంతకు చేరి
నా సొగసులు కానుక చేసి
నీ మగసిరి బానిసనైతి
అతడు : అందాలన్నీ దోచి ఆనందపు టంచులు చూచి
సందిట బందీ చేసి నా బందీ వశమైపోతి
ఆమె : నూతన వధువై నిలిచి వరుని వలపుల మధువుగ మారి
సఖుని ఒడిలో సురిగి కోటి సుఖముల శిఖరమునైతి
అతడు : వలపుల తేనియ మధురిమ గ్రోలితి
నిదురా జగమూ మరచి
ఆమె : నీవే జగమై నీలో సగమై
నేటికి నిండుగ పండితి

తెలుగు చిత్రం పాటల కోసం చేసిన బాణీలనే తమిళ చిత్రం కోసమూ వాడారు మహాదేవన్. 'చూచి వలచి' అంటూ మొదలయ్యే వలపు పాటకు శహన రాగం వాడడం ద్వారా మహాదేవన్ కొత్త ఒరవడి పెట్టారు.

తెలుగు పాటలో ఆరుద్ర రాసిన భావాలే తమిళగీతం ప్రతిధ్వనించినా- ఆ ప్రతిధ్వనులలో తేడాలూ కనిపిస్తాయి. పౌరాణిక చిత్ర గీతంలో 'బందీ' వంటి ప్రయోగం చిత్రంగా కనిపిస్తుంది. 'కోటి సుఖముల శిఖరము నైతి' అనే ప్రయోగం- నాయిక పరవశస్థితికి పరాకాష్ఠ. తెలుగు పాటలో 'వలపుల మధువు', 'వలపుల తేనియ' అని రెండు తీయని పలుకుబళ్లు ఉండగా తమిళ గీతంలో దాదాపు ప్రతి మాటనూ తేనెతో నింపారు కణ్ణదాసన్. తమిళగీతాన్ని గానం చేసినవారు పి.బి.శ్రీనివాస్, పి.సుశీల. 'వీర అబిమన్యు'లోని ఆ తమిళ



గీతం ఇది:

అతడు : పార్‌త్‌తేన్ శిరిత్‌తేన్  
పక్కత్ తిల్ అళైత్ తేన్ - అన్ను  
ఉనైత్ తేన్ ఎన నాన్ నినైత్ తేన్ - అన్ను  
మలైత్ తేన్ ఇదువెన మలైత్ తేన్

ఆమె : పార్‌త్ తేన్ శిరిత్‌తేన్  
పక్కమ్‌వర తుడిత్ తేన్ -అన్ను  
ఉనైత్ తేన్ ఎన నాన్ నినైత్ తేన్ - అన్‌ద  
మలైత్‌తేన్ ఇవరెన మలైత్‌తేన్

అతడు : కొడిత్ తేన్ ఇని యెంగళ్  
కుడిత్ తేన్ - ఎన ఒరు  
పడిత్ తేన్ పార్‌వైయిల్ కుడిత్ తేన్ - ఒరు  
తుళిత్ తేన్ శిందామల్ కళిత్ తేన్ - కైగళిల్  
అణైత్ తేన్ అళగినై రశిత్ తేన్

ఆమె : మలర్‌త్ తేన్ పోల్ నానుమ్  
మలర్‌న్‌దేన్ - ఉనక్ కెన  
వళర్‌న్‌దేన్ - పరువత్‌తిల్ మణన్‌దేన్  
ఎడుత్ తేన్ కొడుత్ తేన్ శువైత్ తేన్- ఇనిత్ తేన్  
ఇల్‌లాదపడి కదై ముడిత్ తేన్

ఈ తమిళ గీతంలో 'తేన్' అనే పదం ఎన్నిసార్లు వచ్చిందో గమనిస్తే- ఈ పాటకు 'తేన్ పాట్టు' (తేనె పాట) అని పేరు రావడం ఎంత సార్థకమో తెలుస్తుంది. తమిళంలో తేన్ అంటే తేనె. తెలుగు పాటలో ఒకచోట 'మధువు' అనీ రెండవ చోట 'తేనె' అని ఉండగా- ఈ తమిళగీతంలో 'తేన్' అనే మాటను చాలా గడుసుగా వాడారు కణ్ణదాసన్.

'పార్‌త్‌తేన్' అంటే చూశాను అని అర్థం. 'శిరిత్ తేన్' అంటే 'నవ్వాను' అని అర్థం. 'ఉనైత్ తేన్ ఎన నాన్ నినైత్ తేన్' అంటే 'నిన్ను తేనె అని నేను తలచాను' అని అర్థం. 'మలైత్ తేన్' అంటే 'కొండ తేనె' అనీ 'ఆశ్చర్య పడ్డాను' అనీ అర్థాలు.

'కుడిత్ తేన్' అంటే 'ఇంటి తేనె' అనీ 'తాగాను' అనీ అర్థాలు. 'ఇనిత్ తేన్' అంటే 'తీయగా ఉన్నాను' (రుచించాను) అనీ 'ఇక మీద తేనె' అనీ అర్థాలు.

ఒకసారి తమిళగీతంలోని భావాలను పరిశీలిద్దాం.

అతడు: చూచాను నవ్వాను  
చెంతకు రమ్మన్నాను - నాడు  
నిన్ను తేనె అని నేను తలచాను - నాడు  
ఇది కొండ తేనె అని నేను ఆశ్చర్యపోయాను

ఆమె: చూచాను నవ్వాను  
చెంతకు రావాలని త్వరపడ్డాను (విలవిలలాడాను) - నాడు  
నిన్ను తేనె అని నేను తలచాను - ఆ  
కొండతేనె వీరు (ఈయన) అని ఆశ్చర్యపోయాను

అతడు: తీగల తేనె ఇక మా  
ఇంటి తేనె - అని ఒక  
పడి (సేరు) తేనె చూపులతో తాగాను - ఒక  
చుక్క తేనె చిందకుండా మురిశాను - చేతుల్లో  
బంధించాను అందాన్ని ఆస్వాదించాను

ఆమె: పువ్వుల తేనె లాగా నేనూ  
విరబూశాను - నీ కోసమని  
పెరిగాను - పరువంలో పెళ్లాడాను  
తీసుకొన్నాను ఇచ్చుకొన్నాను ఆస్వాదించాను - ఇక  
తేనె లేకుండేలా కథ ముగించాను

తమిళ భాషలో ప్రథమ పురుష ఏకవచన క్రియాంతాలలోని 'తేన్' మాట మీద కణ్ణదాసన్ శ్లేషలు పండించిన వైనానికి ఈ పాట సాక్షి. (ఆశ్లేషమంటే కౌగిలి అనీ అర్థం ఉంది!).

కణ్ణదాసన్ ఇట్లా మాటలతో గారడీలు చేసిన పాటలు మరికొన్ని ఉన్నాయి. ఆయన రాసిన కాయల పాట (కాయ్ పాట్టు) ఒకటుంది. 'అత్తిక్కాయ్ కాయ్ కాయ్' అని మొదలయ్యే ఆ పాట నిండా 'కాయ్' అనే మాట పునరావృత్తమవుతూ ఉంటుంది. 'కాయ్' అంటే 'కాయి' అనీ 'కాయ' అనీ అర్థం. 'అత్తికాయ్' అంటే 'అత్తికాయ' అనీ అనిపించినా- 'అద్దిక్కులో' (ఆ దిక్కులో) అనే తీరులో కణ్ణదాసన్ జాబిలిని ఉద్దేశించి రాసిన పాట అది. 'ఇటు వెన్నెల కాయకు అటు కాయి' అని చెబుతుంది- ఆ సన్నివేశంలోని నాయిక. ఇటువంటి పాట తెలుగులోనూ ఒకటి ఉంది. 'ముహూర్తబలం' సినిమాలోని ఆ పాట- 'కాయిక్కాయ్ కావలి కాయ్ - కళ్లుమూయ్ కాయలు కోయ్ కోసిన కాయలు ఒళ్లో వేయ్' అని మొదలవుతుంది.

(ఒక విశేషమైన అంశాన్ని తీసుకుని పాట రాసే పద్ధతి తాళ్లపాక అన్నమాచార్యులు మొదలు పెట్టారని చెప్పాలి. శ్రీ వేంకటేశ్వరుడి గరిమను వర్ణించడానికి ఆయన ఎన్నెన్నో వర్ణనలు చేశారు. ఒక సంకీర్తనలో నవరత్నాల ప్రస్తావన ఉంటే మరొక సంకీర్తనలో పన్నెండు రాసుల ప్రస్తావన కనిపిస్తుంది. అన్నమాచార్యులు చూపిన సొబగుల గురించి పెద్ద గ్రంథమే రాయచ్చు).

- పి.ఎస్.గోపాలకృష్ణ

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**లకనం మూర్తి, కాకినాడ.**

ప్ర: శ్రావణమాసం సందర్భంగా మీ ఆవిడ ఓ కంచి పట్టుచీరని పట్టుపట్టి కొనిపించిందనుకోండి... ఏమనిపిస్తుంది ?

జ: అది మొండిపట్టు చీర అని అనిపిస్తుంది.

**టి.నవీన్‌కుమార్, సికింద్రాబాద్**

ప్ర: తడపకపోయినా తడిగా ఉండేది?

జ: నాలుక

ప్ర: పాస్ట్ ఈజ్ హిస్టరీ ఫ్యూచర్ ఈజ్ మిస్టరీ అన్నారు... మరి ప్రజెంట్?

జ: (వడ్డించిన) విస్తరి

ప్ర: మనిషికి కంప్యూటర్‌కి తేడా

జ: సెన్సుకి సైన్సుకి ఉన్నదే

ప్ర: కొంతమంది ప్రశ్నకు జవాబు డైరెక్టుగా ఇవ్వకుండా తిరిగి ప్రశ్న ద్వారానే ఇస్తుంటారు. ప్రశ్నకు ప్రశ్నే సమాధానమా?

జ: ఎందుక్కాకూడదు?

## ఈ రూటేవేరు




విజిలెన్స్ ఆఫీసర్ = విజిల్ వేసుకుంటూ కళ్లజోడుతో తిరిగే ఆఫీసరు

సిగ్నేచర్ = సిగ్గుపడే ప్రకృతి

- జి.వాసు, ఖమ్మం

అన్యోన్యత = తెలియకుండా ఉండుట (అన్‌నోన్‌యత)

- హెప్పి అండ్ నిషి, బాలాజీనగర్



## పేరు - రిపేరు



సింహాద్రి - ఒక్కడు చాలు

- ఏజర్ల సత్యనారాయణ, హైదరాబాద్.

నువ్వునేను - ఇష్టపడి - పెళ్లిచేసుకుందాంరా

గుండమ్మ కథ - చెప్పాలనివుంది

- కె.విజయరాఘవన్, వరంగల్

## చిలిపి లిపి




| | |
|---|---|
| T/2 Nut | = అరటికాయ |
| Earth Milk | = నేలపాలు |
| Bring Water Dinner | = తేనీటివిందు |

- జి.యన్.వాణి, సారిపల్లి

## డబుల్ రోల్




'అమ్మే' మన ఇంటిని 'అమ్మే'సింది

- వి.రామ్మోహన్‌రావు, సికింద్రాబాద్

అలా బెల్లం కొట్టిన 'రాయిలా' కూర్చున్నావేం... 'రా... యిలా!'

- టి.దీప్తి, పూణె

ఆ 'దర్శ'లు తేరా అంటే తేకుండా ఆ వాగుడేంట్రా
'అసందర్శ' ప్రలాపీ

- సాయి & సాకీ

## చిలిపి కవిత




నా మరదలి పేరు వరం
తనకు కావాలట ఓ పేద్ద సవరం
కనుక తనే చేస్తానంటోంది
నాకు క్షవరం
నాకు భయం తెగుతుందేమో
మెడ దగ్గర నరం
అందుకే ఆమె పేరు చెబితే
మనకెప్పుడూ నూట నాలుగు జ్వరం

- పి.యస్.రాజు, రావికంపాడు

## షార్ట్‌కట్స్




పసలపూడి కామాక్షి = పక్షి
**- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి**
బచ్చు కనకవల్లి = బల్లి
**- బి.శ్రీనివాసాచారి, హైదరాబాద్**
మల్లెల రమణ = మర
కమతం ధరణి = కథ
రవ్వల సంజయ్ = రసం
**- జి.యస్.వాణి, సారిపల్లి**

## పేరడీ పేరేడ్




ప: లవరుకోసం... లవరు కోసం...
ఈ ప్రేమ సంకటం ఈ జిడ్డు లంపటం
ఈ చిత్త భ్రమణం.. ఈ నిత్యగ్రహణం...
లవరుకోసం.. లవరు కోసం.. లవరు కోసం... లవరు కోసం...

చ: ప్రేమ మేకు తానే కొట్టి
ఈ పేదమదికి చిల్లుపెట్టి
ముప్పివాణ్ణి కర్రలేని కుంటివాణ్ణి చేసింది
నేనడిగినది ఇవ్వలేదు
అది ఎందుకని అడుగలేదు
బ్రతుకు కంపు చేసింది
చితక బాది వెళ్లింది ॥లవరుకోసం॥

చ: తొక్కలోని ఈ తనువే శవమై కడతేరనీ
నా లవరు లేని ఈ కొంపే తుఫానొచ్చి పడిపోనీ
బాంబుపేలి కుప్పలా కూలిపోనీ
ఉప్పెనొచ్చి ఇసుకలో కలవనీ ॥లవరుకోసం॥

చ: ఆస్తి పంచమన్నాది
అదేం కుదరదన్నాను
కల్లు తాగమన్నాది
పుల్లు పీకుతున్నాను
దాన్కి లవ్వంటే లెక్కలేదు
నాకు మందేమీ కొత్తకాదు
ఈ విరహంతో మిగిలాను
ఈ విస్కీతో తగలడతాను... హుహ్హు... హుహ్హు... తగలడతాను
హుహ్హు.. హుహ్హు... హుహ్హు... లవరుకోసం......

-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.

(ప్రేమనగర్ చిత్రంలో "ఎవరికోసం" పాటకు పేరడీగా)

ఆగస్టు 5 చక్రపాణిగారి జయంతి సందర్భంగా 'హాసం' పాఠకుల కోసం శ్రీ ముళ్లపూడి వెంకట రమణ తాజాగా వ్రాసిన ప్రత్యేక వ్యాసమిది...



# వేపరసం హాస్యరసం కలిసి కళాత్మక వ్యాపారశీలి వెరసి చక్రపాణి

"లో బడ్జెట్ సినిమా తియ్యాలంటే ఎలా సార్?
మంచి కిటుకు చెప్పండి"

"ఎగ్గొట్టడం" అన్నారు చక్రపాణి గారు.

దటీజ్ చక్రపాణి.

ఆ ఒక్క మాటకి టీకా తాత్పర్యాలు ఇలా సాగుతాయి.

నువ్వు తీసే సినిమా కొత్తిమీరా కొబ్బరిచెట్టా అనేది ముందు చూసుకో... కొత్తిమీర సువాసనే. కొబ్బరిచెట్టు పదికాలాలు పంటనిస్తుంది. దాన్నిబట్టి నీ బడ్జెట్టు, కథా, స్క్రిప్టూ ఖచ్చితంగా రాసుకుని దిగితే - అది లక్షలే అయినా కోట్లయినా లో బడ్జెట్టే.. అలాకాకుండా గాడి తప్పితే కొత్తిమీర, సినిమా కూడా హైబడ్జెట్టే.. అప్పుడు ఎగ్గొట్టడం తప్పదు.

దటీజ్ చక్రపాణి.

* * *

"నేను ఆంధ్రపత్రిక నుంచి వచ్చానండి-"

"ఎందుకూ?"

"మీతో యింటర్వ్యూ చేసి-"

"ఎందుకు?"

"మీ గురించి రాద్దామని"

"నా గురించి నేను చెప్పడానికేముంది...
నువ్వు రాయడానికేముంది.. నేనునేనే"

"అంతేనా?"



"అంతేగదా"

"సరే సర్"

దట్ - ఎగెయిన్ ఈజ్ చక్రపాణి.

* * *

టూకీ మాటలు..
అమిత మితభాషి..
ముక్కుకి నూటి..
అయినా గుడ్డిగా వెళ్ళి
గోడకి గుద్దుకోలేదు -
నెగ్గుకొచ్చారు-

ఈ యింటర్వ్యూలు రెండూ నలభైయేళ్ళనాడు ఈ రచయిత చేసినవే - ఆంధ్రసచిత్ర వారపత్రిక సినిమా ఎడిటర్‌గా.

నేను చిన్నవాడినైనా పెద్దపత్రిక తరపున వచ్చానని కూడా చూడకుండా అలా మొరటుగా జవాబిస్తే నాకు కోపం వచ్చింది.

కోడంబాకం నుంచి జార్జిటౌను దాకా బస్సు మీద కాకుండా కోపం మీద వచ్చేసి కోపంగానే కాయితాలు తీసుకుని ఆయన గురించి రాయబోయాను.

ఈలోగా కోపం కరిగిపోయింది. నవ్వు వచ్చింది.

నేనంటే నేనే అనే మాటలోనే ఆయన పర్సనాలిటీ ఉంది గదా. ఆ మాటలకి టీకా తాత్పర్యాలు రాస్తే సరి అనుకున్నాను. దారి కనిపించింది..

వ్యాసం రాస్తున్నాను - రాత్రి ఎనిమిదయింది అయ్యవారు (శ్రీ శివలెంక శంభుప్రసాద్ గారు) ఇంటికి వెళ్తూ నా దగ్గరకు వచ్చారు.

"మీరు కోపంగా వచ్చేశారంట గదా - ఆయన నవ్వుకున్నాడు" అన్నారు.

"నాకు మర్యాద అక్కర్లేదు గాని నాపత్రికకయినా విలువ యివ్వాలి గదా.. అదే మరి - నాగిరెడ్డి గారు నిన్న నాతో రెండుగంటలు మాట్లాడారు" అన్నాను రోషంగా.

"అవును - దటీజ్ నాగిరెడ్డి... దిసీజ్ చక్రపాణి" అందుకే వాళ్ళిద్దరూ ఫ్రెండ్సయ్యారు.. ఉప్పూ ఉసిరికాయీని" అన్నారు అయ్యవారు-

* * *

నేను రాసిన వ్యాసాన్ని మర్నాడు ఉదయం చదివారు.

"మీతో రెండు గంటలు మాట్లాడిన నాగిరెడ్డి గారి స్కెచ్చికన్నా ఒక్కముక్క చెప్పిన చక్కన్న మీదే ఎక్కువ రాశారు - ఆయన 'నేను నేనే' వాక్యానికి సరైన కోణంలో వ్యాఖ్య రాశారు - బాగుంది" అన్నారు అయ్యవారు.

అది విజయా స్టుడియోస్ గురించిన ప్రత్యేక సంచిక - ఆంధ్ర సచిత్ర వార పత్రిక కోసం వ్రాసినది..

ఫిలిం స్టుడియో అన్నది నాగిరెడ్డి చక్రపాణి గారల రెండవ వ్యాపారరంగం..

అంతకుముందు చక్రపాణి గారిది తెనాలి - రెడ్డి గారిది తాడిపత్రి.

ఉప్పూ ఉసిరికాయా మెడ్రాస్ కొత్వాలు సావడి ఆచారప్పన్ వీధిలో కలిశాయి. ఒక ప్రెస్సు, ఒక పత్రిక పెట్టాయి.

అప్పటి నుంచి విజయా రథానికి
నాగిరెడ్డి సారథి, చక్రపాణి రథ సారథి.

చక్రపాణి గారు ఆంధ్రజ్యోతి, యువపత్రికలు సంపాదుడు, దరిమిలాను దేశం మొత్తం మీద పధ్నాలుగు భాషలలో విజయ విహారం చేసిన 'చందమామ' పత్రికకు 'సంచాలకుడు'.. షావుకారు, పాతాళభైరవి,

పెళ్ళిచేసిచూడు, మిస్సమ్మ, గుండమ్మకథ వంటి విజయాచిత్రాలు సర్వాంతర్యామి. అంటే కథ, మాటలు, పాటలు, సంగీతం అన్నిటా ఆయన పాలలో వెన్నలా పరచుకుని వుంటారు - ఒకటి రెండు చిత్రాలకు డైరెక్టరు పేరు వేసుకున్నా సర్వసాధారణంగా ఇం డైరెక్టరు... కాసుకీ కళకీ పెళ్ళిచేసి-చూసి-చూపెట్టిన కళాత్మక వ్యాపారశీలి - వ్యాపారాత్మక కళాలోలుడు..

చక్రపాణిగారు కింగ్‌సైజు సిగరెట్‌లా పొడుగ్గా - ఆప్తమిత్రుల అభిప్రాయ భేదంలా సన్నగా నాజూకుగా ఉంటారు.. మితభాషి.. ఖచ్చితమైన మనిషి.. పనిలో తప్పు జరిగితే డొక్క చీరేస్తారు. అయినా అలా చేసేది రోజూ కాదు.. శిశుపాలుడి నూట ఒకటవ తప్పు దాకా భూదేవిని మించిన ఓర్పు చూపిస్తారు - దాన్ని ఎడ్వర్‌టైజ్ చెయ్యరు - అందువల్ల అందరికీ కోపిష్టిలాగా టాస్క్‌మాస్టరు లాగా కనిపిస్తారు.. ఎవరినయినా పని సందర్భంగా మాటలు అని నొప్పించినా మరుక్షణంలో తనూ నొచ్చుకుంటారు..

"అయినా ఆ మనిషిది ఇది నూట ఒకటోసారి బాపూ! అనక తప్పలేదు. అదీకాక మా అమ్మ నాకు చిన్నప్పుడు ఉగ్గుతో పాటు వేపరసం కలిపి తాగించింది" అన్నారు ఒకసారి నవ్వుతూ...

తొలిదశలో.. కళ అనేది కళకోసమా - కాసుల కోసమా అని మీమాంసలు చెలరేగే రోజులలో 'షావుకారు' తీశారు.. చెయి కాల్చుకోలేదు. కాని కళాఖండం కనిపించింది.. షావుకారుకు మాత్రం పదహారణాల తెలుగు సినిమా అని పేరు వచ్చింది.. చిత్రనిర్మాణ పథంలో అదొక మైలురాయిగా నిలబడింది. ఆ తెలుగుతనం, ఆ యింపుసొంపులు అన్నీ చక్రపాణిగారివే.. అయినాఈమీడియమ్ చాలా ఖరీదయినది. పొయిట్రీ బుక్కో, కథల పుస్తకమో వేసుకోవటంకాదు.. లాభాలు రాక పెట్టుబడీ పోగడ్తలూ వస్తే చాలదు పనికిరాదు. కళ కాసుల కోసమే - అయితే కాసులంటే మనుషులు అని అర్థం తోచింది..

ఆ మనుషుల కోసం పాతాళభైరవి తీశారు.. ఆ తరువాత ఎన్నో తీశారు.. అన్నీ సొమ్ముతో పాటు గొప్ప పేరును తెచ్చుకున్నవే.. అన్నిటా చక్రపాణి గారిది అదృశ్య హస్తమే..

* * *

"మీరు ఎక్కువగా బైబిలు కథలు సినిమాలు తీస్తారు ఎందుకూ" అని అడిగారు సిసిల్‌బిడిమిల్‌ను

"వాటికి రెండువేల సంవత్సరాల పబ్లిసిటీ వాల్యూవుంది గదా" అన్నాడాయన.

చక్రపాణిగారు ఆ పబ్లిసిటీ వాల్యూని అనేక విధాలుగా అర్థం చేసుకుని వాడుకున్నారు. స్టార్



వాల్యూమీద ఆయనకి నమ్మకం.

"ఒక అత్తగారు గయ్యాళి.. కోడల్ని బాధలు పెడుతుంది. అని సినిమాలో ఎస్టాబ్లిష్ చెయ్యాలంటే వెయ్యి అడుగులు తియ్యాలి.. దానికి బదులు సూర్యకాంతమ్మని ఆ పాత్రలో నిలబెడితే - పట్టుమని పదడుగులు కూడా పట్టదు - పైగా ఆవిడ బొమ్మ రాగానే హాల్లో చప్పట్లు పడతాయి" అనేవారు.

'గుండమ్మ కథ'లో జమున యింటికి నాగేశ్వరరావు తొలిసారిగా వెళ్ళాడు. వెళ్ళగానే డ్యూయెట్ పాడాడు.

"అదేంటి సార్ -వాళ్ళు లవ్ చేసుకున్నారని ఎస్టాబ్లిష్ చెయ్యొద్దా" అనడిగితే - "ఆడు నాగేసర్రావు అది జమునా - ఆళ్ళు ఆళ్ళతో గాక నీతో పె డూయెట్టు" అన్నారు-

ఒకసారి ఎన్.టి.రామారావు భీష్మ వేషం వేసుకున్నారు - సెట్‌లో చూసిన ఒకాయన చక్రపాణి గారిదగ్గరకు పరుగున వచ్చాడు -

"చక్కన్నా - ఎన్టీవోడికి బీష్మ గెటప్‌లో తెల్లగడ్డం గట్రా పెట్టి మేకప్ చేశారు. అసలు ఆడని తెలీడమే లేదు" అన్నాడు రొప్పుతూ

"ఆడని తెలీపోతే ఆ వేషానికి ఆడెందుకు డబ్బు దండగా - నువ్వుసాలు" అన్నారు చక్కన్నగారు నవ్వుకుంటూ.

* * *

ఒకసారి పెద్ద గొప్పింటిసెట్‌లో షూటింగు జరుగుతోంది - చాలా విశాలంగా వేసిన మేడమెట్లు - వాటిపక్కగా వచ్చే బానిస్టర్ పొడుగూతా చిరుచిరు గంటలు అలంకారంగా కట్టారు.

షాట్ సిద్ధమైంది. హీరో కృష్ణ స్టయిలుగా కిందికి దిగుతూ రావాలి.

'స్టార్ట్' అన్నాడు డైరెక్టర్.

"స్టాప్ స్టాప్" అంటూ అసిస్టెంటు డైరెక్టరు మెట్ల దగ్గరకు పరుగెత్తాడు. ఆ బానిస్టర్ మీదున్న వందన్నర గంటల్లో ఒక గంట ఊడిపోయిందిట - దాన్ని తిరిగి అతికించి - డ్యూటీ చేశానన్న తృప్తితో గర్వంతో చూశాడు అసిస్టెంటు.

"అబ్బాయ్! ఆడియన్సు ఆ గంట మెలికను గమనించారూ అంటే మన యీరోగారి మొగం జూసినట్టే" అన్నారు చక్రపాణిగారు.

హీరోగారు పకపక నవ్వారు.

చక్రపాణి గారు జీనియస్ - నేటివ్ జీనియస్..

ఆయన కన్న గొప్పవాడు వుండవచ్చు - తక్కువ వాళ్ళు వుండవచ్చు కాని ఆయన లాటివారు లేరు - ఉండబోరు -ఆయనకు ఆయనే సాటి..

**- ముళ్లపూడి వెంకటరమణ**

ఆగస్టు 10న ఖేమ్‌చంద్ ప్రకాష్ 53వ వర్ధంతి సందర్భంగా...



# అనుపమాన స్వరాల ఖేమ్‌చంద్ ప్రకాష్

సంప్రసిద్ధ బాంబే టాకీస్ సంస్థ ప్రతిష్ఠాత్మకంగా మహల్(1949) తీస్తున్న కాలం అది. అశోక్ కుమార్, మధుబాల వంటి భారీ తారాగణం నటిస్తున్నారు. ఈ చిత్ర సంగీత దర్శకుడు ప్రత్యేక శ్రద్ధతో ట్యూన్‌లు చేస్తున్నాడు. సంస్థలోని ఓ ప్రధాన వ్యక్తి ఆ సంగీత దర్శకుడి శ్రమ అంతా వృధా అని, అసలీ సినిమాలో సంగీతానికి అంత ప్రాధాన్యత ఉండదని వ్యాఖ్యానించడం, ప్రచారం చేయడమే గాక ఓ సారి ఆ సంగీత దర్శకుడి సమక్షంలోనే దర్శక నిర్మాతల వద్ద "చూడండి ఒకవేళ ఈసినిమా ఫెయిలయితే అది సంగీతం వల్లనే అవుతుంద"న్నాడు వ్యంగ్యంగా. అప్పుడు నోరు విప్పకుండా మౌనం వహించాడాయన. కానీ మహల్ (1949) విడుదలై విజయవంతంగా ఆడుతోంది. సినిమా విజయానికి ప్రధాన కారణం సంగీతమేనని వందలాది ఉత్తరాలు ఆ సంగీత దర్శకునికి కుప్పలుగా వచ్చాయి. అప్పటికాయన అనారోగ్యంతో మంచమెక్కాడు. ఆ చేతకాని స్థితిలో కూడా ఆయన ఉత్తరాలను తీసుకుని టాకీస్‌లో ఆనాడు హేళన చేసిన ఆసామి ఇంటికెళ్లి నెమ్మదిగా "నా సంగీతం బాగోలేదని చెప్పాల్సింది నీవు కాదు, ప్రేక్షకుడు" అని మొహం మీదే అని వచ్చేశాడు. ఆ సంగీత దర్శకుడెవరో కాదు. హిందీ చిత్ర సంగీతంలో ఒక అధ్యాయాన్ని సృజించిన ఖేమ్‌చంద్ ప్రకాష్."

మహల్ చిత్రం అనగానే మనకు లతాజీ పాడిన "ఆయెగా ఆయెగా ఆయెగా ఆనేవాలా" మహత్తర గీతం గుర్తుకు వస్తుంది. అప్పటి హిందీ సినీ సంగీతాల్లో విభిన్నంగా రూపొందింది. ఈ పాట సినిమా కథకు మూలమైనది. ఇదే విషయాన్ని 3 జనవరి 1957 నాటి ఫిలింఫేయిర్‌లో వచ్చిన 'ఇండియన్ ఫిలిం మ్యూజిక్ అండ్ మ్యూజిక్ డైరెక్టర్స్' అనే వ్యాసంలో ఖేమ్‌చంద్ ప్రకాష్ గురించి లతా- 'ఆయెగా ఆనేవాలా' పాట పుట్టుకను నేనెప్పుడూ మరువలేను. స్వరకల్పన, రిహార్సల్స్‌కి అయిదు రోజులు పట్టింది. ఖేమ్‌చంద్‌జీ ఇంత సమయం ఏ పాటకూ తీసుకోలేదు. నాచే లెక్కలేనన్ని సార్లు పాడించి గాని ఫైనలైజ్ చేయలేదు. ఎందుకంటే సస్పెన్స్‌ను ప్రతిఫలించే వాతావరణం ఈ పాటలో చొప్పించవలసిన అవసరముండేది."

**ఖేమ్‌చంద్‌ప్రకాష్**

ఈ తరం వారికి అంతగా తెలీకపోయినా హిందీ సినీ సంగీతాభిమానులకు ఈయన సుపరిచితులే. రాజస్తాన్‌లోని సుజాన్‌ఘడ్‌లోని సంగీత కుటుంబంలో 1907లో జన్మించాడు. ఆసక్తికరమైన విషయమేమిటంటే హిందీ సంగీతంలో ప్రఖ్యాతులైన జమాల్‌సేన్ కూడా సుజాన్‌ఘడ్‌లోనే పుట్టారు. ఖేమ్‌చంద్ తండ్రి గోవర్ధన్ ప్రసాద్ జైపూర్ రాజావారి ఆస్థాన గాయక నర్తకుడిగా ఉండేవారు. తండ్రివద్దనే సంగీతాన్ని, కథక్ నృత్యాన్ని అభ్యసించాడు. జీవిక కోసం నేపాల్ రాజా స్థానంలో పనిచేశాడు. ఖేమ్‌చంద్ సినీ ప్రస్థానం కలకత్తా న్యూ థియేటర్స్ సంస్థలో ప్రారంభమైంది. బి.ఎన్.సర్కార్ తిమిర్‌బరన్ వద్ద అసిస్టెంట్‌గా చేర్పించారు. అపుడు తిమిర్‌బరన్ 'దేవదాస్' చిత్రానికి సంగీతం చేస్తున్నారు. ఖేమ్‌చంద్ ప్రతిభను పరీక్షించేందుకు ఆయన రెండు పాటలను కంపోజ్ చేయమన్నారు. అవి "బాలమ్ ఆన్ బసోమెరి మిన్‌మే", "దుఖ్ కె అబ్ దిన్ బీతత్ నహీ" - ఆ రోజుల్లో గొప్ప హిట్ సాంగ్స్. తర్వాత 'స్ట్రీట్ సింగర్'లో ఓ హాస్య భూమికలో నటించారు.

ఆ రోజుల్లో హిందీ సినిమాల నిర్మాణానికి బొంబాయి కేంద్ర స్థానమవుతోంది. కేదార్ శర్మ పృథ్వీరాజ్ కపూర్‌లతో కలిసి ఖేమ్‌చంద్ ప్రకాశ్ బొంబాయి వచ్చేశాడు. న్యూథియేటర్స్‌లో పనిచేసిన వాడవటం వల్ల సంగీత దర్శకుడిగా అవకాశం లభించడానికి ఎక్కువకాలం పట్టలేదు. 1939లో తొలిసారిగా "మేరీ ఆంఖే"కు సంగీతం అందించాడు. 1939లోనే ఫజీ ఫలావుద్దీన్‌కు స్వరకల్పన చేశాడు. 1941లో 'పరదేశీ', 'షాదీ, 'ఉమ్మీద్' చిత్రాల సంగీతం ఆయన్ను వెనక్కి తిరిగి చూసుకోనివ్వలేదు. పరదేశీలోని 'పహలే జో మొహబ్బత్‌సె ఇంకార్ కియా హోతా' పాట జనరంజకం కావడమే గాక గాయని ఖుర్షీద్ కెరీర్‌నే మలుపు తిప్పింది. చాంద్‌నీ', 'ఖిలానా' చిత్రాలు 1942లో ఆయన సంగీతం చేసినవి. 1943లో సైగల్ నటించిన 'తాన్‌సేన్' చిత్రంతో ఖేమ్‌చంద్ ఒక్కసారిగా టాప్ మ్యూజిక్ డైరెక్టర్ అయ్యాడు. తాన్‌సేన్ పాటలన్నీ సూపర్‌హిట్ అయినవి. శాస్త్రీయ సంగీతం ఆధారంగా 'రుమ్‌జిమ్ రుమ్‌జిమ్ చాల్ తిహారీ', 'కాహే గుమాన్ క రేరీ గోరి', 'మొరె బాలాపన కెసాథి ఛైలా' వంటి పాటలు ఆబాలగోపాలం పాడుకున్నారు.

ఆ కాలంలో హిందీ సినీ సంగీతంలో పంజాబీ జానపద శైలి ఆధారంగా రూపొందిన పాటలు హిట్ అయ్యేవి. ఇందుకు మూల కారకులు మాస్టర్ గులాం హైదర్. కాగా ఖేమ్‌చంద్ తనదైన పద్ధతిలో రాజస్థానీ జానపద స్వరాల శైలిని చొప్పించి ట్యూన్‌లు చేయనారంభించారు. అటు తర్వాత వచ్చిన బవ్‌రా, షహిన్‌షా బాబర్, ధన్నా భగత్ (1944) తదితర చిత్రాల్లో ఈ శైలి కనిపిస్తుంది. 1947 - 1950 మధ్య కాలం ఖేమ్‌చంద్‌కి ఉచ్ఛదశను చేకూర్చిన కాలంగా చెప్పుకోవచ్చు. 'జిద్దీ' (1948), 'రిమ్‌జిమ్', సావన్ తయారే (1949), 'మహల్'(1949),'సతీ నర్మదా', బిజిలీ, మన్నాడేతో కలిసి 'జాన్ పహెచాన్' (1950) వంటి చిత్రాలు చేసారు. తన 12 ఏళ్ల కెరీర్‌లో ఖేమ్‌చంద్ కేవలం 25 చిత్రాలకే స్వరరచన చేశారు.

ఖేమ్‌చంద్ 'జిద్దీ'లో 'మర్‌నేకీ దువాయేం క్యోం మాంగూ జీనేకీ తమన్నా కౌన్‌కరే'పాట పాడించి కిశోర్‌కుమార్‌ను గాయకునిగా పరిచయం చేశారు. జిద్దీలోనే లతాచే పాడించిన 'చందారే జారే జారే' (ఆధారం రాజస్థాన్ లోక్‌గీత్- "కాగారే జారే జారే") విరహ గీతాన్ని జనం మెచ్చారు. ఇక మహల్ గురించి మళ్ళీ చెప్పనవసరం లేదు. లతా గాన వైభవం హిమాలయా శృంగాన్ని అందుకుంది. "ఆయేగా ఆనేవాలా" పాటను ఆమె ఇప్పటికీ ఎక్కడ స్టేజీ షోలిచ్చినా "ముందుగా ఇదే పాట పాడమని కోరతార"ని లతాయే స్వయంగా చెప్పుకుంది. ఇంకా రాజకుమారిచే రికార్డింగ్ చేసిన "ఘబ్‌రాకె జో హమ్ సర్‌కో టకరాయే' పాటను మళ్లీ లతాచే పాడించి సినిమాలో చూపాడు. ఈ విషయం కాస్త వివాదాస్పదమైంది. షంషాద్ బేగంచే 'సావన్ ఆయారే'లో "నహీ ఫర్యాద్ కర్‌తే హమ్‌తుఝే బర్‌యాద్ కర్‌తే" అనే రొమాంటిక్ గీతం పాడించాడు.

సైగల్, ఖుర్షీద్, అమీర్‌బాయి, సురేంద్రలను అభిమానించే ఖేమ్‌చంద్ ప్రకాశ్ వద్ద నౌషాద్, బులో సిరాణిలు శిష్యరికం చేసిన వారే. ఖుర్షీద్ ఈయన సంగీతంలోనే గాయనిగా ఎదిగింది. ఖేమ్‌చంద్ సంగీతం చేసిన చిత్రాల్లో ఎక్కువగా రంజిత్ మూవీ టోన్ వారివే. చివరి రోజుల్లో బాంబే టాకీస్ సంస్థలోకి వచ్చేశాడు. 'రంజిత్‌స్టార్'గా ప్రఖ్యాతి గాంచిన ఖుర్షీద్ ఆయన అభిమాన గాయని. ఆమె దేశ విభజన కాలంలో పాకిస్తాన్ వెళ్లిపోవడంతో ఆ బాధను తట్టుకోవడానికి మద్యపానానికి అలవాటుపడి ఆరోగ్యాన్ని చెడగొట్టుకున్నాడని పరిశ్రమలో చెప్పుకున్నారు. ఆ మహా సంగీత దర్శకుడు 1950 ఆగస్ట్ 10న కాలధర్మం చెందారు.

స్వాతంత్ర్యానంతరం సినీ సంగీతానికి శాస్త్రీయ, జానపద సంగీత సొబగులద్దిన అనుపమాన సంగీత దర్శకుడు ఖేమ్‌చంద్ ప్రకాష్.

**- హెచ్.రమేష్‌బాబు**




| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 961 | నమో నటరాజ | పంతాలు పట్టింపులు | 1968 | పెండ్యాల | శ్రీశ్రీ | బి.గోపాలం |
| 962 | నేటిదా ఒకనాటిదా ఏనాటిదో | పంతాలు పట్టింపులు | 1968 | పెండ్యాల | శ్రీశ్రీ | బి.గోపాలం, సుశీల |
| 963 | నిన్నే నేను మెచ్చుకున్నా | పంతాలు పట్టింపులు | 1968 | పెండ్యాల | ఆరుద్ర | బి.గోపాలం, జానకి, L.R.ఈశ్వరి |
| 964 | పరువపు సొగసరి పిలిచే పిలుపే | పంతాలు పట్టింపులు | 1968 | పెండ్యాల | శ్రీశ్రీ | సుశీల |
| 965 | రామ రామ శ్రీరామ దయామయా | పంతాలు పట్టింపులు | 1968 | పెండ్యాల | శ్రీశ్రీ | పట్టాభి, బృందం |
| 966 | రమ్మంటే రాడు పెద్ద సోగ్గాడు | పంతాలు పట్టింపులు | 1968 | పెండ్యాల | ఆరుద్ర | ఎల్.ఆర్.ఈశ్వరి, ఎస్.జానకి |
| 967 | రంగు పూసుకొని హంగు చేసుకొని | పంతాలు పట్టింపులు | 1968 | పెండ్యాల | శ్రీశ్రీ | జానకి, సుశీల |
| 968 | ఇనుకోరా ఇనుకోరా | పంతాలు పట్టింపులు | 1968 | పెండ్యాల | శ్రీశ్రీ | ఘంటసాల |
| 969 | మనిషి మనిషికి | పాపకోసం | 1968 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | ఘంటసాల |
| 970 | కొండలపైన కోనలలోన | పాపకోసం | 1968 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | సుశీల |
| 971 | నన్నే నన్నే చూడు | పాపకోసం | 1968 | జె.వి.రాఘవులు | సి.నారాయణరెడ్డి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 972 | రాముడెందుకు పుట్టేడు | పాపకోసం | 1968 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | ఘంటసాల, మాధవపెద్ది, జె.వి.రాఘవులు |
| 973 | పుల్లి పూల పడవ కట్టి | పాపకోసం | 1968 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | సుశీల |
| 974 | కొండలపైన కోనలపైన | పాపకోసం | 1968 | జె.వి.రాఘవులు | ఆత్రేయ | ఘంటసాల, మాధవపెద్ది, రాఘవులు |
| 975 | అమ్మా చూడాలి నిన్ను నాన్నను చూడాలి | పాపం పసివాడు | 1972 | సత్యం | ఆత్రేయ | సుశీల |
| 976 | అయ్యో పాపం పసివాడు | పాపం పసివాడు | 1972 | సత్యం | ఆత్రేయ | ఘంటసాల |
| 977 | బాబు మా బాబు | పాపం పసివాడు | 1972 | సత్యం | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 978 | బాబు మా బాబు నీకన్న మాకు పెన్నిధి ఎవరు | పాపం పసివాడు | 1972 | సత్యం | ఆత్రేయ | సుశీల |
| 979 | లక్ష్మీ క్షీరసముద్ర రాజతనయా | పాపం పసివాడు | 1972 | సత్యం | శ్లోకం | సుశీల |
| 980 | చిత్రాలు చేయరో నరుడా | మనవూరి పాండవులు | 1978 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు |
| 981 | జండాపై కపిరాజు | మనవూరి పాండవులు | 1978 | కె.వి.మహదేవన్ | కొసరాజు | ఎస్.పి.బాలు, బృందం |
| 982 | పిరికి మందు తాగి వూరు నిదరోయింది | మనవూరి పాండవులు | 1978 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు |
| 983 | కనులీవేళ చిలిపిగ నవ్వెను | మంగమ్మ శపథం | 1965 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 984 | నీ రాజు పిలిచెను | మంగమ్మ శపథం | 1965 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 985 | వయ్యారమొలికే చిన్నది | మంగమ్మ శపథం | 1965 | టి.వి.రాజు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 986 | అహ నా పెళ్ళంట | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | సుశీల, ఘంటసాల |
| 987 | భళి భళి భళి భళి దేవా | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | మాధవపెద్ది సత్యం |
| 988 | చూపులు కలిసిన శుభవేళ | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | ఘంటసాల, లీల |
| 989 | దయచేయండి దయచేయండి | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | ఘంటసాల, మాధవపెద్ది, పి.లీల, సుశీల, బృందం |
| 990 | లాహిరి లాహిరి లాహిరిలో | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | ఘంటసాల, పి. లీల |
| 991 | నీకోసమే నే జీవించునది | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | ఘంటసాల, పి.లీల |
| 992 | నీవేనా నను తలచినది | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | ఘంటసాల, పి.లీల |
| 993 | శ్రీకరులు దేవతలు | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | ఎమ్.ఎల్.వసంతకుమారి, లీల, సుశీల, జిక్కి |
| 994 | సుందరి నీవంటి దివ్య స్వరూపము | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | ఘంటసాల, సావిత్రి |
| 995 | విన్నావా యశోదమ్మా | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | ఎమ్.ఎల్.వసంతకుమారి, లీల, సుశీల, జిక్కి |
| 996 | వివాహ భోజనంబు | మాయాబజార్ | 1957 | ఘంటసాల | పింగళి | మాధవపెద్ది |
| 997 | ధర్మం సెయ్ బాబూ | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | రేలంగి |
| 998 | బాలనురా మదనా | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | సుశీల |
| 999 | బృందావనమది అందరిది | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | సుశీల, ఎ.ఎమ్.రాజా |
| 1000 | కరుణించు మేరీ మాతా | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | పి.లీల |
| 1001 | కావాలంటే యిస్తాలే | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | ఎ.ఎమ్.రాజా |
| 1002 | రాగ సుధారస పానము జేసి | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | త్యాగరాజ కృతి | పి.లీల |
| 1003 | రావోయి చందమామా | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | లీల, ఎ.ఎమ్.రాజా |
| 1004 | సీతారాం సీతారాం | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | రేలంగి, బృందం |
| 1005 | శ్రీ జానకి దేవి సీమంతమదే | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | బృందగానం |
| 1006 | తెలుసుకొనవే చెల్లీ | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | పి.లీల |
| 1007 | తెలుసుకొనవే యువతీ | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | ఎ.ఎమ్.రాజా |
| 1008 | ఏమిటో ఈ మాయ | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | లీల |
| 1009 | ఔనంటే కాదనిలే | మిస్సమ్మ | 1955 | ఎస్.రాజేశ్వరరావు | పింగళి | ఎ.ఎం.రాజా |
| 1010 | కోనేట నా నీడ | మోహిని భస్మాసుర | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి. సుశీల |
| 1011 | మన ధాటికేనాడు ఎదురు లేదు | మోహిని భస్మాసుర | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | కె. రఘురామయ్య |
| 1012 | నేను నేనే సుమా | మోహిని భస్మాసుర | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి. సుశీల |
| 1013 | | | | | | |
| 1014 | | | | | | |

# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 1015 | పాడాలి మది ఆడాలి | మోహిని భస్మాసుర | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి.సుశీల |
| 1016 | ప్రశాంతమీ నిశీధము | మోహిని భస్మాసుర | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి.సుశీల |
| 1017 | తీయనైన ఊహల | మోహిని భస్మాసుర | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి.సుశీల |
| 1018 | విజయమిదిగో లభించెను | మోహిని భస్మాసుర | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి.సుశీల |
| 1019 | ఇది ఏమిటో నా మేను | మోహిని భస్మాసుర | 1966 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | పి.సుశీల |
| 1020 | జయ మంగళ గౌరిదేవి | ముద్దుబిడ్డ | 1956 | పెండ్యాల | ఆరుద్ర | పి.సుశీల |
| 1021 | ఎవరు కన్నవారెవరు పెంచేరు | ముద్దుబిడ్డ | 1956 | పెండ్యాల | ఆరుద్ర | పి.లీల |
| 1022 | యిటులేలా చేసేవయా | ముద్దుబిడ్డ | 1956 | పెండ్యాల | ఆరుద్ర | పి.లీల |
| 1023 | సఖియా వివరింపవే | నర్తనశాల | 1963 | ఎస్.దక్షిణామూర్తి | సముద్రాల | సుశీల |
| 1024 | ఎవ్వరికోసం ఈ మందహాసం | నర్తనశాల | 1963 | ఎస్.దక్షిణామూర్తి | శ్రీశ్రీ | ఘంటసాల, సుశీల |
| 1025 | నరవరా ఓ కురువరా | నర్తనశాల | 1963 | ఎస్.దక్షిణామూర్తి | సముద్రాల | ఎస్.జానకి |
| 1026 | సలలితరాగ సుధారస గానం | నర్తనశాల | 1963 | ఎస్.దక్షిణామూర్తి | సముద్రాల | బాలమురళికృష్ణ, బెంగుళూరు లత |
| 1027 | అందుకో జిలిబిలి నగవుల | పసిడి మనసులు | 1979 | అశ్వత్థామ | ఆరుద్ర | బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1028 | చిన్నారి నీ చిరునవ్వు | పసిడి మనసులు | 1979 | అశ్వత్థామ | ఉషశ్రీ | ఘంటసాల |
| 1029 | జీవితమే ఓ పూబాట | పసిడి మనసులు | 1979 | అశ్వత్థామ | ఉషశ్రీ | ఘంటసాల |
| 1030 | నిన్నే వలచితినోయి | పసిడి మనసులు | 1979 | అశ్వత్థామ | ఉషశ్రీ | పి.సుశీల |
| 1031 | వద్దంటే వెళ్ళేను మంగళగిరికి | పసిడి మనసులు | 1979 | అశ్వత్థామ | ఉషశ్రీ | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1032 | ఇదేనా ఓయి నెలరాజా | పసిడి మనసులు | 1979 | అశ్వత్థామ | ఉషశ్రీ | సుశీల |
| 1033 | అమ్మను నేనంటా నాన్నవు నీవంటా | పట్టిందల్లా బంగారం | 1971 | ఘంటసాల | శ్రీశ్రీ | పి.లీల, విజయలక్ష్మి కన్నారావు |
| 1034 | దీవానా ఆయా హై | పట్టిందల్లా బంగారం | 1971 | ఘంటసాల | దాశరథి | ఎస్.జానకి |
| 1035 | మేడలో ఉన్నావా ఓ రాజా | పట్టిందల్లా బంగారం | 1971 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఎస్.జానకి |
| 1036 | ముద్దె తెచ్చింది నిన్నే రమ్మంది | పట్టిందల్లా బంగారం | 1971 | ఘంటసాల | శ్రీశ్రీ | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1037 | నువ్వెక్కడ ఉంటే అక్కడ బంగారం | పట్టిందల్లా బంగారం | 1971 | ఘంటసాల | దాశరథి | ఎల్.ఆర్.ఈశ్వరి, రమణ |
| 1038 | నువ్వెంతో బాగుంటావు | పట్టిందల్లా బంగారం | 1971 | ఘంటసాల | జంపనపెద్దిరాజు | ఘంటసాల, ఎస్.జానకి |
| 1039 | ఏ ఫర్ ఆఫిల్ | పట్టుకుంటే పదివేలు | 1967 | టి.చలపతిరావు | ఆరుద్ర | జయదేవ్, బి.వసంత |
| 1040 | నాంపల్లి స్టేషన్‌కాడ జాంపండ్లు | పట్టుకుంటే పదివేలు | 1967 | టి.చలపతిరావు | సి.నారాయణరెడ్డి | మాధవపెద్ది, జానకి |
| 1041 | సైరా చక్కని దేశము | పట్టుకుంటే పదివేలు | 1967 | టి.చలపతిరావు | కొసరాజు | జయదేవ్, బి.వసంత |
| 1042 | స్వాగతము సుస్వాగతము | పట్టుకుంటే పదివేలు | 1967 | టి.చలపతిరావు | శ్రీశ్రీ | పి.బి.శ్రీనివాస్, జయదేవ్, బి.వసంత |
| 1043 | స్వామి వెంకటరమణ | పట్టుకుంటే పదివేలు | 1967 | టి.చలపతిరావు | దాశరథి | సుశీల |
| 1044 | గాంధి పుట్టిన దేశమా యిది | పవిత్రబంధం | 1971 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల |
| 1045 | అల్లుతద్దోయి | పవిత్రబంధం | 1971 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల, బృందం |
| 1046 | చీకటి వెలుగుల రంగేళి | పవిత్రబంధం | 1971 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 1047 | చిన్నారి నవ్వులే సిరిమల్లె పువ్వులు | పవిత్రబంధం | 1971 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | సుశీల, బృందం |
| 1048 | ఫిఫ్టీ ఫిఫ్టీ సగం సగం | పవిత్రబంధం | 1971 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 1049 | గల గల గజ్జెల బండి | పవిత్రబంధం | 1971 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | సుశీల, స్వర్ణలత |
| 1050 | పచ్చబొట్టు చెరిగిపోదులే | పవిత్రబంధం | 1971 | ఎస్.రాజేశ్వరరావు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 1051 | తంత్రాల బావయ్యా రావయ్యా | పవిత్రబంధం | 1971 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | పిఠాపురం, స్వర్ణలత |
| 1052 | బఠానీలు బాబు బఠానీలు | పెద్దకొడుకు | 1973 | పి.ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | ఎస్. జానకి |
| 1053 | చెప్పలేనమ్మా ఆ చిన్నవాని | పెద్దకొడుకు | 1973 | పి.ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | ఎస్. జానకి, సుశీల |
| 1054 | తమ గొంతు నులిమే వారికి | పెద్దకొడుకు | 1973 | పి.ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | ఎస్. వరలక్ష్మి |
| 1055 | ఈనాడే దసరా పండుగ | పెద్దకొడుకు | 1973 | పి.ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, బృందం |
| 1056 | ఎవరు నీవు ఎవరు నేను | పెద్దకొడుకు | 1973 | పి.ఆదినారాయణరావు | సి.నారాయణరెడ్డి | రామకృష్ణ |
| 1057 | చెలియ కురుల నీడ (పద్యం) | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | దాశరథి | ఘంటసాల |
| 1058 | చూడాలి అక్కను చూడాలి | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | ఆరుద్ర | సుశీల |
| 1059 | జీవితమే భారము | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | శ్రీశ్రీ | ఘంటసాల |
| 1060 | మధువు పెదవి దాటి (పద్యం) | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | దాశరథి | ఘంటసాల |
| 1061 | నిన్న గడిచి పోయే (పద్యం) | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | దాశరథి | ఘంటసాల |
| 1062 | పిక్నిక్ పిక్నిక్ పిక్నిక్ చక చకలాడే పిక్నిక్ | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల, పి.బి.శ్రీనివాస్ |
| 1063 | శ్రీదేవి హృదయాన చిన్నోందు | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | కొసరాజు | సుశీల |
| 1064 | విరపూసెను వలపుల రోజా | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 1065 | ఎదురుచూసె కళ్ళలో | పెద్దక్కయ్య | 1967 | ఘంటసాల | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |

వచ్చే సంచికలో మరికొన్ని

**సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.**

ఆగస్టు 8న కౌసల్య పుట్టినరోజు సందర్భంగా....



# ఈ ఒక్కపాటకే నీకు మంచి గిఫ్ట్ ఇవ్వాలి అన్నారు పూరీ జగన్నాథ్

గాయనిగా ప్రస్తుతం మంచి పొజిషన్‌లో ఉన్న **కౌసల్య** తనను అభిమానించే పాఠకశ్రోతలకు 'హాసం' ద్వారా అందించిన స్వ పరిచయ, అనుభవాభిప్రాయాల ముచ్చట్లివి...

పుట్టింది గుంటూరు జిల్లా రేపల్లె.

అమ్మకు మ్యూజిక్‌లో ప్రవేశం ఉంది. చిన్నప్పుడు వయొలిన్ నేర్చుకుంది. నాన్న పాటలు పాడతారు గాని క్లాసికల్ మ్యూజిక్ నేర్చుకోలేదు. ఏ.జి.ఆఫీసులో ఆడిటర్‌గా పనిచేసేవారు. ఏ.ఎం.రాజా గారి పాటలంటే ఆయనకు చాలా ఇష్టం.

చిన్నప్పుడు నాకు పలకటం కూడా సరిగ్గా రాని రోజుల్లో ఏదో సినిమాకెళ్లి వస్తూవుంటే ఆ సినిమాలో పాట కాచ్ చేసేసి దారిలోనే పాడుతున్నానంట. అది విని మా నాన్నగారు 'ఇపుడే విన్న మనకు గుర్తు లేదు. ఎంత బాగా కాచ్ చేసింది' అని ఆశ్చర్యపోయారంట. అప్పుడే అనుకున్నారంట ఎలాగయినా సంగీతం నేర్పించాలని. 8 సంవత్సరాలు వచ్చిన తర్వాత నన్ను మ్యూజిక్‌లో జాయిన్ చేశారు.

నేను 10 వ తరగతి చదివే వరకు మా ఫ్యామిలీ నాగార్జునసాగర్‌లోనే ఉండేది. అక్కడొక ఇన్‌స్టిట్యూట్ ఉండేది...బాలవిహార్ అని గవర్నమెంట్‌ది. దాంట్లో మ్యూజిక్ అండ్ డ్యాన్స్ క్లాసెస్ జరుగుతూండేవి. దాంట్లోనే నన్ను, మా సిస్టర్ సుధని కలిపి జాయిన్ చేశారు. ఫస్ట్ డ్యాన్స్‌లో జాయిన్ చేశారు. డ్యాన్స్ అయితే ఓల్డ్ ఏజ్ లో మానేజ్ చేయటం కష్టం. సంగీతం అయితే ఏ ఏజ్‌లో అయినా చక్కా కూర్చుని పాడుకోవచ్చు అని డ్యాన్స్ మానిపించేసి, సంగీతం క్లాసెస్‌కు మాత్రం పంపేవారు.

నా మొదటి గురువు గారు వువ్వుల నరసింహం గారు. చాలా పెద్దాయన. మా ఇద్దరికీ సంగీతం నేర్పేటప్పటికే ఆయనకు 96 సంవత్సరాలు. మ్యూజిక్ బాగా నేర్పించారు. ఎక్కువగా వర్ణాలు నేర్పించారు. వాయిస్ బాగా ఎక్సర్‌సైజ్ అయ్యిందప్పుడు. ఆయన దగ్గర సంవత్సరంన్నర పాటు చాలా సిన్సియర్‌గా మ్యూజిక్ నేర్చుకున్నాం. తర్వాత చదువులకోసం డిస్‌కంటిన్యూ చేశాం. అయినా సరే ఆ ఒన్ అండ్ ఆఫ్ ఇయర్‌లోనే చాలా వాల్యూబుల్ మ్యూజిక్ నేర్పించారాయన.

మాకు స్కాలర్‌షిప్‌లు ఇప్పించాలని, పెద్ద పెద్దవాళ్ల దగ్గర నేర్పించాలని నాన్నగారికి ఉండేది. ఒకసారి బెంగుళూరు, మద్రాసు ఇంటర్వ్యూలకి తీసుకెళ్లారు. ఆ ఇన్‌స్టిట్యూట్ పేరు సరిగ్గా గుర్తు లేదు. ఆ స్కాలర్‌షిప్ కోసమే నాన్నగారు ఉదయమే లేపి సాధన చేయించేవారు. నేను కళ్యాణి రాగంలో 'దేవీ మీనాక్షిమిదం...'అనే ముత్తుస్వామి దీక్షితార్ కీర్తన పాడాను. ఇంతా చేస్తే నాకు స్కాలర్‌షిప్ రాలేదు. నాన్నగారిని పిలిచి - ఇప్పటికే ఆ అమ్మాయి కచేరీలు చేసే స్థాయిలో పాడుతోంది. ఇంక స్కాలర్‌షిప్ అవసరం లేదనే ఉద్దేశ్యంలో మేం ఇవ్వలేదు - అని చెప్పారంట. కొంచెం బాధ పడినా చాలా హ్యాపీ అయ్యారు నాన్నగారు.

కొన్నాళ్లకి నాన్నగారు ఎక్స్‌పైర్ కావటం, ఆయన జాబ్ అమ్మకి ఇవ్వటం...(అప్పుడు నాకు 10సంవత్సరాలు ఉంటాయి.) అప్పటి నుంచి మ్యూజిక్‌కు బ్రేక్ వచ్చింది. సిన్సియర్‌గా చదువుకోవడం ప్రారంభించాం. అయితే సంగీతం నేర్చుకోవటం లేదనే బాధ ఉండేది. స్కూల్‌లో జరిగే కాంపిటేషన్స్‌తో పాటు, స్కూలు తరపున కూడా పాల్గొనేవాళ్లం. ఎక్కడకు వెళ్లినా ఫస్ట్ ప్రైజ్ తెచ్చుకునేవాళ్లం. అమ్మ కూడా బాగా ప్రోత్సహించేది.

నేను ఫస్ట్ ఎం.పి.సి. తీసుకున్నాను. అయితే మ్యూజిక్ బాగా డిస్‌కంటిన్యూ చేస్తున్నాం అని ఫీలింగ్ వచ్చింది. అప్పుడు గుంటూరు లేడీస్ కాలేజీలో బి.ఎ.లిటరేచర్‌తో పాటు మ్యూజిక్ కాంబినేషన్ ఉండేది. మేము దీనికి కూడా అప్లయ్ చేశాం. దీనిలోకి వెళ్లిపోయి మ్యూజిక్ కంటిన్యూ చేయవచ్చన్న ఉద్దేశ్యంతో ఆర్ట్స్‌లోకి వచ్చాం. తర్వాత ఎం.ఎ క్లాసికల్ మ్యూజిక్ తిరుపతి పద్మావతి మహిళా విశ్వవిద్యాలయంలో నేను, మా చెల్లీ కలిసి చేశాం. ఎం.ఏ. క్లాసికల్ మ్యూజిక్ నా క్వాలిఫికేషన్.

యూనివర్శిటీలో మ్యూజిక్ సంబంధించి ఏ పోటీ జరిగినా పాల్గొనేవాళ్లం. మేం పాల్గొన్న ప్రతీ పోటీలోనూ (ఒకటి, రెండు చోట్లతప్ప) ఫస్ట్ ప్రైజ్ మాకే వచ్చేది. అందుకని అటెండెన్స్ తక్కువ ఉన్నా,ప్రిన్సిపాల్ మమ్మల్ని కాంపిటేషన్స్‌కు వెళ్లమని ప్రోత్సహించేవాళ్లు.

నేను డిగ్రీ చదువుతున్నప్పుడు ఎన్.సి.సి ద్వారా ఢిల్లీకి వెళ్లాను. కల్చరల్ యాక్టివిటీస్‌కు నన్ను

సెలక్ట్ చేసుకున్నారు. 16 స్టేట్స్‌లో కాంపిటేషన్ ఉంటుంది. నాకు సోలో సింగింగ్‌లో గోల్డ్ మెడల్, గ్రూపు సింగింగ్‌లో సిల్వర్, ఆర్కెస్ట్రాలో బ్రాంజ్ మెడల్ వచ్చాయి. సోలో సింగింగ్‌లో ఫస్ట్ వస్తానని నన్ను ట్రైన్ అప్ చేసిన బొబ్బిలి భాస్కరరెడ్డి గారు ముందే ఊహించారు. ఆయన ఆల్ ఇండియా రేడియో లైట్ మ్యూజిక్‌లో 'ఏ' గ్రేడు కంపోజర్. కాంపిటీషన్‌లో పర్టిక్యులర్‌గా అక్కడి హిందీ మాట్లాడే వాళ్లందరూ జూనియర్ లతగా నన్ను పిలవటం మొదలుపెట్టారు. అంత గ్రేట్ సింగర్‌తో నన్ను పోల్చటం నాకు వండర్ అనిపించింది. హిందీలో వాళ్లు చెప్పేవారు "గలే మే భగవాన్ హో ఆప్ కా" అని. ఆ ఎంకరేజ్ మెంట్ నేను ఇప్పటికీ గుర్తు పెట్టుకున్నాను.

తర్వాత భాస్కరరెడ్డి గారు - మీరు హైదరాబాద్ ఎందుకు వచ్చేయకూడదమ్మా -అని అన్నారు. అప్పటికి మేము ఇంకా గుంటూరులోనే చదువుతున్నాము. చదువు పూర్తిచేసి ఇక్కడకు వస్తే ఫీలివ్స్ కాకపోయినా ఆడియోన్ ఉంటాయి. అందువల్ల డీ.డీ.లోనో, దేనిలో నైనా అవకాశాలు వస్తాయన్నారు. అప్పటికే సీనియర్స్ అయిన సురేఖామూర్తి గారు లాంటి వారు డీ.డీ.లో పాడుతున్నారు. ఎం.ఎ.మ్యూజిక్ కంప్లీట్ అయిపోయిన తర్వాత అమ్మను వేమేవే హైదరాబాద్‌కు ట్రాన్స్‌ఫర్ పెట్టుకోమని అడిగాం.

హైదరాబాద్ రాగానే ఫస్ట్ ఫోన్ చేసింది భాస్కరరెడ్డి గారికే. "సార్, మేం ఇట్లా హైద్రాబాద్ వచ్చేశాం. మాకు ఏమైనా సింగింగ్ ఛాన్సు లున్నాయా" అని అడిగితే... "నీకు లేకపోవట మేమిటమ్మా, డెఫినెట్‌గా నువ్వు మంచి సింగర్ అవుతావు చూడు" అన్నారు.

మొదటిసారిగా సుధ, నేను పాడింది సాయిబాబా మీద డివోషనల్ ఆడియో. మాకు అదే హ్యాపీ అన్పించింది. అక్కడ కీ బోర్డు వాయించే చిన్నా గారు, ఫ్లూటిస్ట్ నాగరాజు ... అందరూ నంబర్స్ తీసుకోవడం..ఆడియో క్యాసెట్స్ ఎక్కడ వున్నా చెప్పడం....ఇలా సర్కిల్ పెరిగింది.

తర్వాత 'పాడుతా తీయగా'లో పార్టిసిపేట్ చేసాను. అక్కడే నీహాల్ పరిచయం.

నీహాల్ గారి క్లాసికల్ బ్యాలే రికార్డింగ్‌లో ఆర్పీగారు పరిచయమయ్యారు. ఆయన ఫస్ట్ నాకు ఓ యాడ్ ఫిలింలో పాడే ఛాన్స్ ఇచ్చారు. అప్పుడే ఆయన చెప్పారు..."నీకోసం అని ఓ చిత్రం చేస్తున్నాను. దానిలో ఓ పాట నీతో తప్పక పాడిస్తాను"అని. అన్నట్టుగానే ఓ నెల రోజుల లోపే పిలిచారు. 'నీ కోసం'తో పరిచయం చేసారు. దానికన్నా ముందు చక్రి గారికి 'మరోప్రేమ కథ' అనే సినిమా కోసం పాడినా అది రిలీజ్ కాలేదు.

సింగర్ శ్రీకాంత్ వల్ల చక్రి గారు పరిచయం అయ్యారు. ఆయనే నా నెంబర్ ఇచ్చారంట. పాడుతా తీయగా చూశారంట. అది చూసి చెప్పారు..."మా ఇంటిలో అందరూ మీ ఫ్యాన్స్. మీరు ఎక్సలెంట్‌గా పాడుతున్నారు. మిమ్మల్ని తప్పకుండా ఎంకరేజ్ చేస్తాను. నేను మీ ఫ్యాన్‌ని అంతే" అని అన్నారు. 'పాడుతా తీయగా' లో నేను సెలెక్ట్ చేసుకున్న సాంగ్స్ కూడా ఆయనకు నచ్చాయంట.

"నేను ఏ సినిమా చేసినా సరే తప్పకుండా మీకు ఓ పాట ఉంటుంది" అన్నారు. అలాగే ఇప్పటి వరకు ఆయన చేసిన సినిమాలన్నింటిలోనూ నేను పాడాను. నేను ఎక్కువగా పాడింది కూడా చక్రిగారికే. తర్వాత పట్నాయక్ గారికి. ఒక్క ఎస్.ఏ.రాజ్‌కుమార్ గారికి తప్ప ఇంచుమించు అందరు మ్యూజిక్ డైరక్టర్స్‌కి నేను పాడాను.



'చెల్లెలు సుధతో కౌసల్య

ఫిల్మ్ మ్యూజిక్‌కి క్లాసికల్ మ్యూజిక్ చక్కటి హెల్ప్ అవుతుంది. బేసిక్ నాలెడ్జ్ చాలా యూజ్‌ఫుల్. రికార్డింగ్ థియేటర్‌కి వెళ్లి నేర్చుకునేటప్పుడు ఒకటి రెండు సార్లు మనకు సాంగ్ వినిపిస్తారు. అప్పుడే నేను స్వరాలను రాసేసుకుంటాను. చరణం ఎక్కడ స్టార్ట్ అవుతుంది అనేది వాటిని చూసిన వెంటనే గుర్తుకు వచ్చేస్తాయి. దానికంటే ముందు డైరెక్ట్‌గా నేర్చుకోవటానికే నేను ఎక్కువ ప్రిఫరెన్స్ ఇస్తాను. డిపెండ్ అవడం వల్ల గ్రాస్పింగ్ పోయే అవకాశం ఉందేమోనని ఒక డౌట్. అందుకని డైరెక్ట్‌గా నేర్చేసుకుందామని ఫస్ట్‌ట్రై చేస్తాను. ఒకవేళ డౌట్ వస్తే వెంటనే నొటేషన్స్ రాసేసుకుంటాను. క్లాసికల్ మ్యూజిక్ అనేది డెఫినేట్‌గా హెల్ప్ అవుతుందని దీనివల్ల నాకు అర్థమయింది.

వంశీ గారి 'ఔను వాళ్లిద్దరూ ఇష్టపడ్డారు' సినిమాకు పాడటం ఓ మంచి మెమరబుల్ మూమెంట్. ఆయన దగ్గర పాడటానికి నేను వెళ్లినప్పుడు "సాంగ్ నీకు రికార్డ్ చేసి ఇవ్వటం ఏమీ వుండదు. మా మద్రాస్‌లో ఇలాగే చేస్తాం. మరి ఇక్కడ ఎలా చేస్తారో మాకు తెలియదు. నేను ట్యూన్ చెప్తాను.. నొటేషన్ రాయగలవా" అని అడిగారు. నేను 'రాయగలను' అన్నాను. 'అంటే సంగీతం తెలుసునా' అని అడిగారు. నేను 'ఎం.ఏ. మ్యూజిక్ చేసాను' అని చెప్పాను. చక్రి గారు నాకు సాంగ్ చెప్పారు. ఒక్కసారే చెప్పారు నాకు. "ఇప్పుడు పాడు" అన్నారు వంశీగారు. 'ఏమి నా భాగ్యమూ...' అని బిట్ సాంగ్ పాడాను. నొటేషన్స్ అన్నీ రాసుకోవడం వల్ల సరిగ్గా పాడగలిగాను. వెంటనే వంశీ గారు "బాగా పాడుతున్నావ్ మంచి నాలెడ్జి ఉంది" అన్నారు. ఆ తర్వాత ఆ సినిమాలో పాడుతున్నప్పుడు కూడా చాలా ఎంకరేజ్ చేశారు.

ఇంకో మెమరబుల్ మూమెంట్ ఏంటంటే- 'డ్రీమ్స్' అనే చిత్రం కోసం పాడుతున్నప్పుడు జరిగింది. యాక్చువల్‌గా నేను పాడింది ఫాస్ట్‌బీట్ సాంగే. దర్శకులు విశ్వనాథ్ గారు 'కుచ్చికుచ్చికూనమ్మ' చిత్రం డబ్బింగ్ కోసం అక్కడకు వచ్చారు. రికార్డింగ్ అవుతూ ఉంది. 'సార్ మా సాంగ్ మీరు వింటారా' అని చక్రి గారు అడిగితే 'వినిపిస్తే తప్పకుండా' అని ఆయన అన్నారు. అప్పుడు కె.కె., నేను పాడిన పాట ప్లే చేశారు. 'ఎవరు మేల్ సింగర్' అని ఇంట్రెస్టింగ్‌గా అడిగారు. తర్వాత 'ఫిమేల్ సింగర్ ఎవరు మద్రాసు నించే కదా' అన్నారు- యూజ్ యూజువల్ గా మద్రాస్ వాళ్లే పాడతారు కదా అన్నట్టు! "లేదండీ హైద్రాబాద్ సింగరే" అన్నారు చక్రి గారు. దానికాయన ఆశ్చర్యంగా "హైద్రాబాద్ వాళ్లలో ఇలా పాడేవాళ్లు ఉన్నారా"అన్నారు. ప్రక్కనే నేను ఉన్నాను కానీ నన్ను ఆయన చూడలేదు. కానీ ఆయన మాటలు నేను విన్నాను. వెంటనే "ఆమె ఇక్కడే వుంది" అని నన్ను పరిచయం చేశారు చక్రి గారు. "అమ్మా మీకు క్లాసికల్ మ్యూజిక్ వచ్చా" అని అడిగారు విశ్వనాథ్ గారు. "ఎం.ఏ. క్లాసిక్ మ్యూజిక్ చేశాను... తిరుపతిలో" అని అన్నాను. ఆయన ఏం మాట్లాడలేదు. రెండు చేతులెత్తి నమస్కారం పెట్టారు...చాలా గొప్ప పని చేశావ్. మంచి పద్ధతి అని ఆశీర్వదిస్తున్నట్టు! నాకు ఏం చేయాలో అర్థం కాలేదు. వెంటనే నమస్కారం పెట్టాను...అంతే! ఇది మరచిపోలేని సంఘటన.

ఓసారి 'లిటిల్‌హార్ట్స్' అనే మూవీలో ఓ సాంగ్ పాడుతున్నాను. 'ఆనందమే...'అంటూ చాలా హైలో ఉంటుందాసాంగ్. అది పాడుతున్నప్పుడు తమ్మారెడ్డి భరద్వాజ గారు లోపలికి వచ్చి కూర్చున్నారు. నేను సాంగ్ పాడేసి వచ్చి కూర్చున్నాను. "ఎవరు పాడింది ఈ అమ్మాయేనా...ఏంటి పైన కీచుగా అరుస్తుంది?" అన్నారు. చక్రి గారు "లేదండి... మేం ఇంకా ఫైనల్ మిక్సింగ్ చేయలేదు, వాయిస్ లో లో ఉంది. నేను వినటం కోసం రిథమ్స్ పెంచుకున్నాను. అది మీకు ఫైనల్ మిక్సింగ్‌లో తెలుస్తుంది" అని అన్నారు."ఏం బాగా పాడలేదు" అంటూ (నవ్వుతూనే) అనేసి భరద్వాజగారు వెళ్లిపోయారు. ఎవరైనా ఇటువంటి కామెంట్స్ చేస్తే నా కాన్ఫిడెన్స్ మొత్తం లూజ్ అయిపోతుంది. అటువంటి సమయాలలో జనరల్‌గా మా సిస్టర్ సుధ నాకు మంచి హెల్ప్ చేస్తుంది. "ఏం లేదు...నీది మంచి ఫ్లెక్సిబుల్

వాయిస్" అంటూ బూస్టప్ చేస్తుంటుంది. ఆయన చేసిన కామెంట్‌కు నేను లూజ్ అయిపోయాను. ఆ సంఘటన నుండి తేరుకోవడానికి నాకు కొన్ని రోజులు పట్టింది.

ఆ తర్వాత 'ఇడియట్' సినిమా అప్పుడు నాకు ఓ ఫోన్ వచ్చింది. 'కౌసల్యేనా మాట్లాడుతుంది' అని అడిగారు.'అవునండి' అన్నాను. 'నేను భరద్వాజను మాట్లాడు తున్నాను' అని అన్నారు. నేను రమణీ భరద్వాజగారేమో అనుకున్నాను. "కాదమ్మా నేను తమ్మారెడ్డి భరద్వాజను మాట్లాడుతున్నాను" అన్నారు. నేను వండర్ అయిపోయాను. "సార్... నమస్తే అండీ.. చెప్పండి సార్" అంటే... "ఇడియట్‌లో 'ఈ రోజే తెలిసింది...' సాంగ్ చాలా ఎక్సలెంట్‌గా పాడావు. నా కారులో ఆ పాట తప్పితే వేరే పాటే పెట్టట్లేదు. ఆ రొమాంటిక్ ఫీలింగ్ అన్నది చూశావా అప్పట్లో జానకి పలికించగలిగింది. ఓ రోజు నిన్ను తిట్టాను గుర్తుందా నీకు" అన్నారు. "గుర్తుంది సార్" అంటే.."ఆ రోజు తిట్టినందుకు ఈ రోజు ఫీల్ అవుతున్నాను" అని ఆయన అంటే..."అమ్మో సార్ మీరు అట్లా అనకూడదు" అన్నాను..."లేదు లేదు చేసింది ఒప్పుకోవాలి. ఆ రోజు నేను పొరపాటుగా తిట్టాను. ఈ సినిమాలో 'లేలేత నవ్వులా పింగాణీ బొమ్మలా...'పాట కూడా చాలా హై రేంజ్ లో పాడావు. చాలా బాగా పాడావు. అందుకే చక్రికి చెప్పి చెప్పవయ్యా అంటే 'మీరే చెప్పండి సార్'అన్నాడు. అప్పుడు నేను తిట్టాగా మళ్లీ నీకు ఎట్లా చెప్పాలా అనుకున్నాను. అయినా చక్రి దగ్గర నంబరు తీసుకుని చేశాను" అని అన్నారు. రీసెంట్‌గా ఆయన తీస్తున్న సినిమాలో కూడా మూడు సాంగ్స్ పాడించారు. ఇది కూడా నాకు అన్‌ఫర్‌గెటబుల్ మూవ్‌మెంట్.

నేను చెప్పాను కదా నేను కాన్ఫిడెన్స్ త్వరగా లూజ్ అయిపోతాను అని... అట్లాంటప్పుడు మీ కామెంట్స్ నేను గుర్తు చేసుకుంటాను.(ఈ ఇంటర్వ్యూ తీసుకుంటున్న 'హాసం' ఎడిటర్ రాజాతో మాట్లాడుతూ) మీకు గుర్తుందో లేదో...'బాచీ' సినిమా ఆడియో రిలీజప్పుడే



మిమ్మల్ని ఫస్ట్ టైమ్ చూశాను. జర్నలిస్ట్ రాజా గారని మిమ్మల్ని పరిచయం చేశారు. తర్వాత మీరు ఫోన్ చేసి 'క్యాసెట్ విని ఫోన్ చేస్తున్నాను మీరు చాలా మంచి సింగర్ అవుతారు. వర్సటైల్ సింగింగ్ వుంది మీకు. రెండు డిఫరెంట్ సాంగ్స్ చాలా ఈజ్‌తో పాడారు మీరు' అని చాలా ఎంకరేజింగ్‌గా చెప్పారు మీరు. ఓ క్రిటిక్ ద్వారా అప్రిసియేషన్ పొందటం అనేది నార్మల్‌గా జరగదు. మీ నుంచి వచ్చిన ఆ అప్రిసియేషన్ నేను ఎప్పుడూ గుర్తు పెట్టుకుంటాను. పాడేటప్పుడు కూడా అది గుర్తుచేసుకుంటుంటాను. అది నా కాన్ఫిడెన్స్‌ని బాగా పెంచుతుంది. నా కెరీర్ మొదట్లోనే చాలా ఎంకరేజ్‌మెంట్ ఇచ్చారు మీరు. చాలా మందికి నేను చెప్పుకున్నాను కూడా - రాజా గారు ఇట్లా అన్నారు అని! అదికూడా నాకు చాలా అన్‌ఫర్‌గెటబుల్.

'హాసం' పత్రిక నేను చాలా ఫాలో అవుతూంటాను. చాలా మంచి విషయాలు రాస్తారు మీరు.

బర్త్‌డే గిఫ్ట్‌గా మీరు ప్రచురించనున్న ఈ ఇంటర్వ్యూ మీకిస్తుంటే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 'ఎండమావులు' టీ.వి సీరియల్ టైటిల్ సాంగ్ పాడినందుకు నంది అవార్డు ప్రకటించడం మరొక మరచిపోలేని సంఘటన.

పూరీ జగన్నాథ్ గారు కూడా నన్ను బాగా ఎంకరేజ్ చేస్తారు. ఆయనకు సింగింగ్ నాలెడ్జి ఉంది. 'ఆంధ్రా వాలా' అనే సినిమాకు ఒక వెరైటీ సాంగ్ చేశారు. సాధారణంగా మైక్ ముందు వాయిస్ టెస్టింగ్ చేస్తున్నప్పుడు ఇంగ్లీషువి... లైట్ పాప్, ఫాస్ట్ బీట్‌తో ఉన్నవి పాడుకుంటూ ఉంటాను. చక్రిగారు అవి వింటూ ఉంటారు. "ఏదో ఒక సాంగ్‌లో ఇవి పాడొచ్చు కదా, ఇంత ఎబిలిటీ ఉండి ఎందుకు పాడటం లేదు" అని చెప్పేసి నేను ఒక ర్యాప్ పాడుతూ వుంటే "ఇదే ఇప్పుడు టేక్" అని చెప్పి దానినే తీసేశారు. ఆ ర్యాప్ రక్షిత యాక్ట్ చేసే ఓ తెలుగు పాట మధ్యలో వస్తుందన్న మాట.

ఈ మధ్యనే పూరీజగన్నాథ్ గారు ఫోన్ చేసి "ప్రకాష్ స్టూడియో నుంచి మాట్లాడుతున్నాను. ర్యాప్ చాలా బాగా పాడావు. ఈ ఒక్కపాటకే నీకు మంచి గిఫ్ట్ ఇవ్వాలి. ఏం కావాలో ఆలోచించి పెట్టుకో"అన్నారు. "బాచీ సినిమా నుండి మీరు నన్ను ఎంకరేజ్ చేస్తున్నారు. అలాగే మీ ప్రతి సినిమాలోనూ ఓ పాట ఇవ్వండి అదే మంచి గిఫ్ట్ నాకు" అని అన్నాను.

ఇవన్నీ నేనెప్పుడూ తల్చుకునే మరిచిపోలేని సంఘటనలు... ◆

| చిత్రం | కౌసల్య పాడిన పాటలు | సంగీత దర్శకుడు |
|---|---|---|
| 1. నీకోసం | 2 | ఆర్.పి.పట్నాయక్ |
| 2. చిత్రం | 3 | ఆర్.పి.పట్నాయక్ |
| 3. భవాని | 1 | నీహాల్ |
| 4. బాచి | 2 | చక్రి |
| 5. లిటిల్ హార్ట్స్ | 2 | చక్రి |
| 6. రాఘవ | 1 | శశిప్రితమ్ |
| 7. వైఫ్ | 1 | ఘంటాడికృష్ణ |
| 8. ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యం | 2 | చక్రి |
| 9. ఇన్‌స్పెక్టర్ విక్రమ్ | 2 | రాజ్ |
| 10. బెజవాడ పోలీస్ స్టేషన్ | 2 | శ్రీలేఖ |
| 11. నువ్వు లేక నేను లేను | 1 | ఆర్.పి.పట్నాయక్ |
| 12. శ్రీరామ్ | 1 | ఆర్.పి.పట్నాయక్ |
| 13. ఆడుతూ పాడుతూ | 2 | చక్రి |
| 14. అతను | 1 | చక్రి |
| 15. లగ్నపత్రిక | 1 | రాజ్ |
| 16. డ్రీమ్స్ | 6 | చక్రి |
| 17. ఔను! వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు | 8 | చక్రి |
| 18. ఇడియట్ | 2 | చక్రి |
| 19. కనులు మూసినా నీవాయే | 3 | చక్రి |
| 20. అల్లరి రాముడు | 1 | ఆర్.పి.పట్నాయక్ |
| 21. చెన్నకేశవ రెడ్డి | 1 | మణిశర్మ |
| 22. నువ్వే-నువ్వే | 1 | కోటి |
| 23. అన్వేషణ | 1 | మధుకర్ |
| 24. ఉత్సాహం | 1 | అనురాగ్ |
| 25. ధనలక్ష్మి ఐ లవ్ యూ | 2 | చక్రి |
| 26. గెలుపు | 2 | వాసురావు |
| 27. ఈశ్వర్ | 1 | ఆర్.పి.పట్నాయక్ |
| 28. గంగోత్రి | 1 | కీరవాణి |
| 29. అనగనగా ఓ కుర్రాడు | 2 | చక్రి |
| 30. జూనియర్స్ | 2 | చక్రి |
| 31. అమ్మాయిలు - అబ్బాయిలు | 6 | చక్రి |
| 32. కబడ్డీ - కబడ్డీ | 4 | చక్రి |
| 33. అమ్మానాన్న ఓ తమిళ అమ్మాయి | 3 | చక్రి |
| 34. నాగమనాయుడు | 1 | ప్రమోద్ శర్మ |
| 35. బ్రహ్మచారులు | 1 | శ్రీధర్ |
| 36. ఒకరాజు - ఒకరాణి | 4 | చక్రి |
| 37. నిన్నే ఇష్టపడ్డాను | 1 | ఆర్.పి.పట్నాయక్ |
| 38. రౌడి | 1 | శ్రీధర్ పట్నాయక్ |
| 39. నీలాంబరి | 1 | రాజేష్ రామనాథన్ |
| 40. పవన్‌సుబ్బలక్ష్మి -ప్రేమించుకున్నారట | 1 | త్రినాథ్ |
| 41. ధమ్ | 1 | రమణగోగుల |
| 42. ఎంజాయ్ | 2 | చక్రి |
| 43. కళ్యాణం | 1 | శ్రీధర్ |

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.40/-

తెలుగు సినీ గానానికి ప్రాణమైన ఘంటసాల పాడిన పాటలలో - ఆయన సతీమణి శ్రీమతి ఘంటసాల సావిత్రి గారికి నచ్చిన ఓ 16 పాటలను ఎన్నుకొని 'ఆయన గానం... ఆమెకు ప్రాణం' అనే మకుటంపై వాల్యూమ్-1 గా విడుదలైన ఆడియోక్యాసెట్ మార్కెట్‌లో వుంది.

రావే నా చెలియా(మంచి మనసుకు మంచి రోజులు), అదిగో నవలోకం (వీరాభిమన్యు), ఈనాటి ఈ హాయి (జయసింహ), ఎచటినుండి వీచెనో ఈ చల్లని గాలి (అప్పుచేసి పప్పుకూడు), ఎవరునీవు నీ రూపమేది (ప్రేమలు-పెళ్ళిళ్ళు), సంసారం సంసారం ప్రేమ సుధాపూరం (సంసారం), నాకంటి పాపలో నిలిచిపోరా (వాగ్దానం), నీవేనా నను తలచినది (మాయాబజార్) వంటి రెగ్యులర్‌గా వినిపించే గీతాలూ;

నాసరి నీవని నీ గురి నేనని (సి.ఐ.డి.), ఏమననే చిన్నారి ఏమననే (షావుకారు) ఏమి శిక్ష కావాలో కోరుకొనవె ప్రేయసీ (చంద్రహారం), నీలోన నన్నే నిలిపేవు నేడే (గుడిగంటలు), మిడిసి పడకు మిడిసి పడకు అత్తకూతురా (ఆస్తిపరులు) వంటి అప్పుడప్పుడు వినిపించే గీతాలూ.

శాంతవంటి పిల్లలేదోయ్ (పల్లెటూరిపిల్ల), ఆ మనసులోన (పల్లెటూరు), నిదురించవయ్యా నా చిన్నితనయ (శ్రీకృష్ణమాయ) వంటి పూర్తిగా వినమరుగు అయిపోయిన గొప్ప గీతాలూ ఈ క్యాసెట్‌లో వున్నాయి.

ఈ 16 పాటల గుణగణాల విషయమై ఇవాళ కొత్తగా తెలుగు వారికి విశ్లేషించ నవసరం లేదు. చాలా పాటలు ఎంతోమందికి ఇంటర్‌లూడ్స్‌తో సహా కంఠోపాఠం కూడా...! అయినా ఇవాళ మళ్ళీ కొని వింటే కొనియాడబుద్ధి అవుతుందే తప్ప మరో ఫీలింగ్ కలగదు. అప్పుడప్పుడు వినిపించే గీతాలుగా పైన పేర్కొన్న పాటలు వింటుంటే... ముఖ్యంగా నాసరి నీవని పాటలో ఘంటసాల చేసిన ఆలాపనలు, ఏమననే పాటలో మౌనమౌనమౌనముగా అని అంటున్నప్పుడు ఆయన స్వరంలో వినిపించిన సొగసులు... వింటుంటే మనసుకు సేద తీరినట్టు అనిపిస్తుంది.

ఇక పూర్తిగా వినమరుగైపోయిన జాబితాలో పేర్కొన్న మూడు పాటలూ వేటికవే సాటి. ఒక్కొక్కటి ఒక్కొ రసగుళిక.

ఈ పాటల విశిష్టత, సాంద్రత తెలుసుకోవాలంటే... డ్రైవింగ్ టెన్షన్ లేకుండా ప్రయాణం చేస్తున్నప్పుడు ఏ వాక్‌మన్ ద్వారానో, చిన్న టేప్‌రికార్డర్‌ని ఇయర్‌ఫోన్స్‌తో పెట్టుకొనో విని పయనించి చూడండి... గాఢంగా శయనించిన అనుభూతి అతి తక్కువ సమయంలోనే కలిగి ప్రయాణ బడలిక అసలు లేకుండా ఉన్నట్టని పిస్తుంది. నిజం చెప్పాలంటే ఇదో రకం మెడిటేషన్...! ఇన్‌లేకవర్‌పై చిలిపిచూపుల ఘంటసాల బ్లాక్ అండ్‌వైట్‌లో; ఆయన సతీమణి సావిత్రి గారి ఫోటో కలర్‌లో ఉండటంతో పాటు ఆమె సంతకాన్ని కూడా పొందుపరచటం... ఈ క్యాసెట్ రూపకల్పన చేసిన వారి అభిరుచికి ఓ నిదర్శనం. ◆




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.40/-

అక్కినేని నాగేశ్వరరావు, జమున నటించిన మురళీకృష్ణ-మూగనోము చిత్రాలలోని 13 పాటలను ఒక కాంబినేషన్ క్యాసెట్‌గా హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు.

మురళీకృష్ణ సినిమాలోని కనులుకనులు కలిసెను, ఊఁ అను ఊఁ ఊఁ అను, నీసుఖమే నే కోరుతున్నా, ఏమని ఏమని అనుకుంటున్నది, మ్రోగునా మధురవీణ, వస్తాడమ్మ నీదైవము, ఘలుఘల్లని పాటలు; మూగనోము సినిమాలోని పగడాల జాబిలి చూడు, ఈ వేళ నాలో ఎందుకో ఆశలు, ఊరు మారినా ఉనికి మారునా, తల్లివినీవే తండ్రివినీవే, నిజమైనా కలయైనా నిరాశలో ఒకటేలే, గొంతు విప్పి నేపాడితినా మొదలైన పాటలు ఉన్నాయి ఈ క్యాసెట్‌లో. మురళీకృష్ణలో ఘలుఘల్లని పాట, మూగనోములో గొంతువిప్పి నే పాడితినా అనే పేరడీ పాట బైట అంతగా ప్రచారంలో లేనివి. మిగిలిన 11 పాటలూ తెలుగు శ్రోతలకు 'సురుచిరపరిచితమే'.

క్యాసెట్‌లు లేని రోజుల్లో విడివిడిగా డిస్కుల రూపంలో వచ్చిన ఈ పాటలను ఏకమొత్తంగా ఒక క్యాసెట్ ఫార్మాట్‌లో తీసుకురావటం హర్షించదగ్గ విషయం. ఇలాంటి మ్యూజికల్ హిట్స్ గల సినిమాలు కాంబినేషన్ క్యాసెట్లుగా రావలసిన అవసరం ఎంతైనా ఉంది.. ఎంతోవుంది! ◆





విడుదల : సురభి మ్యూజిక్
వెల : రూ.50/-(క్యాసెట్), రూ.100/-(సి.డి.)



## మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు




విడుదల : టిప్స్
వెల : రూ.42/-




విడుదల : సూర్య
వెల : రూ.35/-

# బిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి BV



'మీకు చవగ్గా ఇంటర్‌నెట్ కనెక్షన్ ఇచ్చేస్తానంకుల్' అంటాడు పక్కింటి కుర్రాడు. దాంతో మీరు వీర లెవెల్లో మురిసిపోయి ఓకే అంటారు.



కనెక్షన్ ఇచ్చిన మరుక్షణమే కంప్యూటర్ మొత్తం ఢమేల్ మంటే...



పెళ్లి నాడు మీ దంపతులను ఆశీర్వదిస్తూ ఓ తేలికైన కవరును మీ ముసలి మేనత్త చేతిలో పెడితే ముఖం ముడుచుకుని ఓ పక్కన పడేస్తారు మీరు...



ఆవిడ పోయిన ఆరు నెలలకు కవరు సంగతి గుర్తొచ్చి వెతికి, తీసి, చింపగా అందులో మీ పేర్న ఓ పది లక్షల రూపాయల చెక్కు ఉంటే...



లంకెల బిందెలు దొరికినట్టుగా కల వచ్చి, స్వప్న ఫలితాలు తెలుసుకుందామని జ్యోతిష్యుణ్ణి సంప్రదిస్తే... మీ జీవితంలో గొప్ప మార్పు రాబోతోందని చెబుతాడు.



దాంతో తెగరెచ్చిపోయి కలలో కనిపించిన చోట తవ్వగా అక్కడ ఉన్న మందుపాతర ఢామ్ అంటూ పేలితే....

# రాజా ఆడియో రివ్యూ




విడుదల: సోహన్
వెల: రూ 38/-

'సంతోషం' వంటి పెద్ద హిట్‌ని తొలి ప్రయత్నంలోనే ఇచ్చిన దశరథ్ దర్శకుడు కావడం, సంచలన దర్శకుడైన తేజ స్వంత సంస్థ అయిన 'చిత్రం మూవీస్' బ్యానర్‌పై నిర్మించబడడం, క్రేజీ హీరో నితిన్ కథానాయకుడు కావడం- ఇవన్నీ 'సంబరం' చిత్రాన్ని- అంచనాల పరంగా- హైరేంజ్‌లో నిలబెట్టాయి. అందుకు తగ్గట్టుగానే ఆడియో సేల్స్ కూడా జరిగాయి. ఆర్పీ పట్నాయక్ సంగీత దర్శకత్వం వహించిన ఈ చిత్రం ఆడియో సోహన్ ద్వారా విడుదలయింది. ఇందులో 9 పాటలున్నాయి. రెండు పాటలను సిరివెన్నెల, మిగిలిన పాటలను కులశేఖర్ రాశారు.

టిప్పు పాడిన 'దేవుడిచ్చిన వరమని తెలిసే' పాటలో తొలి అయిదు అక్షరాలు, దానికి జతపడిన ట్యూన్ వినగానే 'సంతోషం' సినిమాలోని 'దేవుడే దిగి వచ్చినా' పాటయొక్క హిట్ సెంట్‌మెంటా అని అనిపిస్తుంది - తర్వాతి పాటంతా దానితో సంబంధం లేకుండా నడిచినా సరే! అతి సులువుగా నోటికి పట్టే ట్యూన్ యిది. అంచేత ఎక్కువమంది నోట నలిగే అవకాశముంది. సాహిత్య పరంగా కులశేఖర్ మంచి స్టెబిలిటీ చూపించాడు. రెగ్యులర్‌గా తనలో ప్రతిఫలించే తన గురువు సీతారామశాస్త్రి గారి మార్కు (ఇది ప్రేమకాక మరి ఏంటంట లాంటివి) తో పాటు ఆత్రేయ స్ఫూర్తిని కూడా - మనసు తనలో తను మురియటం లాంటి వాక్యాల ద్వారా - చూపించాడు.

'ఎర్రగులాబీ - తల్లో పెట్టుకున్నాది - జడే ఊపుతున్నాది - అది నాది' పాట హిట్ సాంగ్ ఆఫ్‌ది ఆడియో అండ్ ఫిల్మ్ అని పేర్కొనాలి. కుర్రాళ్ళకు నచ్చే అంశాలుండడంతో పాటు అన్ని వయసుల వారి ఆమోదాన్ని పొందే ట్యూన్ ముడిపడటం ఈ పాటకి ప్లస్ పాయింట్. దానికి తోడు 'ఫ్ర్బవ్' (లిపిలో దీన్ని తృవ్ అనే రాయాలి) అనే ప్రయోగాన్ని కూడా చేర్చారు - తెనాలి రామకృష్ణుడు 'తృవ్వట బాబా తలపై జాబిల్లి' పద్యాన్ని చెప్పినట్టు! ఈ ప్రయోగం అటు మాస్‌కి, ఇటు యూత్‌కి పట్టడంతో పాటు తెనాలి రామకృష్ణుడంతటి వాడు చేసినది కాబట్టి పెద్దలు కూడా ముసి ముసిగా నవ్వుకుంటూ హమ్ చేసుకునే ఛాన్సుంది. ఎంటర్‌టెయిన్ మెంట్‌లు అంతగాలేని రోజుల్లో రోడ్డు మీద పోయే ప్రతిదాన్ని 'అది నాది ఇది నాది' అంటూ పంతులు వేసుకోవడం, ఎక్కడైనా క్లాష్ వస్తే గిల్లికజ్జాలాడుకోవడం వంటివి యాభై ఏళ్ళ క్రితం చిన్న పిల్లల మధ్య జరిగే వినోదకాలక్షేపాలు. అటువంటి ముచ్చటని అంత వయసులేని కులశేఖర్ ఈ పాటకు పల్లవిగా ఎన్నుకున్నందుకు 'సరదాగా' అతడిని అభినందించాలి. పాడింది రవివర్మ, మల్లి అండ్ గ్రూప్ అన్నారు. మల్లి అంటే మల్లికార్జున్ అయ్యిండొచ్చు.

ఆర్పీ పట్నాయక్ పాడిన 'ప్రేమను పంచిన ప్రేమను - ప్రేమను పెంచిన ప్రేమను- ఆశగా కోరదా ప్రతి హృదయం' పాట సంగీతపరంగా, సాహిత్య పరంగా ఎన్నదగిన పాట, నాలుగు కాలాలపాటు ఉదహరించుకోదగ్గ పాట. 'ఇద్దరు' (డబ్బింగ్) సినిమాలోని 'శశివదనే శశివదనే స్వర నీలాంబరి నీవా' పాట ఇన్‌స్పిరేషన్ ఎంతగా వుందో ఏమోగాని ఈ పాట నడక కొన్ని కొన్ని చోట్ల ఆ పాటను స్ఫురింప చేస్తుంది. అయినా సరే ఇదొక స్వతంత్ర స్వరరచన. కంపోజింగ్‌లోను, గానంలోను పట్నాయక్ చక్కటి సమన్వయం సాధించాడు. ఇక కులశేఖర్... తన లైఫ్‌లో 'దిబెస్ట్' అనుకునే పాటల లిస్ట్‌లో చెప్పుకోదగ్గ పాటల్లో ఈ పాట తప్పనిసరిగా వుండే స్థాయిలో సాహిత్యాన్ని అందించాడు. మొదటి చరణం రాయటానికి ఆధ్యాత్మిక పరిపక్వతతో పాటు నేటి ఐహిక బంధాల మీద గౌరవంతో కూడిన అభిమానం వుండాలి. అది తనలో వుందని ఋజువు చేసుకున్నాడు కులశేఖర్. గుప్పెడంత గుండెలో- ప్రేమ- జ్ఞాపకాల ఊపిరై తాకటం అనే వాక్యం సాంద్రతగల భావుకత్వానికి నిదర్శనం. ప్రేమించిచూడు ఒకసారి- అది మార్చుతుంది నీ దారి అనే లైనులో అందంగా కనిపించేది ప్రాస. కాని వెనుకనున్నది అనుభవానికి మాత్రమే అర్థమయ్యే భాష. ప్రేమలో ఆకాశమంత సంతోషముంది అనటం- ఆకాశాన్ని శూన్య దృష్టితో కాక అనంతదృష్టి చూస్తే- కరెక్టే! ఆడియో హిట్‌లు, అవార్డులు కన్నా తన తర్వాత నిలిచిపోయే పాటని రాసుకోవటంలోనే నిజమైన రచయిత తృప్తిని పొందుతాడు. ఈ పాట కులశేఖర్‌కి ఆ తృప్తినిస్తుంది.

రాజేష్ పాడిన 'మధురం మధురం ఎపుడూ ప్రేమ' సాంగ్ బిట్‌లో కూడా కులశేఖర్ మంచి ప్రజ్ఞ చూపాడు. ప్రేమని 'కలల సీమలో నిజం'గా పేర్కొనటం అందుకు ఒక మచ్చుతునక. గ్రంథ పరిచయంతో పాటు పూర్వకవుల ప్రయోగాలను కూడా ఒంట పట్టించుకున్న రచయిత తనదైన సంస్కారాన్ని కలుపుకుంటూ ప్రశంసార్హమైన సాహిత్యాన్ని అందించగలడు. 'వలపు, విషము ఒకటేనేమో- మనసు, మమత కలలేనేమో' అనే వాక్యం అందుకు ఉదాహరణ, (దీన్ని సంపూర్ణంగా వివరించాలంటే మరో రెండు మూడు పేరాల విశ్లేషణ రాయాలి, స్థలాభావాన్ని గుర్తించి పాఠకులు క్షమించాలి).

ఆర్.పి.పట్నాయక్ పాడిన 'ఎందుకే ఇలా - గుండెలోపలా - ఇంత మంటరేపుతావు అందని కలా' పాట- ట్యూన్ పరంగా పట్నాయక్ మార్క్‌ని అణువణునా నింపుకున్న పాట. ఇక సాహిత్య పరంగా ఆలోచిస్తే ప్రతివాక్యం వెనుకా- నిశితంగా స్పందించి, సునిశితంగా అందించే గుణం సీతారామశాస్త్రిగారికి ఎంత వున్నదో తెలుస్తుంది. ఇలాంటి పాట రాయడానికి గుండె తడిసి తడిసి బరువెక్కిపోవాలి. అసలు ప్రేమ, విరహం మీద సీతారామశాస్త్రిగారు ఇప్పటివరకు రాసిన పాటల మీద ఎవరైనా- ఎకడమిక్ క్వాలిఫికేషన్ కోసం కాకుండా- ప్రజలకోసం, తనను తాను సుసంపన్నం చేసుకోవటం కోసం- పరిశోధన చేస్తే పి.హెచ్.డి. వారి దగ్గరకి పరుగెత్తుకుంటూ వస్తుంది. అంతటి అనుభూతిని కలిగించే సీతారామశాస్త్రి గారి పాటల్లో ఇదొకటి. కావాలంటే ఈ పాట సాహిత్యాన్ని ఓ పదిసార్లు నెమరు వేసుకుని చూడండి. ఈ అనుభవం ప్రతివారి జీవితంలోనూ ఏదోక్షణంలో ఎదురయ్యే వుంటుంది.

రవివర్మ, శ్రీరాం, బాలాజి పాడిన 'నక్కతోక తొక్కావురో' పాట సంగీతపరంగా సాహిత్య పరంగా హుషారైన సరదాపాట.

మల్లికార్జున్ పాడిన 'పట్టుదలతో చేస్తే.... సమరం' పాట సాహిత్యపరంగా చాలా గొప్ప పాట. ప్రతి ఒక్కరూ తమ డైరీల్లో మొదటి పేజీల్లో రాసుకోదగ్గ పాట. వ్యక్తిత్వ వికాసాల కోసం కెరీర్ కౌన్సిలింగ్‌లకు వెళ్తున్నవారు ఈ పాట సాహిత్యాన్ని ఆకళింపు చేసుకుంటే చాలు తామే మరొకరికి చెప్పేస్థాయికి చేరు కుంటారు. 'ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి' పాట తర్వాత - ఆ పాటతో తూగదగ్గ స్థాయిని కలిగిన పాట యిది అని రసజ్ఞులందరూ అనుకునేలా రాసిన సీతారామశాస్త్రిని అభినందించడం, లేదా నమోవాకాలర్పించటం తప్ప... మనం తెలుగు వాళ్ళం.... ఇంకే చేయగలం!?

మల్లికార్జున్ పాడిన 'నీ స్నేహం దూరం ఆయె నీ ప్రాణం భారం ఆయె' బిట్ సాంగ్‌లో కులశేఖర్ సాహిత్యం చూస్తుంటే గురువు (సీతారామశాస్త్రి) గారితో పోటీపడే స్థాయిలో రాయాలన్న తపన ఆద్యంతం కనిపిస్తూ వుంటుంది.

ఆర్.పి.పట్నాయక్, ఉష పాడిన 'పిట్ట నుడుం పిల్ల భలేగుందిరో' పాట మాస్ ఓరియెంటెడ్ సాంగ్ అని పల్లవిని బట్టి అనిపించినా చరణాల్లో అందరూ ఆమోదించే సాహిత్యాన్ని అందించాడు కులశేఖర్. 'శృతించనీ' అనే ఓ మంచి మాట వాడేడాయనా ఈ పాటలో. ◆

**రచన: కులశేఖర్ (1) గానం : టిప్పు**

ప: దేవుడిచ్చిన వరమని తెలిసే నడిచివచ్చిన కలలని తెలిసే
మనసు తెచ్చిన వెలుగని తెలిసే తెలిసె తెలిసె తెలిసె ॥దేవుడిచ్చిన॥
అలవాటు లేని ఈ పులకింత తన రూపమేగా నా మనసంతా
ఇది ప్రేమకాక మరి ఏంటంట నోడౌట్ నోడౌట్ నోడౌట్
ఇది ప్రేమా ప్రేమా ప్రేమా ॥4॥
చ: ప్రాణమున్నది మనసు తనులేని జీవితం బోరుసు
పుస్తకాలలో దాచుకున్న నా జ్ఞాపకాలనే అడుగు
ఆమె పేరునే మనసు అరె మాటి మాటికి తలుచు
ఆమె కోసమై ఎంత వేచినా చెంత చేరదే అలుపు
అనురాగమె ఒక మేఘమై తొలిప్రేమగా కురిసింది అని
తనలో తనే మనసే ఇలా మురిసిందిలే... ॥దేవుడిచ్చిన॥
చ: ఆమె కళ్ళలో మెరుపు అరె ఆమె నవ్వు మైమరపు
ఆమె ఊహలో ఆమె ధ్యాసలో తేలుతున్నది మనసు
ఆమె కోసమీ బతుకు మది ఆమె కోసమే వెతుకు
ఇన్ని రోజులు చిన్ని మనసెలా కలవరించెనో అడుగు
తన ప్రేమలో నిజముందని ఈ రోజుతో ఋజువైనదని
తనలో తనే మనసే ఇలా మురిసిందిలే ॥దేవుడిచ్చిన॥

**రచన: కులశేఖర్ (2) గానం : రవివర్మ, మల్లి & గ్రూప్**

ప: ఎర్రగులాబీ తల్లో పెట్టుకున్నాది జడే ఊపుతున్నాది అది నాది
తెల్లషరాయి ఎల్లో షర్టు అమ్మాయి నడుం తిప్పుతున్నాది అది నాది
తస్సదియ్యా గుంట భలేగుంది అని పొంగిపోతే తమ్ముడని అన్నదంటే ఫ్రస్ట్
ఎనక నుంచి సూపరని ముందుకెళ్ళి చూడబోతే ఏజిమరీ ఎక్కువైతే ఫ్రస్ట్
ఊసుపోక చిన్నదాన్ని కన్నుగొట్టి రమ్మనంటే తాళిబొట్టు తెచ్చెనంటె ఫ్రస్ట్
అందమైన కుర్రదాన్ని ముద్దు పెట్టమంటె తాను బుగ్గ కొరికి చేతికిస్తే ఫ్రస్ట్ ॥ఎర్ర
చ: నవ్వు రువ్వుతారు మగవాడ్ని దువ్వుతారు అది మొదలు మనవాడు ఆ వీధి వదలడు
పైట జార్చుతారు చిరు కాక రేపుతారు అమ్మమ్మో ఆడాళ్ళు అణుబాంబు కక్కలు
అయ్యో పాపం జీసీ నుంచి కుర్రాళ్ళేగా అందరి ముందు చెడ్డయ్యేది॥ఎర్ర॥
చ: పౌడరద్దుతారు తడి సెంటు దంచుతారు మతిపోయి మగవాళ్ళు తెగ రెచ్చిపోదురు
చిన్న గౌనుతోనే ఊరంత తిరుగుతారు అది చూసి కుర్రాళ్ళు కనురెప్పవేయరు
అయ్యోరామ ఆడోళ్ళంతా అంతేలేరా అందంతోటి అణిచేస్తారు ॥ఎర్ర॥

**రచన: కులశేఖర్ (3) గానం : ఆర్.పి.పట్నాయక్**

ప: ప్రేమను పంచిన ప్రేమను - ప్రేమను పెంచిన ప్రేమను
ఆశగా కోరదా ప్రతి హృదయం



లక్ష్యమంటు లేని జన్మే దండగా - లక్షలాది మందిలేరా మందగా
పంతం పట్టి పోరాడందే కోరిన వరాలు పొందలేవు కదా ॥పట్టుదలతో॥
చ: చేస్తూ వుంటే ఏ పనైనా సాధ్యమే చూస్తూ వుంటే రోజులన్నీ శూన్యమే
ఒక్క అడుగు వేసి చూస్తే చాలురా ఎక్కలేని కొండనేది లేదురా
నవ్వేవాళ్ళ నివ్వెర పోగా దిక్కులు జయించి సాగిపోరా మరి ॥పట్టుదలతో॥

**రచన: కులశేఖర్ (8) గానం : మల్లికార్జున్**

నీ స్నేహం దూరం ఆయె - నీ ప్రాణం భారం ఆయె -నీ నీడే రాదే నీవెంట
ఇన్నాళ్ళూ నీతోవుంటూ - కన్నీళ్ళే రానీకంటూ - చెప్పేటి వారెలేరింకా...
పగలనీయకు గుండెలనీ చెలిమి లేదు అని...
ఎవరి దారులు వారివనీ ముగిసెనీ మజిలీ
ఋణము తీరిన బంధం నిన్నే వదిలిపోయిందీ
మనసు ఒంటరినయ్యానంటూ కుమిలిపోతుందీ
నీ ఆశే నీరయ్యింది - నీ శ్వాసే నిప్పయ్యిందీ - నీ కంటూ ఇంకఏముందీ
ఈ దూరం భారం అంది - ఈ గాయం పోనంటుంది
నువ్వింక చేసేదేముందీ..

**రచన: కులశేఖర్ (9) గానం : ఆర్.పి. పట్నాయక్, ఉష**

అ: పిట్టనడుం పిల్ల భలేగుందిరో పట్టుమని పదారేళ్ళు లేవురో
ఆ: యిద్దరమూ ఒక్కటవాలందిరో ముద్దులతో మస్తు మజాలందిరో
అ: మనసే మహానది... కో: ఓ... ఓ... ఓ... ఓ...
ఎగసే గోదావరి... కో: ఓ.... ఓ.... ఓ.... ఓ...
ఆ: మనసే మహానది ఎగసే గోదావరి
అ: అదిరే పెదాలని సుఖాలతో శృతించనీ ॥పిట్ట॥
అ: నేను అనే నేను నాలోన మరీ లేను ఎందుకనో ఏమో ఎట్టాగ తెలుసుకోను
ఆ: నేను కూడ లేను నాలోన నిజం గాను నీవు అనే రూపే కొలువుంది ఎదంతాను
అ: ఇది కలకాదు కదా కో: ఓ... ఓ... ఓ... ఓ..
వలపాక మాయ కదా కో: ఓ... ఓ... ఓ... ఓ..
ఆ: మనసాక తోడు కదా వదలని నీడ కదా
అ: వరములు కోరగనే చేరెనుగా కానుకగా ॥పిట్ట॥
అ: ప్రేమకులం తప్ప లోకాన మరేం లేదు ప్రేమ జపం తప్ప మనకింక పనేం లేదు
ఆ: ప్రేమికులం అయితే ఆ హాయి అదే వేరు ప్రేమను మరిపించే సౌఖ్యాలు అవి లేవు
అ: వలపాక వాన కదా.... కో: ఓ... ఓ... ఓ... ఓ...
మది సెలయేరు కదా... కో: ఓ... ఓ... ఓ... ఓ...
ఆ: విరహం లేదుకదా క్షణమిక ఆగదుగా
అ: ఒకటిగ చేసినది యిద్దరినీ ప్రేమ కదా... ॥పిట్ట॥



**రచన: సురేంద్రకృష్ణ (1) గానం : హరిహరన్, నందిత**

అ: చల్లగాలికి చెప్పాలనివుందీ మన కథ ఈ వేళ
చందమామకు చెప్పాలనివుందీ సరసకు రావేలా
ఆ: వింతలు చూపీ పులకింతలు రేపీ మురిపించే కలని
తోడుగవుండీ మనసంతా నిండీ నడిపించే జతని ॥చల్ల॥
అ: నువ్వున్నది నాకోసం నేనే నీ కోసంలా
నిలిచేది మన ప్రేమలా
ఆ: నువులేని ప్రతి నిమిషం ఎదలో ఒక గాయంలా
కరిగే ఈ కన్నీటిలా
అ: మనసున ఇంద్రజాలమే ఈ ప్రేమా పరువపు పూలవానలే
ఆ: ఇరువురి వలపు వంతెనే ఈ ప్రేమా సకలం ప్రేమ సొంతమే ॥చల్ల॥
అ: ఐలవ్‌యూ... ॥8॥
కో: ఆ...ఆ..ఆ.. ని ప పద గరిమగరిస ఆ...ఆఆ..ఆ...
ఆ: నిదురంటూ మటుమాయం కుదురంటూ కరువే
ప్రతి గమకం సంగీతమే
అ: ప్రతి ఊహా ఒక కావ్యం ప్రతి ఊసు మైకం
ప్రతి చూపు పులకింతలే
ఆ: చెదరని ఇంద్రధనుసులే ఈ ప్రేమా తొలకరి వానజల్లులే
అ: కరగని పండు వెన్నెలే ఈ ప్రేమా కలిగిన వేళ హాయిలే ఆ॥చల్లగాలికి॥

**రచన: ఆర్.డి.ఎస్.ప్రకాష్ (2) గానం : కౌసల్య**

కో: తరారారార రార తరారా రారా రార
ఆ అయ్యో రామా నీతోనేందోనయ్యో చిక్కేలే
నువ్ నన్ను ముట్టుకుంటే భగ్గుమంటాలే ॥అయ్యో॥
నువ్ నా చెంతకు చేరి చింతలు తీర్చి పోతుంటే
నా కింక ఏం కావాలీ... అబ్బబ్బ నాకింకా ఏం కావాలీ...
కో: అరెరె రేహ అరెరెరేహ అరెరె రేహ అరెరెరేహ ఆ॥అయ్యో॥
చ: అదిరే అధరం నిను కావాలంటోంది అదరగొట్టేయ్యరో
తనువే శృతిలో తెగ పాడాలంటుంది పైట పట్టేయరో
జాజి మల్లేనురా జాములే ఏలరా
జాణ బాగుందిరా జోరుమీదుంది రారా ధీర ధీర సైరా ॥అయ్యో॥
చ: ఒడిలో సుడిలో ఒడుపేదో చూపాలి ఒడ్డు చేర్చాలిరా
బరిలో గిరిలో పిడుగల్లే రేగాలి మోత మోగించరా
కౌగిలించాలిరా కలలు తీర్చాలిరా
వలపు వాకిళ్ళలో ముగ్గుదిద్దాలి రార ధీర ధీర సైరా ॥అయ్యో॥





ఆ: మనసైన కుర్రవాణ్ణి ఎదురైన అందగాణ్ణి తడిపేసి తమకంగా తడిమెయ్యనా
అ: తడిసోకు చిన్నదాన వరసైన వన్నెదాన
సరసంగా పొడి కౌగిలందించనా
ఆ: మరి ముందర మొమాటం ఎదలోపల ఎంతో ఆరాటం
కళ్ళతో కోలాటం మన ఈడుకి అందం ఈ ఆనందం
అ: తుంటరి ఆటలతో మన అల్లరి వయసును చాటాలీ
చక చక పరుగులతో ఆ కట్టిన ఉట్టిని కొట్టెయ్యాలీ ॥అద్దిర॥

**రచన : సురేంద్రకృష్ణ (7) గానం : రాజేష్, నందిత**

ఆ: మనసులు కలిసి మీ వలపులన్ని విరిసీ
ఈ గెలుపు అందుతున్న హాయిలో
అ: కబురులు తెలిసి మరి బంధుజనులు కలిసి
మీ మనువు జరుపుతున్న వేళలో
ఆ: వధువే ఆదిలక్ష్మిగా
అ: వరుడే విష్ణుమూర్తిగా
ఆ: జరిగే పెళ్ళి వేడుకా
అ: కనులకు నిండుపండగా
అ: మరదలా రావేలా సరాగాల సందడిలా
ఆ: బావయ్యా యిక చేసాగా సొగసును ఊయలలా...
అ: కనుకనే వచ్చాగా ఈ కళ్యాణ వేదికకు...
ఆ: సరసనే నువ్వుంటే సిగ్గంత కొండెక్కె గడసరి కుర్రోడ ॥మరదలా॥
అ: చిలిపి కోరిక చుట్టేసింది చెప్పనా చెలియా
నడుము చుట్టూ వడ్డాణంలా వుండనా సఖియా
ఆ: పట్టు పంచెలో ముద్దొచ్చావ్ ప్రస్తుతం ప్రియుడా...
నుదుటి బొట్టు నచ్చేసింది ముద్దులా మొగుడా..
అ: ఎదలయలే గట్టి మేళం అనుబంధం సూత్రమవగా
ఆ: హరివిల్లే అడ్డుతెరగా మన ఆశే అరుంధతిగా
అ: కలకాలం నిలిచె తీపి కలలా... ॥మరదలా॥
అ: సొగసు మొత్తం ఎత్తుకుపోతా నువ్వు కాదంటే
వలసకొస్తా నీ కౌగిలికై నువ్వు ఔనంటే
ఆ: మనసు దోచినవాడే చివరకు వరుడు అవుతుంటే
వలపురాజ్యం కానుకయిస్తా సిగ్గుపడకుండా
అ: శతమానం భవతి అంటూ మన ప్రేమే దీవెనవగా
ఆ: నవమాసపు ఫలము మోస్తూ నీ ఒడిలో పాపనవనా
అ: ఈ క్షణమే నిలిచె శాశ్వతంగా... ॥మరదలా॥

నువ్వూ నీ చిరునవ్వు చేరని చోటే కావాలి
ఉందో లేదో ఈ లోకంలో నీకే తెలియాలి ॥ఎందుకే॥
చ: ఆపకిలా ఆనాటి కల అడుగడుగూ తూలిపోగా
రేపకిలా కన్నీటి అల ఏ వెలుగు చూడనీక
జన్మలో నువు లేవని ఇకనైన నన్ను నమ్మని
నిన్నలో వదిలేయనీ ఇన్నాళ్ల ఆశని
చెంతేవున్నా సొంతం కావని నిందించేకన్నా
నన్నే నేను వెలివేసుకుని దూరం అవుతున్నా ॥ఎందుకే॥

**రచన: కులశేఖర్ (6) గానం: రవివర్మ, శ్రీరాం, బాలాజి**

అ: నక్కతోక తొక్కావురో అరె లక్కు ఇలా చిక్కిందిరో
వీరసుడే నీకుందిరో నువ్వు కోరినది దక్కిందిరో
తొందరగా పెట్టిస్తాం పెళ్లికి లగ్గం ఇంకమరి లేటైతే నీతో కష్టం
అరె బాజాలే తెగ మోగాలా ఇలా చిందేసి మందేసి ఊరు వాడ ఊగాలా
కో: నక్కతోక తొక్కావురా అరె లక్కు ఇలా చిక్కిందిరో
అ: ఆడపెళ్లివారు వచ్చారా కో: వచ్చారు వచ్చారు వచ్చారు
అ: చిన్నదాన్ని వెంట తెచ్చారా కో: తెచ్చారు తెచ్చారు తెచ్చారు
అ: కుర్రవాడు మీకు నచ్చాడా కో: నచ్చాడు నచ్చాడు నచ్చాడు
అ: పువ్వులాగ చూసుకుంటాడా కో: కుంటాడు కుంటాడు కుంటాడు
అ: కుంటోడా..?! ఇలాగైతేను వెళ్లిపోతాను
వీడు ఇంద్రుడని చంద్రుడని నన్ను మోసగిస్తారా ॥నక్కతోక॥
అ: పాలగ్లాసు పట్టుకొచ్చిందా కో: వచ్చింది వచ్చింది వచ్చింది
అ: సిగ్గుతోటి చెంత చేరిందా కో: చేరింది చేరింది చేరింది
అ: పోరగాడు చేరదీసాడా కో: తీసాడు తీసాడు తీసాడు
అ: బుగ్గ గిల్లి ముద్దు పెట్టాడా కో: పెట్లేదు పెట్లేదు పెట్లేదు
అ: ఏ...! మగ లేడీతో రొమాన్స్ ఆడాలా
ఛి.. ఛీ... పైపైకి వచ్చేస్తూ కొంపముంచకిలాగా ॥నక్కతోక॥

**రచన: సిరివెన్నెల (7) గానం: మల్లికార్జున్**

ప: పట్టుదలతో చేస్తే... సమరం - తప్పకుండా నీదే - విజయం
కష్టపడితే రాదా... ఫలితం - పదరా సోదరా...
నీ ధైర్యం తోడై వుండగా - ఏ సాయం కోసం చూడక
నీ ధ్యేయం చూపే మార్గంలో పోరా సూటిగా
ఏనాడూ వెనకడుగేయక - ఏ అడుగూ తడబడనీయక
నీ గమ్యం చేరేదాకా దూసుకుపోరా సోదరా ॥పట్టుదలతో॥
చ: ఇష్టం వుంటే చేదుకూడా తీయనే - కష్టం అంటే దూది కూడా భారమే



ప్రేమను పొందటమో వరం - అది అంబరమంటిన సంబరం
ప్రేమలో తేలుదాం ప్రతి నిముషం
ప్రేమలో ఈ లోకమే సాగి ప్రేమగా
ప్రేమతో ఈ జీవితం ప్రేమించగా ॥ప్రేమను॥
చ: పసి మదిలో ఏముందో ముందుగానే తెలిసుంటుంది
అందుకనే ఆ దైవం జంటగానే నడిపిస్తుంది
మూసివున్న కళ్లలో ఎన్ని ఆశలో భాషరాని గుండెలో ఎన్ని ఊసులో
సిరివెన్నెలంటి ఈ స్నేహం - గత జన్మలోని బహుమానం
ఈ జంట చూసి పులకించిపోయి శతమానమంది లోకం ॥ప్రేమను॥
చ: ఎవ్వరితో ఎవ్వరికో ప్రేమరాత రాసుంటుందీ
ఆ మదికీ ఈ మదికీ బంధమేసి నడిపిస్తుంది
గుప్పెడంత గుండెలో ప్రేమ అన్నదీ జ్ఞాపకాల ఊపిరై తాకుతుంటది
ప్రేమించి చూడు ఒకసారి - అది మార్చుతుంది నీ దారి
ఈ ప్రేమలోన ఆకాశమంత సంతోషముందిలేరా... ॥ప్రేమను॥

**రచన: కులశేఖర్ (4) గానం: రాజేష్**

మధురం మధురం ఎపుడూ ప్రేమ - సహజం సహజం ఇలలో ప్రేమ
కలల సీమలో నిజము ఈ ప్రేమ
అనురాగం పలికించె ప్రియనేస్తం ప్రేమా... ప్రేమా
ఎపుడూ ఎదకి ఒకటే ధ్యాస - ఎపుడో అపుడు నాదను ఆశ
బదులు కోసమే ఎదురుచూస్తున్నా
మదిలోనేకొలువున్న నిను చూసి పలుకే... రాదే..
వలపు విషము ఒకటేనేమో - మనసు, మమత కలలేనేమో
చిగురుటాశలే చెదిరిపోయెనే
ఎద కోసే ఈ బాధ మిగిలింది ప్రేమా... ప్రేమా

**రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (5) గానం: ఆర్.పి.పట్నాయక్**

ప: ఎందుకే ఇలా -గుండె లోపలా - ఇంత మంట రేపుతావు అందని కలా
అన్నివైపులా - అల్లుకోకిలా - ఆగనీక సాగనీక ఎన్నాళ్లిలా
వెంటాడుతు వేధించాలా మంటై నను సాధించాలా
కన్నీటిని కురిపించాలా జ్ఞాపకమై రగిలించాలా
మరుపన్నదె రానీయవా దయలేని స్నేహమా ॥ఎందుకే॥
చ: తప్పదని నిను తప్పకుని వెతకాలి కొత్త దారి
నిప్పులతో మది నింపుకుని బతకాలీ బాటసారి
జంటగా చితిమంటగా గతమంత వెంటవుందిగా
ఒంటిగా నను ఎన్నడూ వదిలుండనందిగా



**రచన: సురేంద్రకృష్ణ (5) గానం: రమణగోగుల**

ప: ఫ్రెండ్ ఇన్ నీడ్ ఈజ్ ఎ ఫ్రెండ్ ఇన్ డీడ్ ఫ్రెండ్షిప్ డే.... ఫ్రెండ్షిప్ డే....
మరపురానిది ఈరోజే ఫ్రెండ్షిప్ డే.... ఫ్రెండ్షిప్ డే....
గొడవలన్నీ మరచి హే.. హే.. గోల చేసెయ్‌రా
చెయ్యి చెయ్యి కలిపి చిందులేసెయ్‌రా ॥ఫ్రెండ్॥
చ: క్లాసురూం లోపల మిమిక్రీలు క్యాంపస్ లోపల మోటార్ చేజ్‌లు..
బాత్‌రూం లోపల గోల్డ్ ఫ్లేక్‌లు లైబ్రరీ గదులలో సైరన్ కూతలు
క్యాంటిన్‌లోన పలకరింపులు
ప్లే గ్రౌండ్ చేరితే సిల్లీ ఫైటులు
ఎంజాయ్‌కైన ప్రాబ్లెమ్ అయిన
నిను వీడనిది ఫ్రెండొకడే ॥గొడవ॥
చ: పిజ్జాకార్నర్ సైబర్‌కేఫ్‌లు స్నూకర్ క్లబ్‌లు డిస్కోతెక్‌లు
మిక్చర్ బళ్ళు పాన్‌షాప్‌లు
రైల్వే స్టేషను ఇరానీ కేఫ్‌లు
సినిమాహాళ్ళు స్టేడియంలు
స్వర్గానికెంట్రన్స్ కాలేజీ గేట్లు
ఎంజాయ్‌కైనా ప్రాబ్లెమ్ అయిన
నిను వీడనిది ఫ్రెండొకడే.... ॥గొడవ॥ ॥ఫ్రెండ్॥

**రచన: సురేంద్రకృష్ణ (6) గానం: శంకర్‌మహదేవన్, చిత్ర**

అ: అద్దిరబన్న అడుగెయ్యరా
డమ్ డమ్ అంటూ దరువెయ్యరా...
నీకు దమ్ముంటేనే ప్రేమించరా... అడ్డెవరున్నా ఎదిరించరా
మనసులో ప్రేమ పూయించూ మమతనే నువ్వు పండించూ
నవ్వుతూ నువ్వు నవ్వించూ దైవమే నిన్ను దీవించూ ॥అద్దిర॥
కళ్లల్లో కాంతి నింపి గుండెల్లో దమ్ము నింపి
రంగేళి సరదాలు జరిపించరా
ఆ: సిగ్గంతా సాగనంపి చేతుల్లో రంగు నింపి
లోకాన్నే అందంగా మార్చెయ్యరా
అ: మన అల్లరి వేడుకలో వయసులు మరిచీ ఆడాలీ
చిరునవ్వుల వెలుగులతో ఈ చీకటి మొత్తం తరిమెయ్యాలి
ఆ: రంగుల జల్లులతో హరివిల్లుని కిందికి వంచాలీ
అ: ఇక అందరి సందడితో మన గుండె దమ్మును చూపించాలీ ॥అద్దిర॥
కో: గోవింద గోపాలుడా కృష్ణయ్య వైకుంఠ వాసుడ రాధా మనోహర
మా గురువు నీవేరా మాధవ నీ దారిలోనె వున్నామురా...



**రచన: కందికొండ (3) గానం: రమణగోగుల, నందిత**

అ: నెల్లూరు నెరజాణ అబ్బ గుండెల్లో జడివాన
ఏలూరు సొగసుల మీనా అబ్బ మోగింది జుమ్మని వీణ
ఆ: చిక్కేది కాదుర ఇది చక్కాని చుక్కరో
ఇక చూశానొరేగుర చిత్రంగు గోలర హోయ్‌హోయ్‌హోయ్
అ: బెజవాడ బసవయ్యో ఇది పరువాల పిట్టయ్యో
గుడివాడ పుల్లయ్యో దీన్ని పట్టేది ఎట్టగయ్య
అ: నాతో రాజమండ్రిలో కళ్ళు కలిపి సొరచేపల జారిపోయె
మొన్న పాలకొల్లులో నన్ను సూశి చిన్న నవ్వు జల్లి పోయె
ఆ: చాలు చాలిక ఆపెయ్ జోరు అంత సీను లేదోయ్
మాది ఎక్కడ తెలుసా ఊరు వెస్టు గుంటూరోయ్
అ: పిల్ల మాయే సేయమాకు మత్తే జల్లమాకు
మాటేసి కాటేసి చేశావె తికామకా ॥నెల్లూరు॥
కో: నాయుడోరింటికాడ నల్లతుమ్మ చెట్టుకింద నాయుడేమి అన్నాడే పిల్లా
అబ్బ... నా గుండె జల్లుజల్లుమాన్నదె బుల్లే
అ: మొన్న కర్నూలు సంతకు వెళితే కనుసైగతో సాటుకు పిలిసే
తన సిని సిని పెదవుల తోటి యమ గాటుగ ముద్దర వేసే
ఆ: వద్దు బాబు తుంటరి కలలు అల్లమాకుర కథలు
చెప్పకయ్యో పోకిరి మాటలు మాదిరోయ్ గూడురు
అ: నువు అట్టాగనంటె ఎట్టా కన్నే కోడిపెట్ట
ఇంతేసి వయసొచ్చి ఇట్టాగయితే ఎట్టా ఎట్టా
ఆ: అట్టయితే బావయ్యో నీ నీడల్లే వస్తనయ్యో
గుండెల్లో గూడేసి నీ వెంటనేవుంటనయ్యో
అ: సిక్కేది కాదుర ఇది సక్కాని సుక్కరో
ఇక సుశానొరేగుర చిత్రంగు గోలర హోయ్‌హోయ్‌హోయ్

**రచన: వేటూరి (4) గానం: రాజేష్**

మరుమరు మల్లెల మధువున ఋతువున ఆమని పాడిన పల్లవి సరిగమ
రాయిగ మారిన గౌతమి జన్మకు రాముని చరణము సోకిన చలనమా
పదములు పలికిన పసి కళ్యాణిని పెదవులు పిలిచిన స్వరముల గమకము
సంధ్యారాగపు సంగీతానికి వర్ణాలెన్నో చిలికిన సమయము
గొంతులు విప్పని కొమ్మలకిప్పుడు కోయని పిలిచిన కోయిల శరణము
ఉలకని పలకని పెదవుల తొలకరి వలపుల మురళిని నిలిపిన నిముషం ఎదలో
మెదిలిన తుమ్మెద మరిమరి తేనెలు కొసరిన తియ్యని తరుణము
తొలి తొలి చూపుల తోరణముల చెలి చెలిమికి నేడు శుభోదయమేగా
గళమున పలికిన హృదయపు వీణలు కరుణతో చిలికిన
స్వాగతమే.... స్వాగతమే... స్వాగతమే...

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| లిరిక్స్ | : | కులశేఖర్, సిరివెన్నెల సీతారామశాస్త్రి |
| డ్యాన్స్ | : | 'అమ్మ' రాజశేఖర్, శంకర్ |
| కెమెరా | : | ఎం.ప్రసాద్ |
| ఎడిటింగ్ | : | కృష్ణారెడ్డి |
| ఆర్ట్ | : | నారాయణరెడ్డి |
| స్టిల్స్ | : | రాజా |
| మేకప్ | : | ఉదయభాస్కర్ |
| కాస్ట్యూమ్స్ | : | కృష్ణ |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : | నవీన్, హరికృష్ణ, శ్రీనివాస్ |
| కో-డైరెక్టర్ | : | సాయికిశోర్ |
| పి.ఆర్.ఓ. | : | పులగం చిన్నారాయణ |
| పబ్లిసిటీ | : | కృష్ణ డిజిటల్స్ |
| కో-ప్రొడ్యూసర్ | : | తమ్ముడు సత్యం |
| కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం | : | దశరథ్ |

## తారాగణం

నితిన్, నిఖిత, ఎస్వీ కృష్ణారెడ్డి,
పరుచూరి వెంకటేశ్వరరావు, బెనర్జీ,
గిరిబాబు, రాళ్ళపల్లి, సీత, ఇందూ
ఆనంద్, పాయల్,
ఎం.ఎస్.నారాయణ, సుమన్‌శెట్టి,
ప్రత్యేక పాత్రలో సాయి కుమార్

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

చిత్రం మూవీస్

కథ-స్క్రీన్‌ప్లే-మాటలు-దర్శకత్వం : దశరథ్

# సంబరం

దశరథ్

తమ్ముడు సత్యం ఆర్.పి.పట్నాయక్

ప్రసాద్ కె.వి.కృష్ణారెడ్డి సీతారామశాస్త్రి కులశేఖర్ నారాయణరెడ్డి రాజశేఖర్ శంకర్


తేజ


దశరథ్


ఆర్.పి.పట్నాయక్


సీతారామశాస్త్రి


కులశేఖర్



## తారాగణం

జగపతిబాబు, చైతన్యకృష్ణ, అనీల్, రవితేజ్, విక్రమ్, నేహా, సోనీ అగర్వాల్, ఉమ, స్వప్నమాధురి, సోనీరాజ్, చలపతిరావు, అవినాష్, సత్యప్రకాష్, ఆలీ, మల్లిఖార్జునరావు, జయప్రకాష్‌రెడ్డి, వేణుమాధవ్, సుమన్‌శెట్టి, జూ॥రేలంగి, సుదర్శన్, శ్రీచరణ్, కవిత, సుమలత, జ్యోతి, నర్సింగ్ యాదవ్,

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| మాటలు | : | జి.నాగరాజు, సంపత్ |
| పాటలు | : | వేటూరి, సురేంద్రకృష్ణ, కందికొండ, ఆర్.డి.ఎస్.ప్రకాష్ |
| సంగీతం | : | రమణగోగుల |
| ఫోటోగ్రఫీ | : | అరుణ్ |
| ఎడిటింగ్ | : | మార్తాండ్ కె.వెంకటేష్ |
| ఆర్ట్ | : | మురళి |
| డాన్స్ | : | లారెన్స్, హరీష్‌పాయ్, నిక్సన్ |
| ఫైట్స్ | : | హార్స్‌మెన్‌బాబు |
| స్టిల్స్ | : | వేణు |
| మేకప్ | : | కిషోర్ |
| పి.ఆర్.ఓ. | : | ఆర్.డి.ఎస్.ప్రకాష్ |
| పబ్లిసిటీ | : | 'సాయికృప' ప్రకాష్ |
| కాస్ట్యూమ్స్ | : | మోహన్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : | బాలాజీ శ్రీను |
| మేనేజర్స్ | : | నాగేశ్వరరావు, శ్రీనివాసరాజు |
| అసోసియేట్స్ | : | కె.ఎన్.విజయ్‌కుమార్, కిరణ్ |
| అసిస్టెంట్స్ | : | ధర్మరక్ష, శశికాంత్, హరికృష్ణ |
| కో-డైరెక్టర్స్ | : | శ్రీనివాసరావు, మధు |
| నిర్మాతలు | : | మోహనరాధ, కిశోర్‌బాబు |
| సమర్పణ | : | రాధిక |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : | రాజు వూపాటి |

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# ధమ్
దమ్ముంటే ప్రేమించు


రాధిక


కిశోర్‌బాబు


మోహనరాధ


రాజు వూపాటి


రమణగోగుల


వేటూరి


సురేంద్రకృష్ణ


కందికొండ


ఆర్.డి.ఎస్.ప్రకాష్

# స్వర భాస్వరం...

# శ్వేతా శెట్టి



'దీవానే దీవానేతో దీవానే హై' పాట అప్పట్లో పెద్ద హిట్. చామన ఛాయగా ఉన్న కాస్త పొడువాటి అమ్మాయి, మెలికలు తిరిగిన జుట్టును ముఖంపై వేసుకుని, చారడేసి కళ్ళతో స్టేట్‌మెంట్ ఇచ్చినట్టుగానే 'దీవానే... దీవానేతో దీవానే హై' అని పాడుతుంటే కుర్రకారు కళ్ళన్నీ టీవీకి అప్పగించేసేవారు. గొప్ప అందగత్తేమి కాదు... ఇవాళ చాలా వీడియో అల్బమ్స్‌లో చూపుతున్నట్టుగా వలువలు విడవటమూ ఆ పాటలో లేదు. అయినా ఆ గొంతులో భాస్వరం భగ్గున మండుతున్నట్టు ఉండేది. అదే ఆమెకు ప్రత్యేతను తెచ్చిపెట్టింది. ఆ గాయనిపేరు 'శ్వేతా శెట్టి'.

శెట్టి వంశస్థులంటే సహజంగా వ్యాపారవర్గాలే అయిఉంటాయి. చాలామంది ఇందులో రెస్టారెంట్ బిజినెస్‌లో వున్నారు. వారిలాగానే శ్వేతా శెట్టి తండ్రిదీ అదే వ్యాపారం. అయితే తండ్రి వెంట పాకశాలకు నడవకుండా ఆ అమ్మాయి అమ్మవెంట 'పాట'శాలకు నడిచింది. శ్వేత తల్లి క్లాసికల్ సింగర్. ఆమె పెద్దగా ప్రదర్శన లివ్వకపోయినా కూతురుకు మాత్రం సంగీతానికి సంబంధించిన ప్రాథమిక శిక్షణ ఇచ్చింది. పెద్దమ్మాయిలు ముగ్గురికీ పెళ్ళిళ్ళు అయిపోవటంతో శ్వేతనూ జీవితంలో స్థిరపడమని తల్లిదండ్రులు పోరడం మొదలుపెట్టారు. కానీ ఆమె మనసంతా 'ఎంటర్‌టైన్‌మెంట్ బిజినెస్' మీదనే ఉంది. ఇంట్లో ఎన్ని వ్యతిరేకతలు వచ్చినా తలవంచలేదు. పాటలు, సంగీతాన్ని కెరీర్‌గా మలుచుకుంటానని చెప్పినా కుటుంబసభ్యులు అంగీకరించలేదు. వాళ్ళ అభిష్టానికి వ్యతిరేకంగానే శ్వేత నాటకాలు, టీవీ సీరియల్స్, సినిమాల్లో అవకాశాలకోసం ప్రయత్నించింది. ఈమె మనసు గ్రహించిన తల్లి పచ్చజెండా ఊపితే, తండ్రి మాత్రం కోపంతో ఆ తర్వాత ఆరేళ్ళు మాట్లాడనే లేదు.

## నటినుండి గాయనిగా...

నాటకం, సినిమాలు, సంగీతం... ఏదో ఒక దానిలో పేరు తెచ్చుకోవాలన్నదే శ్వేత తొలినాళ్ళ కోరిక. తల్లి దగ్గర సంగీతం నేర్చుకున్నా అది మనస్ఫూర్తిగా నేర్చుకున్నది కాదు. ఎప్పుడైతే గాయనిగా కెరీర్‌ని ప్రారంభించాలని అనుకుందో అప్పుడు మరోసారి కర్ణాటక సంగీతంలో శిక్షణ తీసుకోవడం మొదలెట్టింది. ఇదే సమయంలో నటనమీద దృష్టిపెట్టింది. ఆమెలోని ప్రతిభను షైమక్‌దావర్ గుర్తించాడు. ఆ తర్వాత "బెస్ట్ ఆఫ్ బ్రాడ్ వే', 'గాడ్‌స్పెల్', 'రూమర్స్', 'కమ్ బ్లో యువర్ హారన్' నాటకాల్లో శ్వేత నటించింది. అయితే నేపథ్య సంగీతం వైపే ఆమె మనసులాగింది. జింగిల్స్ పాడటంతో సింగర్‌గా కెరీర్‌ను ప్రారంభించిన శ్వేత అంచలంచెలుగా గుర్తింపు తెచ్చుకుంటూ సినిమాలకు పాటలు పాడే స్థాయికి చేరుకుంది. రాంగోపాల్‌వర్మ 'రంగీలా'లో 'మాంగ్తా హై క్యా...' పాట పెద్ద హిట్. అలానే మణిరత్నం 'రోజా'లో శ్వేత పాడిన 'రుకిమిణీ.. రుకిమిణీ' పాట సినీ సంగీత అభిమానుల్ని విపరీతంగా ఆకట్టుకుంది. ఆ తర్వాత 'సల్లాఖీ', 'బంధన్' తదితర చిత్రాలలో శ్వేత పాటలు పాడింది. వరుసగా వస్తున్న అవకాశాలను అందిపుచ్చుకుంటూనే 1998లో శ్వేత 'జానీ జాకర్' అనే పాప్ ఆల్బమ్‌ను విడుదల చేసింది. అప్పట్లో అది మ్యూజిక్ ఛార్ట్స్‌లో అగ్రస్థానంలో ఉండేది. ఆ వెనుకే వచ్చిన ఆల్బమ్ 'దీవానే దీవానేతో దీవానే హై'.




ఎంటీవిలో దర్శనమిచ్చిన తొలి ఇండీ పాప్‌సింగర్ శ్వేతా శెట్టినే. ఆమె తొలి ఆల్బమ్ 'జానీ జాకర్'ని ఎంటీవిలో ప్రదర్శించడమే కాకుండా శ్వేత అభిరుచులను, ఆశయాలను, ఆకాంక్షలను ఆ ఛానల్ ప్రసారం చేయడంతో రాత్రికి రాత్రి ఈ పాప్‌సింగర్ ఓ స్టార్ అయిపోయింది. ఆ తర్వాత ఆమె అవకాశాలకోసం ఎదురు చూడాల్సిన అవసరమే రాలేదు.

## పెళ్ళితో కొద్దిపాటి విరామం

కెరీర్‌గ్రాఫ్ పైకిపోతున్న సమయంలోనే శ్వేతా శెట్టి తన ప్రియుడు జర్మన్‌వాసి క్లెమెన్స్ బ్రాండ్‌ను పెళ్ళి చేసుకుని, దేశం వదిలి జర్మనీ వెళ్ళిపోయింది. హంబర్గ్‌కి నివాసం మార్చడంతో సహజంగానే భారతీయ సినీ సంగీతానికి, ఆమె దూరమైంది. అయితే పెళ్ళి ఆమె ప్రతిభను మసకబారనివ్వలేదు. భర్త ప్రోత్సాహంతో తిరిగి గాయనిగా లైమ్‌లైట్‌లోకి రావడానికి ప్రయత్నాలు పరదేశంలో డంప్ చేసింది. జర్మనీలోనే ఇండీ-పాప్ ఆల్బమ్ 'జానే జా'ను విడుదల చేసింది. ఆ తర్వాత వచ్చిన ఆల్బమ్ 'మై హసీనా హూ'. దీని తర్వాత ఇటీవల విడుదల చేసింది 'సాజ్‌నా'. స్వదేశానికి దూరంగా ఉన్నా- సినిమాలో నేపథ్య గానం చేసే అవకాశాలు వస్తే మాత్రం శ్వేత వదులుకోవడం లేదు. ఆ మధ్య 'అర్జీ', 'లవ్ మీ హమేషా' చిత్రాలలో పాటలు పాడింది. ఇప్పటికీ నేపథ్య గాయనిగా కొనసాగాలన్నదే తన అభిమతమని- దూరం ఎంత మాత్రం భారం కాదని- ఓ ఫోన్ కాల్‌తో తాను రికార్డింగ్ థియేటర్‌కి చేరుకుంటానని చెబుతోంది.

కొత్త ఆల్బమ్ గురించి చెబుతూ "విదేశాలలో వుండటం వల్ల భారతీయ సంగీతానికి కొంత దూరమయ్యాను. అయితే ఇక్కడి శ్రోతలు దేనిని ఆదరిస్తారో నాకు తెలుసు. ఓ మ్యూజిక్ ఫ్యాక్టరీలో పనిచేసినట్టుగా భావించే సంగీత దర్శకులకు నేను ఎప్పుడూ దూరంగా ఉంటాను. అందువల్లే 'సాజ్‌నా' లో మంచి స్వరాల్ని, సాహిత్యాన్ని అందించగలిగాం. చాలాకాలం క్రితం నాకు డి.జె.మోడితో పరిచయం అయ్యింది. ఆ పరిచయంతోనే ఈ కొత్త ఆల్బమ్‌కి కలిసి పనిచేయగలిగాం. ఆయన స్వరాల్ని నాకు ఫోన్‌లో వినిపించేవారు. ఎంతో టాలెంట్‌వున్న కంపోజర్. ఈ పాటల్ని యశ్‌పాల్‌తన్వర్, శశికాంత్ మిశ్రా, షబ్బీర్ అహ్మద్ రాశారు. ఒక పంథాలో అని కాకుండా అన్ని వర్గాల శ్రోతల్ని ఆకట్టుకునేలా ఈ ఆల్బమ్ రూపొందింది" అని శ్వేత చెబుతోంది.



తన దిన చర్య గురించి చెబుతూ "ఉదయాన్నే నిద్రలేవటం అలవాటు నాకు. ఆరు గంటలకు నిద్రలేచింది మొదలు వంటపని, ఇల్లు శుభ్రం చేయటం, బట్టలు ఉతకడం, పాత్రలు కడగటం అన్నీ నేనే స్వయంగా చేస్తాను. ఏ మాత్రం కాస్త సమయం దొరికినా యోగ చేస్తాను. అలానే ఆ సమయంలో స్నేహితులకి ఉత్తరాలు రాయడం, పుస్తకాలు చదవటం, సంగీతం ప్రాక్టీస్ చేస్తాను. మా ఆయన జపనీస్ అడ్వర్టయిజ్‌మెంట్ కంపెనీలో క్రియేటివ్ డైరెక్టర్‌గా చేస్తున్నారు. ఆఫీస్‌నుండి ఆయన ఇంటికి రాగానే ఆయనతోనే కాలం తెలియకుండా గడిచిపోతుంది." అని అంటుంది.

పరాయిదేశంలో నివాసముంటున్నా- భారతీయ సంగీతం పట్ల మమకారం చంపుకోలేకపోతున్న శ్వేతాశెట్టి భవిష్యత్తులో మరిన్ని ఇండీ-పాప్ ఆల్బమ్స్‌తో శ్రోతల్ని తప్పక అలరిస్తుంది.

**- వి.అరుణ సత్యవతి**

---

# ఘంటసాల క్విజ్

మొదటి బహుమతి : రూ. 250/-
రెండవ బహుమతి : రూ. 200/-
మూడవ బహుమతి : రూ. 150/-
} మరియు ఘంటసాల కలర్ ఫోటో

**క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ**

డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-7

1. ఎ.వి.ఎం. సంస్థకు ఘంటసాల పాడిన తొలిచిత్రం?
జ: ..........................

2. ఘంటసాల గానంలో వెలువడిన వోలేటి వేంకటరెడ్డి తొలి గీతం?
జ: ..........................

3. కె.వి.మహదేవన్ సంగీత దర్శకత్వంలో ఘంటసాల పాడిన తొలిచిత్రం?
జ: ..........................

4. ఎన్.టి.ఆర్ నాయకునిగా నటించిన ఓ చిత్రానికి ఘంటసాల సంగీతం అయినప్పటికీ ఆ చిత్రంలో ఎన్.టి.ఆర్‌కు ఘంటసాల పాడలేదు. ఆ చిత్రం పేరు?
జ: ..........................

5. ఘంటసాల, లీల కలిసి పాడిన తొలి యుగళ గీతం గల చిత్రం?
జ: ..........................

పంపినవారి పేరు : ____________________

చిరునామా : ____________________

____________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 15-8-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

---





ఆగస్టు 9 రేలంగి జయంతి సందర్భంగా...

# కొమ్మ కొమ్మకో సన్నాయి...

# తెలుగు సినిమా దరహాసం
# తెలుగు ప్రేక్షకుడి వరహాసం
# రేలంగి



హాస్యం అతిహాస్యంగా, అపహాస్యంగా ఎదిగిపోతున్న ఈ తరుణంలో క్లాసిక్స్ లాంటి మన పూర్వ చిత్రాలలో హాస్య రసాన్ని కల్తీ చేయకుండా తన పాత్రలను పాత్రతను నిలబెట్టుకున్న కళాకారుడు రేలంగి. హాస్యనటుడి గౌరవార్థం నవ్వక తప్పని ఈ రోజుల్లో రేలంగి వంటి మహానటులను స్మరించుకోవడం కాస్త ఊరట కలిగిస్తుంది. ఆ నవ్వుల నటరాజు జన్మదినం నాడు విధిగా ఆయన్ను నాలుగు మాటలని నవ్వుల రుణం తీర్చుకుందామని ఘటిస్తున్న స్మృత్యంజలి ఇది.

చిన్నతనంలో తాడేపల్లిగూడెంలో చిల్లరవేషాలు అవీ వేస్తూ నేర్చుకున్న పద్యాలు, వాటి రాగాలూ ఆ తరువాత కాకినాడలో మహాగురువు శ్రీ గండికోట జోగినాథం గారి శిష్యరికంలో నటనతోపాటు సాధించుకున్న సంగీతజ్ఞానం, యంగ్‌మెన్స్ హాపీక్లబ్‌లో వేసిన నాటకాల ద్వారా వంట బట్టిన హాస్య నటన శ్రీ రేలంగి వెంకట్రామయ్య గారిని 'హాసం' గా తీర్చి దిద్దాయి. రెండున్నర దశాబ్దాల పాటు తెలుగు సినిమాకు దరహాసం, ప్రేక్షకుడికి వరహాసంగా భాసిల్లిన హాస్యనట చక్రవర్తి రేలంగి. పౌరాణిక, జానపద, సాంఘిక పాత్రలకు అచ్చు గుద్దినట్లు సరిపోయిన మహానటుడు, గాయకుడు కూడా.

పామరుల నుంచి పండితుల వరకు 'రేలంగోడు' లేని సినిమా రుచించని శకం ఇప్పటికీ కొనసాగుతున్నదంటే అతిశయోక్తి కాదు. నటుల్లో రేలంగి, రచయితల్లో పింగళి, ముళ్ళపూడి, జంధ్యాల సమగ్ర సంపూర్ణ హాస్యరసం కురిపించి దాని స్వరూపాన్ని ప్రేక్షకులకు చూపిన వారంటే అత్యుక్తి కాదు. రేలంగి, రమణారెడ్డి ద్వయం ఆనాటి హాస్యరస దేవతకు రెండు కళ్లు. ఆ తరువాత వచ్చిన హాస్య నటుల్లో చాలామందిని ప్రభావితం చేసింది రేలంగి ఫక్కీ. హాస్యంతో పాటు కరుణ, రౌద్ర రసాలను కూడా సమర్థంగా పలికించిన ప్రతిభశాలి.



నేను ఆంధ్ర సచిత్ర వార పత్రికకు సినిమా ఎడిటర్‌గా వున్న రోజుల్లో(1959-63) తరచుగా ఆయన్ని కలిసే అవకాశం కలిగేది. ఆయనలేని సినిమా ఉండకపోవడమే దానికి కారణం.

నిర్ణీత సమయానికి వచ్చి రంగు పూసుకుని సెట్ బైట ఎన్ని గంటలైనా వేచి వుండిన ఆనాటి నటులు సి.ఎస్.ఆర్, రేలంగి, ముక్కామల వంటి వారిలోని క్రమశిక్షణ, సహనరూపంలో వారు చూపిన సంస్కారం, తమ వృత్తి పట్ల వారికి గల అంకిత భావం ప్రత్యక్షంగా చూసే అవకాశం పత్రికా విలేఖరిగా నాకు కలిగింది.

ఆయన కోపం, దుఃఖం, రౌద్రం, అన్నీ హాస్యమే కురిపించేవి! నవరసాల్లో హాస్యేతరమైన ఏ రసం ప్రదర్శించినా నవ్వు తెప్పించిన నటుడు రేలంగి. మద్రాసులో మహానాటక ప్రయోక్త తన గురువు శ్రీ గండికోట జోగినాథం గారి నాటక సప్తాహం జరిగినప్పుడు ఎంతో బిజీగా వుండి కూడా ప్రతి ప్రదర్శనకు హాజరై చివరి రోజున ఆయన కాళ్లకు నమస్కరించి, కౌగిలించుకుని బావురుమన్న రేలంగి ఆర్ద్ర హృదయం ప్రత్యక్షంగా చూసి పులకించిన వారిలో నేనొకడను. ఆనాడు ప్రసంగించలేని గాద్గదికంతో ఆయన ఎంతో ఆవేశానికి గురి అయినాడు.

గతాన్ని విస్మరించని వాడు నిత్య యవ్వనుడు. అటువంటి కొద్దిమంది కళాకారులలో రేలంగి ఒకరు. మకుటంలేని మహారాజుగా కపటంలేని కళాకారుడుగా ఆయన జీవితం కొనసాగింది. అటు తరువాత వచ్చిన హాస్యనటులు ఎందరికో ఆయన ముద్ర పడింది. ఘంటసాల లాగా పాడాలని, రేలంగిలాగా కామెడీ చెయ్యాలని అనుకోని ఔత్సాహికులు అరుదుగా వుండేవారు.

రేలంగి నట జీవిత విజయానికి మహా రచయితల సంభాషణలు దర్శకుల విన్నాణాలు ఆహార్యంతో అమరిన ఆయన స్వరూప దర్శనాలతో పాటు నటనాకౌశలం, 'టైమింగ్' ప్రధాన కారణాలు. ముఖ్యంగా టైమింగ్ విషయంలో మహానటుడు ఎస్వీ రంగారావు, రేలంగి ఇద్దరినీ ఎక్కువగా చెప్పుకునేవారు.

గుణసుందరి కథ, ప్రియురాలు, దొంగరాముడు, సువర్ణసుందరి, రహస్యం, పాతాళభైరవి, మిస్సమ్మ, అప్పుచేసి పప్పుకూడు, మాయాబజార్, అగ్గిరాముడు, పక్కింటమ్మాయి, వెలుగునీడలు, తోడికోడళ్లు, కులగోత్రాలు, చెంచులక్ష్మి, వాగ్దానం, విప్రనారాయణ, రోజులుమారాయి, చింతామణి, చెరపుకురా చేడేవు, పెళ్లికానుక, ప్రేమించిచూడు, భాగ్యరేఖ, భలేరాముడు-ఇలా ఎన్ని చిత్రాలని!

పాతాళభైరవిలో 'వినవే బాలా నా ప్రేమగోల', 'ఓయమ్మలారా నే తాళలేనే', మిస్సమ్మలో 'సీతారామ్ సీతారామ్, 'దర్మం సెయ్‌బాబు', విప్రనారాయణలో 'ఆడది అంటే లయం లయం- ఆ నీడంటేనే భయం భయం' సారధి వారి ఎత్తుకు పై ఎత్తు చిత్రంలో కాబోలు 'ఎవడనుకున్నావ్ ఎవడనుకున్నావు ఇట్టావుండే బిచ్చాలన్నా ఇంతట్లోనే ఇంతవుతాడని' వగైరా ఎన్ని పాటలలో తన పాత్రకు తనే పాడుకున్న నట గాయకుడు ఆయన.

పెండ్లిపిలుపు చిత్రంలో సి.ఎస్.ఆర్ కు జూనియర్ లాయర్‌గా రేలంగి చేసిన అభినయం శ్రీ పూసపాటి కృష్ణంరాజు (సుప్రసిద్ధ కధా రచయిత - రెండు బంట్లు పోయాయి) రాసిన తూర్పు యాస డైలాగులు మరుపురానివి.

గుణసుందరిలో రాజుగారి మేనల్లుడు, పాతాళభైరవిలో రాణిగారి తమ్ముడు, చింతామణిలో సుబ్బిశెట్టి, నర్తనశాలలో ఉత్త(ర)కుమారుడు, మాయాబజార్‌లో లక్ష్మణకుమారుడు, పెద్దమనుషులలో తిక్కశంకరయ్య, దొంగరాముడులో 'భకు వత్తులేని వట్టి బద్రయ్య అనే వీర భద్రయ్య, అగ్గి రాముడులో ఫోర్‌ఫార్టీ వన్ వంటి ఎన్నో విశిష్ట పాత్రలను ఎంత ప్రతిభావంతంగా రేలంగి పోషించాడో పాత్రోచితంగా సంభాషణలు నొక్కి వక్కాణించాడో తలుచుకుంటే అది ఒక మహా చరిత్రగా సువర్ణాధ్యాయంగా స్మృతి పథంలో నిలిచిపోతుంది.

తమిళంలో టి.ఎస్. బాలయ్య, తంగవేలు వేసిన ఎన్నో పాత్రలకు తెలుగులో రేలంగి తప్పమరొక నటుడు సరితూగే వాడు కాదు. కాదలిక్క నేరమిల్లై, కళ్యాణవరిసు చిత్రాలు తెలుగులో ప్రేమించిచూడు, పెళ్లికానుకగా తీసినప్పుడు రేలంగినే ఆ పాత్రలకు ఎన్నుకొనక తప్పలేదు.

తెలుగు తనాన్ని సంప్రదాయాన్ని తోబుట్టువులుగా చేసుకుని ఎదిగిన తెలుగువాడు రేలంగి. అందుకే ఆయన నటించిన పాత్రలు ప్రేక్షకులకు అంత చేరువ కాగలిగాయి. సహజప్రవర్తనా ధోరణి (Behaviour Pattern) సాంఘికాలలోను, కల్పనా ధోరణి జానపదాలలోను, పురాణేతిహాస పరిచయంతో పరకాయ ప్రవేశం చేసి నారదుడు, నక్షత్రకుడు, ఉత్తర కుమారుడు, లక్ష్మణ కుమారుడు వంటి పౌరాణిక పాత్రలు పునః సృష్టి చేయగల నటనాపాటవం పౌరాణికాలలోను అద్వితీయంగా చూపించగలిగిన అరుదైన నటుడు రేలంగి. శ్రోత్రియమైనా క్షత్రియమైనా, దళితమైనా ఏ పాత్ర ఎటువంటిదైనా రేలంగివంటి నటశిరోమణికి అవధులు లేవు. రానురాను శరీరము అనుకూలించని అనారోగ్య పరిస్థితి వచ్చినా, ఆ పరిస్థితినే కొత్త తరహా అభినయంగా మార్చుకున్న ధీశాలి అతను. 'నర్తనశాల'లో ఉత్తరుడుగా కౌరవసేనను చూసి వణికిపోతూ అతను అభినయించిన మహాకవి తిక్కన పద్యం. 'కౌరవసేనజూచి వడకన్ దొడగెన్ మదితోన మేను' కళ్లముందు ఉత్తర కుమారుణ్ణి తెచ్చి నిలబెట్టింది. మదితో మేను వణకటమనేది ఏమిటో, ఎలావుంటుందో, తిక్కన కవితా హృదయం ఎటువంటిదో రేలంగి చూపించగలిగాడు.

'చెంచులక్ష్మి'లో నారదుడుగా అతని నటన ఆ పాత్రకు చక్కగా సరిపోయిందనే పేరు తెచ్చుకుంది. 'నీలగగన ఘనశ్యామా' అనే హరినామ

కీర్తన చేస్తూ చిత్రంలో రేలంగి భక్తిభావాన్ని ఉద్దీప్తం చేస్తూ ప్రతిభావంతంగా నటించాడు. డైలాగు చెప్పేటప్పుడు అతను అనేక కొత్తపుంతలు తొక్కాడు. తన స్టైల్ అనేది మూడు నాలుగు రకాలుగా వింగడించి ప్రేక్షకలోకం మీద విసిరి 'భళా' అనిపించుకున్నారు. తనదంటూ ఒక ఉచ్చారణ అతనికి వుండేది. 'ఆషాఢప్పట్టీయా శ్రావణప్పట్టీయా'.. 'తమరే తమచోటికే తక్షణమే తట్టా బుట్టాతో తరలిపోవాలి' మొదలైన ఆయన డైలాగులు సినిమాహాల్లో ఈలలు వేయించేవి. 'చింతామణి'లో 'చచ్చిబ్రతికినవాడును సానికొంప జొచ్చి మిగిలినవాడు లేడు లేడు దైవంబుతోడు' అంటూ ఉత్తరీయం కన్నీటితో తడిపి పిండుతూ పద్యం పాడే దృశ్యం తెలుగు ప్రేక్షకుడు మరచిపోలేడు. ఆయన స్టెప్పు వేస్తూ పాడిన పాటలు 'వినవేబాలా', 'సుందరి నీవంటి దివ్య స్వరూపము', 'నవనీతమ్మా రమణయ్య మామా' కోసం మళ్లీ మళ్లీ సినిమాలు చూసిన వారెందరో!

రేలంగికి తను నటించిన చిత్రం పేరు చెబితే తెలిసేది కాదు. 'పెండ్లిపిలుపు'లో మీ లాయర్ వేషం చాలా బాగుంది' అంటే 'పెండ్లిపిలుపా' నేనెప్పుడు వేశానుబాబూ అందులో అన్నాడొకసారి. 'అదేనండీ సి.యస్.ఆర్ గారూ మీరూ...' అని చెప్పబోతే 'సినిమా పేర్లు గుర్తుండవు బాబూ... నిర్మాత పేరు చెప్పండి చాలు' అన్నాడు. 'డి.బి. నారాయణగారి పిక్చరండీ' అంటే 'అట్టా చెప్పండి బాబూ' అని 'మంచి కామెడీ బాబూ చాల్ గొప్ప కామెడీ' అన్నాడు.

'మాయాబజార్' లో లక్ష్మణకుమారుడుగా ఆ రాజదర్పం, ఆత్మాభిమానం, తండ్రినుంచి సంక్రమించిన లక్షణాలన్నిటికీ అద్దంపట్టే రీతిలో రేలంగి హావభావ ప్రదర్శన అద్భుతం. అలాగే శశిరేఖకు తాళికట్టే సన్నివేశంలో పెద్దపులి, భూతం కనిపించగానే అంతచేరువలో అవి ప్రత్యక్ష్యమైతే ఎంత గాభరావడి గావుకేకలు పెడాతావెూ అక్షరాలా అలా ప్రవర్తించిన మహానటుడు. ఒక పక్క చెక్కలవుతున్న కడుపును చేత్తో పట్టుకుని అతనికి జోహారు చెయ్యని ప్రేక్షకుడు ఆనాడు ఈనాడూ కూడా లేడంటే అతిశయోక్తికాదు.



తన తోటి హాస్యనటులు రమణారెడ్డి, అల్లురామలింగయ్య, చదలవాడ, రామకోటి, నల్ల రామ్మూర్తి, సీతారాం, లంక సత్యం, బొడపాటి వంటి వారికి ఆయన పెద్ద దిక్కుగా వుండేవాడు. తమిళ రంగంలో ఎస్.ఎస్.కృష్ణన్, టి.ఎ.మధురం హాస్యనటులుగా చరిత్రలో నిలిచిపోయేజంట. అలాగే రేలంగి, గిరిజ వెరసి రేలంగిగిరిజ అలా నిలిచిపోతారు. మరో మరపురాని తెరదాంపత్యం సూర్యకాంతంతో! బ్రతుకుతెరువు, భార్యాభర్తలు, దొంగరాముడు, తోడికోడళ్లు వగైరా చిత్రాలలో వారి జంట అభినయం చూసి ఆనందించనివారులేరు.

'ఇరుగువారిని పొరుగువారిని చుట్టాలని పక్కాలని స్నేహితులనీ, వివిధ వృత్తుల్లో వున్నవారిని చిన్నతనం నుంచీ పరిశీలించి చూసేవాణ్ణి. మిమిక్రీ ఆర్టిస్టులు ఇదేగా చేసేది. అదే నేనూ చేసేవాణ్ణి. స్కూల్లో మాస్టర్లనీ వారి మాటనీ, నడకనీ ఇమిటేట్ చేసిన స్టాండప్ ఆన్ ది బెంచ్‌గాణ్ణి. కొందరి కంఠస్వరం వారువారు చేసే వృత్తులు, వాటి దైనందిన అవసరాలని బట్టివుంటుంది. అలాగే పాటలాగా మాటకూ శ్రుతి వుంటుంది. ఇవన్నీ గమనించి సొంతం చేసుకునేవాణ్ణి. అది హాబీగా మొదలై జీవనంగా మారిపోయింది. అదే నాకు కాస్త తిండీ, మరికాస్త పేరుకూడా తెచ్చిపెట్టింది, అని రేలంగి 1953లో పచ్చియప్పాస్ కాలేజీ ఆవరణలో జరిగిన చెన్నపురి ఆంధ్ర విద్యార్థి విజ్ఞాన సమితి సన్మానసభలో చెప్పాడు.

'నాటకాల పిచ్చి ముదరడంతో సంగీతంలో సాపాసాలు కూడా పట్టడం నేర్చుకున్నాను. రంగస్థల పద్యాలు, పాపట్ల కాంతయ్యగారి పాటలు పాడేవాణ్ని. కాకినాడలో నటించే రోజుల్లో నా పద్యాలు నేనే పాడేవాణ్ణి. అంతా మా గురువుగారు జోగినాధం గారి తర్ఫీదు. రైతులపై అనురాగము జూపని రాజులుండగా 'ఏల' వంటి ఆనాటి సినిమా పాటలూ బాగా పాడేవాణ్ణి' అని కూడా తను ఎలా గాయకుడైనదీ రేలంగి ఆ సభలో చెప్పడం జరిగింది.

అందుకే ఆయన అటుతర్వాత సినిమాలలో పాడిన పాటల్లో శ్రుతి శుద్ధత వుండేది. తను వేసే పాత్రకు తగ్గట్టు కంఠస్వరం మార్చిపాడే పద్ధతి ఆయనది. హాస్యానికి, సంగీతానికి విడదీయలేని సంబంధం నెలకొల్పిన 'హాసం'గా ఆయన్ని కీర్తించవచ్చు.

పరదేశి వంటి ద్విభాషా చిత్రాలలో గాజుల బేహారిగా తమిళంలో తీసిన 'పూంగోదై' చిత్రంలో కూడా రేలంగే నటించాడు. అలా అనేక తమిళ చిత్రాలలో ఆయనకు పేరువచ్చింది.

షూటింగ్ విరామ సమయాలలో ఆయన సంభాషణలు గోష్ఠులు చాలా వినోద భరితంగా ఉండేవి. ఒకసారి తన సాటి నటుడితో 'కొరియా యుద్ధం ఎంత వరకు వచ్చింది బాబూ' అని అడిగాడు రేలంగి. 'అదేమిటి! అది ఆగిపోయి అయిదేళ్లు దాటిపోయింది కదా' అన్నాడు ఆ నటుడు. 'అది కాదు బాబు...మొన్న అడిగితే ఎవరో గనోక్వెల్ దాకా వచ్చిందన్నారుగా' అన్నాడు రేలంగి. 'గనోక్వెల్' ఏమిటి అది దగ్గు మందు కదా' అన్నాడు పాపం ఆ అమాయకుడు. 'ఆ విషయం తమకు తెలుసో లేదో అనీ' అంటూ కొంటెగా నవ్వాడు ఆయన!

అగ్రశ్రేణి నటుడి స్థాయిలో హీరోలకు హీరోగా వెలిగిన రేలంగి చరిత్ర సినీ పురాణంలో ఒక స్వర్ణ పర్వం. ఎందరో స్త్రీ పురుష తారల మధ్య రేలంగిని చూసి జన సముద్రం ఉప్పొంగిన సందర్భాలు అనేకం. 'నాదేముంది బాబు అంతా ఆ తల్లిదే' అని కళా సరస్వతికి ఆయన నమస్కరించేవాడు. మహానటి సావిత్రి అంటే ఆయనకు ఎంతో ప్రేమ, గౌరవం. అంతటి ఆర్టిస్ట్ లేదు, రాదు అనేవాడు. అలాగే సి.ఎస్.ఆర్ అన్నా అమిత గౌరవం. ఎప్పుడూ ఎంత చిన్న వాడినైనా నాయనా, బాబూ అని తప్ప సంబోధించి ఎరుగని నిగర్వి, వినయశీలి, సంస్కారి రేలంగి.

ఏ రంగ స్థలం నుంచి వచ్చి తాను మహానటుడైనాడో, స్టార్‌గా వెలిగాడో ఆ రంగస్థలాన్ని ఆయన ఏనాడూ మరువలేదు. జీవితంలో చివరి దశలో సైతం చింతామణి వగైరా నాటకాలు ప్రదర్శించి తన అభిమానం చాటుకున్నాడు.

ఈ హాసయోగికీ, హాస్యరసయోగికీ ఇదే నా అంజలి.

**-వేటూరి సుందరరామమూర్తి**

**గతపదరాత బంధనం**

'హాసం' పూర్వపక్షంలో 'కొమ్మకొమ్మకోసన్నాయి' శీర్షికను ప్రచురింపబడిన 'సముద్రాలకు నివాళి' స్వయంకృతాప శబ్దంగా రేచుక్క పాటల విషయంలో జరిగిన పొరమాటకు చింతిస్తున్నాను, ఆ చిత్రానికి పాటలు మల్లాదిగారి పేరనే వినిపించాయి. కనుక గత పద రాత బంధనంగా సవరించుకుంటున్నాను.

-రచయిత

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

**11**

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం. ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. ఎలుకలబోను పెడితే దాన్ని ఎలుక కొరికేస్తుంది. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. అది ఎలుకను పట్టకుండా పడినిద్రపోతూ ఉంటే వెంకట్రావు మండిపడతాడు. తిండిపెట్టక మాడుస్తాడు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పిల్లి సంసారాన్ని కూడా పోషిస్తున్న వెంకట్రావుకు పాల ఖర్చు పెరుగుతుంది. పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో పక్కింటి ఆండాళ్ళమ్మ సలహాతో పురోహితుని కోసం ఫోన్ చేస్తుంటాడు వెంకట్రావు.

-(ఇక చదవండి)

కొత్తగా ఉద్యోగంలో చేరిన ట్రాఫిక్ పోలీస్ అత్యుత్సాహంతో ఒక స్కూటరాయననాపి 'అవి చూపించు, ఇవి చూపించు', అని దర్పంగా అడిగాడు. అన్నీ చూపించాడు స్కూటరిస్టు. ముందుటైర్లో గాలి తక్కువుంది. వందరూపాయలు ఫైన్. అయితే యాభై రూపాయలిస్తే ఒదిలేస్తా... లేదా... పేరు చెప్పండి.' బుక్కు తీశాడు పోలీసు. "యుగంధర్ ఐ.పి.ఎస్. కమీషనరాఫ్ పోలీసు' చెప్పాడు స్కూటరిస్టు. పోలీసాయనకు స్పృహతప్పింది. కనకలింగం కూడా ఇలాగే ఖంగు తిన్నాడు ఈ సీరియల్‌లో..

"ఏంటి మీరు మాట్లాడేది? నేను వెంకట్రావును నేను వెంకట్రావును అని ఏదో పెద్ద మినిష్టరు చెప్పుకున్నట్లు చెప్పుకుంటున్నారు." కసిరింది సుందరి.

"ఈయనేదో పెళ్ళి హడావిడిలో ఉన్నట్లున్నారు. నేనొకటి చెబుతుంటే ఆయనొకటి చెబుతున్నాడు. కొంచెంసేపు ఆగి చేస్తాను" ఫోన్ పెట్టేస్తూ అన్నాడు వెంకట్రావు.

"ఏం మనిషో నాయనోయ్... ఒక్క పనీ సవ్యంగా చెయ్యడం రాదుకదా! ఫోన్ చేసి మనిషితో మాట్లాడటం రాకపోయె..." నుదురు కొట్టుకుంటూ అన్నది సుందరి.

"నువ్వు మాట్లాడు తెలుస్తుంది. ప్లీజ్ వెయిట్" కోపంగా అన్నాడు వెంకట్రావు.

అరగంట తరువాత మళ్ళీ ఫోన్ చేశాడు.

"హలో... శాస్త్రిగారూ... నేను వెంకట్రావును"

"ఆఁ...వెంకట్రావుగారూ..బాగున్నారా? నాన్నగారుఎన్నిగంటలకు స్వర్గస్తులైనారు?"

"మా నాన్న స్వర్గస్తులు కావడమేంటి? నిక్షేపంలా ఉన్నారు."

"ఆ ఏంటి విషయం వెంకట్రావు గారూ.... పావం కిడ్నీలు రెండూ చెడిపోయాయా? హాస్పటల్లో చేర్చలేదూ?..."

"కిడ్నీలు చెడిపోవడమేంటి? ఆయన కిడ్నీలు రెండూ కంచి ఇడ్లీల్లా నిగనిగలాడుతున్నాయి. మీరెక్కడున్నారు?"

"నేనా? ఖర్మలో... దానాలన్నీ పట్టు కొచ్చారా? భూదానం నాకివ్వండి. గోదానం నా రెండో అసిస్టెంటు కివ్వండి....ఆఁ... ఏం వెంకట్రావుగారూ?..."

"ఖర్మ ఖర్మ... నే చెప్పేది వినపడుతోందా? గోదానమేంటి? భూమి నాకేలేదు ఎక్కడా. ఇక మీకేం ఇమ్మంటారు... నేను చెప్పేది వినకుండా ఈ దానాలగోలేంటి?"




"ఏంటి చెప్పండి వెంకట్రావుగారూ... బాబూ శవాన్ని పాడెకు కట్టండి"

"శవమేంటండీ స్వామీ... శవాన్ని అవతల పారేశాం. పిల్లి పిల్ల శవానికి పాడె ఎందుకు?"

"భలేవారే! శవం లేవకపోతే మాత్రం శవం కదలకుండా తాళ్ళతో కట్టడం మన సంప్రదాయం. హలో... వెంకట్రావు గారూ...."

"అయ్యాశాస్త్రిగారూ... మీతో అర్జంటుగా.."

"తప్పకుండానండీ... ఆ.... బాబూ... పాడెనెత్తండి. నారాయణ నారాయణ నారాయణ..... చెప్పండి వెంకట్రావుగారూ .... నారాయణ..... చెప్పండి....."

"నారాయణ....నారాయణ.... ఛి ఛీ.... నేనంటున్నానేంటీ?" వినంగ్గా ఫోన్ పెట్టేశాడు వెంకట్రావు.

ఆ సంభాషణ వింటున్న సుందరికి వళ్ళు మండిపోయింది.

"ఏంటా వెధవగోల? ఎవరితో మాట్లాడుతున్నారు?" అరిచింది.

"ఇంకెవడు? ఈ శాస్త్రిగాడు. ఇందాక పెళ్ళిలో ఉన్నాడు. ఇపుడు ఖర్మలో ఉన్నాడు. నాతో ఒకమాట వాళ్ళతో ఒకమాట! అబ్బబ్బ... ఎంతబిజీ! కొంచెం సేపాగి ట్రై చేస్తాను."కోపంగా అన్నాడు వెంకట్రావు.

అరగంట తరువాత మళ్ళీ చేశాడు.

"ఆ.. వెంకట్రావుగారూ... బాగున్నారా.. ఇరవయ్యో తారీకు రాత్రి పదకొండు గంటలా ముప్పై ఆరు నిముషాల మూడు విఘడియలకు దివ్యమైన ముహూర్తం ఉంది."

"దేనికి?"

"ఇద్దరి జాతకాలు బ్రహ్మాండంగా కుదిరాయి. ఇక రెండో మాటవద్దు. నా దక్షిణ ఇచ్చేయండి. తద్దినం పెట్టాలి. వెంకట్రావుగారూ? ఏంటి విషయం?"

"జాతకమేంటండీ స్వామీ... మా యింట్లో పిల్లి చచ్చింది."

"సరేలెండి... ఆఁ... అమ్మా.... తాంబూలాలు మార్చుకోండి. ఎవరు చచ్చారూ?"

ఫోనును విసిరికొట్టి కిందపడి జుట్టంతా పీక్కోసాగాడు వెంకట్రావు.

"అయెయ్య...అయెయ్య.. మీ కోపం కృష్ణానదిలో మునగా...ఏంటది? ఏమైంది? ఏమంటారు శాస్త్రిగారూ?"

నా ఖర్మ.... నా పెళ్ళి.... నా తద్దినం... నా శ్రాద్ధం.... నా పిండాకూడు.. దానాలు... ధర్మాలు...

## ఎలుక వచ్చె ఇల్లు భద్రం

"పురోహితుడంటే ఎవరు?"
"తాను పిలక ఉంచుకుని ఎదుటి వారికి గుండు చేయించేవాడు."
ఈ సీరియల్లోని పురోహితుడిలో ఇలాంటి లక్షణాలున్నాయోమో చూడండి

దక్షిణలు... ముహూర్తాలు... నా పాడె... పచ్చిబద్దలు...'

సుందరికి భయమేసింది. "ఏమైందండీ" అన్నది ఏడుపుగొంతుతో.

"అమ్మమ్మో... ప్రైమ్ మినిష్టర్నయినా పట్టుకోవచ్చుగానీ ఈ బ్రాహ్మలను పట్టుకోలేం. వీళ్ళకు వందతలలు, రెండువందల చేతులున్నా చాలవు. అసలు మాట దూరనిస్తేనా? ఆయన గోలే ఆయనిది లాభంలేదు. రాత్రి రెండయినా నరే.. ఇంటి దగ్గర కావు కాని పట్టుకోవాల్సిందే." రొప్పుతూ అన్నాడు వెంకట్రావు.

* * *

రాత్రి రెండు గంటలకు శాస్త్రి గారింటికి బయలుదేరాడు వెంకట్రావు. చలి తీవ్రంగా ఉండటంతో మంకీ కేప్ ధరించి శాలువా కప్పుకున్నాడు. వీధిదీపాలు వెలగడం లేదు. అంతా కటిక చీకటి పౌర్ణమినాడు తెల్లవార్లూ వెలిగే వీధి దీపాలు అమావాస్య రాత్రి చస్తే వెలుగవు.

వెంకట్రావు చలికి వణుకుతూ నడుస్తున్నాడు. నాలుగోరోడ్డులో ఉన్నది శాస్త్రిగారిల్లు. చలిని తిట్టుకుంటూ ఇల్లు చేరాడు. గేటు చప్పుడు చేశాడు.

అదే క్షణంలో వెనుకనుంచి ఎవరో గొంతు మీద చెయ్యివేసి ఉడుం పట్టు పట్టారు. వెంకట్రావు ఎంతగింజుకున్నప్పటికీ తలను కదల్చలేకపోయాడు.

"రాస్కెల్... ఇన్నాళ్ళ నుంచీ అర్ధరాత్రిళ్ళు ఈ కాలనీలో దొంగతనాలు చేస్తున్నది నువ్వేనన్న మాట. ఎన్నాళ్ళకి దొరికావురా గాడిదకొడకా. నా




పట్టునుంచి తప్పించుకోవడం యముడికి కూడా తరం కాదురా" అని మరో చేత్తో డొక్కలో పిడిగుద్దులు గుద్దాడు ఆగంతకుడు.

వెంకట్రావు గొంతు పెగలక కుయ్ కయ్ మనలేక పోతున్నాడు. చూస్తుండగానే నైలాన్ తాడుతో వెంకట్రావు చేతులను బిగించి కట్టాడు.

"బాబోయ్ నేను దొంగను కాదండీ. ఈ కాలనీ మనిషినే. నా పేరు వెంకట్రావండీ." బిక్కచచ్చిపోయి చెప్పాడు వెంకట్రావు.

చీకట్లో లీలా మాత్రంగా పోలీసు యూనిఫాంలో భీకరాకారంతో కనపిస్తున్నాడా వ్యక్తి.

"మీరు... మీరెవరుసార్" భయం భయంగా అడిగాడు వెంకట్రావు.

"హెడ్ కానిస్టేబుల్ కనకలింగాన్ని. దొంగతనానికి నువ్వేవచ్చావా? నీ ముఠా ఎక్కడుంది?

"అయ్యబాబోయ్... దొంగతనమేంటి? ముఠా ఏంటి? నాకేం తెలియదు సార్... నేను శాస్త్రి గారింటికొచ్చాను."

"అదేరా భాడ్కోవ్... రెండు రోడ్లనుంచి నిన్ను ఫాలో అవుతున్నాను. నువ్వు ఎవరింటి దగ్గర ఆగుతావా అని కళ్ళలో వత్తులు వేసుకుని చూస్తున్నాను. శాస్త్రిగారింట్లో డబ్బు బాగా ఉందని నీకు నీ ముఠా వాళ్ళు చెప్పారా?"

"ఇదెక్కడి పెంటండీ సార్? నేను ఈ కాలనీ వాడినేనండీ..."

"ఐసీ... ఈ కాలనీలో ఉంటూ ఈ కాలనీలోనే దొంగతనాలు చేస్తున్నావన్న మాట! ఓరి భాటాచోర్! అయితే నిన్ను ఊరికే వదలకూడదు" వెంకట్రావును వంగబెట్టి ఫటఫట గుద్దుల వర్షం కురిపించాడు కనకలింగం.

వెంకట్రావు గావు కేకలు పెట్టసాగాడు. ఆ అరుపులకు బజారంతా లేచింది. బిలబిల మంటూ వచ్చారందరూ. మంకీ కాప్లో ఉన్న వెంకట్రావును గుద్దుతున్న పోలీసు కనిపించాడు.

"ఎవరు ఎవరు?" గుసగుసలాడారు.

"దొంగండీ... మునుగుదొంగ. ఈ చుట్టుపక్కల కాలనీలలో గత ఆరు మాసాలుగా దొంగతనాలు చేస్తుంది వీడే. ఖర్మగాలి ఇన్నాళ్ళకు దొరికాడు." మీసాలు మెలేశాడు కనకలింగం.

"వాడి ఎముకలు విరగ్గొట్టండి"

"కాళ్ళు చేతులు నరకండి"

"తోలు వలవండి"

"నడుములు విరగ్గొట్టండి"

అరవ సాగారందరూ.

"ఏరా అడ్డగాడిదా.. మా ఇంటికే దొంగతనానికొచ్చావా? ఒక్క మంత్రం చదివి కుంకుమ చల్లానంటే కళ్ళు పేలిపోతాయి. పోలీసుగారూ వీడిని స్టేషనుకు తీసుకెళ్ళండి తుక్కురేగ్గొట్టండి" అన్నారు శాస్త్రిగారు.

"అయ్యో... శాస్త్రిగారూ.. నేను మీకోసమే వచ్చాను. నేను వెంకట్రావునండీ..." టోపీ తీసేశాడు వెంకట్రావు. -(ఇంకావుంది)



ఆగస్టు 3 షకీల్ బదాయూనీ జయంతిని, ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకుని...



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : లీడర్ (1964)
రచన : షకీల్ బదాయూనీ
సంగీతం : నౌషాద్
గానం : మొహమ్మద్ రఫీ, బృందం
అభినయం : దిలీప్‌కుమార్, వైజయంతీమాల, తదితరులు

## 'అప్‌నీ ఆజాదీ కో హమ్ హర్‌గిజ్ మిటా సక్‌తే నహీఁ'

అప్‌నీ ఆజాదీ కో హమ్ హర్‌గిజ్ మిటా సక్‌తే నహీఁ
సర్ కటా సక్‌తే హైఁ లేకిన్ సర్ ఝుకా సక్‌తే నహీఁ
హమ్‌నే సదియోఁ మేఁ యే ఆజాదీ కీ నేమత్ పాయీ హై
హమ్‌నే యే నేమత్ పాయీ హై
సైకడోఁ కుర్బానియాఁ దేకర్ యే దౌలత్ పాయీ హై
హమ్‌నే యే దౌలత్ పాయీ హై
ముస్కురాకర్ ఖాయీ హై సీనోఁ పే అప్‌నే గోలియాఁ
సీనోఁ పే అప్‌నే గోలియాఁ
కిత్‌నే వీరానోఁ సే గుజ్‌రే హైఁ తో జన్నత్ పాయీహై
ఖాక్ మేఁ హమ్ అప్‌నీ ఇజ్జత్ కోమిలా సక్‌తే నహీఁ॥అప్‌నీ ఆజాదీ కో॥
క్యా చలేగీ జుల్మ్‌కీ అహల్-ఎ-వఫా కే సామ్‌నే, అహల్-ఎ-వఫాకే సామనే
ఆ నహీఁ సక్‌తా కోయీ షోలా హవాకే సామ్‌నే, షోలా హవాకే సామ్‌నే
లాఖ్ ఫౌజేఁ లేకే ఆయే అమన్‌కా దుష్మన్ కోయీ (2)
రుక్ నహీఁ సక్‌తా హమారీ ఏక్‌తా కే సామ్‌నే
హమ్ వో పత్థర్ హైఁ జిసే దుష్మన్ హిలా సక్‌తే నహీఁ॥అప్‌నీ ఆజాదీ కో॥
వక్త్‌కీ ఆవాజ్ కే హమ్ సాథ్ చల్‌తే జాయేంగే, సాథ్ చల్‌తే జాయేంగే
హర్ కదమ్ పర్ జిందగీ కా రుఖ్ బదల్‌తే జాయేంగే, రుఖ్ బదల్‌తే జాయేంగే
గర్ వతన్ మేఁ భీ మిలేగా కోయీ గద్దార్-ఎ-వతన్, జో కోయీ గద్దార్-ఎ-వతన్
అప్‌నీ తాకత్ సే హమ్ ఉస్‌కా సర్ కుచల్‌తే జాయేంగే
ఏక్ ధోఖా ఖా చుకే హైఁ ఔర్ ఖా సక్‌తే నహీఁ॥అప్‌నీ ఆజాదీ కో॥
వందేమాతరం వందేమాతరం వందేమాతరం
హమ్ వతన్ కే నౌజవాఁ హైఁ హమ్‌సే జో టక్‌రాయెగా, హమ్ సే జోటక్‌రాయెగా
వో హమారీ ఠోకరోఁ కే ఖాక్ మేఁ మిల్ జాయెగా, కాక్ మేఁ మిల్‌జాయెగా
వక్త్ కే తూఫాన్ మేఁ బహ్ జాయేంగే జుల్మోసితమ్
ఆస్మాఁ పర్ యే తిరంగా ఉమ్ర్ భర్ లహరాయెగా, ఉమ్ర్ భర్ లహరాయెగా
జో సబక్ బాపూనే సిఖ్‌లాయా భులా సక్‌తే నహీఁ॥సర్ కటాసక్‌తే హైఁ॥







'సాంప్రదాయ స్ఫూర్తిని విడువకుండా సమకాలీన విలువలకూ ప్రాధాన్యమిచ్చిన కవి ఆయన' - సాహిర్ లుధియాన్వి.

'మా కవిత్వాల పంథాలు వేరైనా ఆయన వ్రాసిన కొన్ని అనితర సాధ్యమైన పాటలు వింటుంటే నాకు అసూయ కలిగేది' - మజ్రూహ్ సుల్తాన్‌పురి.

షకీల్ బదాయూనీ గురించి ఆయన తోటి కవులు అన్న మాటలివి. ఆయన బహుముఖ ప్రజ్ఞ అలాంటిది మరి. 'ఓ దునియా కే రఖ్‌వాలే' (బైజూ బావ్‌రా) వంటి భక్తిగీతం, 'కహీఁ దీప్ జలే' (బీస్ సాల్ బాద్) వంటి హాంటింగ్ సాంగ్, 'న జావో సైయ్యా'



(సాహిబ్ బీవీ ఔర్ గులామ్) వంటి విభిన్నమైన పాట, 'ప్యార్ కియా తో డర్నా క్యా' (ముగల్-ఎ-ఆజమ్) వంటి రెబెల్ సాంగ్, 'చౌదవీఁ కా చాంద్' వంటి శృంగార గీతం, 'కోయీ సాగర్ దిల్ కో బహలాతా నహీఁ' (దిల్ దియా దర్ద్ లియా) వంటి విషాద గీతం, 'మేరే మెహబూబ్ తుఝే మేరీ మొహబ్బత్ కీ కసమ్' (మేరే మెహబూబ్) వంటి ప్రేమ గీతం, 'మధుబన్ మేఁ రాధికా నా చేరే' (కోహినూర్) వంటి శాస్త్రీయ గీతం, 'జబ్ చలీ ఠండీ హవా' (దో బదన్) వంటి విరహగీతం, 'అప్‌నీ ఆజాదీ కో హమ్ హర్‌గిజ్ మిటా సక్‌తే నహీఁ' (లీడర్) వంటి దేశభక్తి గీతం వెలువడిన కలం ఆయనది. తన సినీ జీవితంలో రెండు ఫిలింఫేర్ అవార్డులు గెలుచుకున్నా నిరాడంబరంగా జీవించారు ఆయన.

షకీల్ అహమద్ షకీల్ బదాయూనీ 1916 ఆగస్టు 3న ఉత్తరప్రదేశ్‌లోని బదాయున్‌లో జన్మించారు. ఆయన తండ్రి ఆయనకు అరబిక్, పార్సీ, ఉర్దూ, హిందీ భాషలు నేర్పించారు. అప్పట్లో వారి కుటుంబంలో ఎవరికీ కవిత్వం మీద ఆసక్తి ఉండేది కాదు. లక్నో నగరంలో సాంస్కృతిక రంగంలో కవి సమ్మేళనాలకు ఎనలేని ఖ్యాతి ఉంది. కవిత్వంలో జరిగిన ఆ కృషి షకీల్‌లోని కవి ఎదగటానికి ఎంతో దోహదపడింది. అప్పట్లో కవిత్వం వాస్తవికతకు దూరంగా కాల్పనిక జగత్తులో ఉన్నట్లు ఉండేది. షకీల్ కూడా తొలి దశలో అలాంటి కవిత్వమే వ్రాసినా తరువాత సాంఘిక సమస్యలపై దృష్టి సారించారు. 1936లో అలీగఢ్ విశ్వవిద్యాలయంలో చేరిన షకీల్ తన సహధ్యాయి రాజ్ మురాదాబాదీతో కలిసి ఎన్నో కవిత్వ పోటీల్లో బహుమతులు గెలుచుకున్నారు. వారి ఉర్దూ లెక్చరర్ మౌలానా అహ్‌సాన్ వారికి శిక్షణ ఇస్తూ ప్రోత్సహించేవారు. చదువు పూర్తయిన తర్వాత షకీల్ 1942లో ఢిల్లీలోని సరఫరాల శాఖలో ఉద్యోగంలో చేరారు. తన కవిత్వంలో గ్రాంథిక, వ్యావహారిక భాషలు సమపాళ్ళలో ఉపయోగిస్తూ హాస్య చతురత జోడించి పండిత పామరుల మన్ననలందుకున్నారు. 1946లో ముంబాయి చేరిన షకీల్ సందర్భాన్ని బట్టి, బాణీలకనుగుణంగా అయినా జనరంజకంగా సినిమా పాటలు వ్రాసి విజయం సాధించారు. సరళమైన భాషలోనే ఆదర్శవంతమైన భావాలు చెప్పవచ్చని నిరూపించారు. అందుకు నిదర్శనమే లీడర్‌లోని 'అప్‌నీ ఆజాదీ కో హమ్ హర్‌గిజ్ మిటాసక్‌తే నహీఁ' పాట.

స్వాతంత్ర్యం సంపాదించటం ఒక ఎత్తయితే దాన్ని కాపాడుకోవటం ఒక ఎత్తని తెలిపే పాట ఇది. స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవటానికి కావలసిన చిత్తశుద్ధిని నొక్కి చెబుతుంది. తమ స్వార్థ ప్రయోజనాల కోసం ప్రజలను భయభ్రాంతులను చేసి వారి స్వాతంత్ర్యాన్ని హరింపజూసే అరాచకశక్తులకు ఎదురు నిలిచి పోరాడాలని పిలుపునిస్తుంది. హిందీ చిత్రసీమలో వచ్చిన ఉత్తమ దేశభక్తి గీతాలలో ఒకటిగా నిలిచిపోయిందీపాట. నేటి చిత్రాలలో ఇలాంటి పాటలు రాకపోవటం విచారకరం. స్వాతంత్ర్యం కోసం అమరవీరులు చేసిన త్యాగాలను తలచుకుంటూ కాలంతో పాటు మారుతూ సాగాలని చెప్పటంలో షకీల్‌సాబ్ దార్శనికత, ప్రగతిశీల దృక్పథం ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

ఒక బహిరంగ సభలో గాంధేయ వాదులైన నాయకులు ప్రసంగిస్తుండగా విరోధ పార్టీలకు చెందిన వారు బాంబులు వేసి అలజడి రేపుతారు. జనం భయపడి పారిపోతుంటే నాయకుడు వేదిక పైనుంచి వారికి పిరికితనం వదలమని పిలుపునిస్తాడు. పిరికితనంతోనే వంద సంవత్సరాల పాటు దేశాన్ని పరాధీనం చేసుకున్నామని, ఇప్పుడు పిరికితనం వదిలి అరాచక శక్తులకు వ్యతిరేకంగా పోరాడాలని చెప్పి ఈ పాట పాడతాడు. అతని సహచరులు, నాయిక అతనితో గొంతు కలుపుతారు. నాయికా నాయకులుగా వైజయంతీమాల, దిలీప్‌కుమార్ నటించారు.

ఆజాదీ అంటే స్వాతంత్ర్యం, హర్‌గిజ్ అంటే ససేమిరా. సర్ ఝుకానా అంటే తలవంచటం.

**'మా స్వాతంత్ర్యాన్ని మేం ససేమిరా వదులుకోం**
**తలతెంచినా సరే కానీ తలవంచబోం'**

కొంతమంది చేసే ఆగడాలకు తమ స్వేచ్ఛని వదిలి పారిపోబోమని, తమ ప్రాణాలు పోయినా సరే ఎవరికీ భయపడేది లేదని అతను అంటున్నాడు. ఇదే అందరి నినాదం కావాలని అతని ఉద్దేశ్యం.

సదియాఁ అంటే యుగాలు. నేమత్ అంటే నిధి, కానుక, వైభవం. 'సైకడోఁ' అంటే అసంఖ్యాకమైన. కుర్బానీ అంటే త్యాగం. దౌలత్ అంటే ఐశ్వర్యం. ముస్కురానా అంటే చిరునవ్వు. సీనా అంటే రొమ్ము. గోలీ అంటే  తుపాకీ గుండు. వీరానా అంటే ఎడారి అనుకోవచ్చు. జన్నత్ అంటే స్వర్గం. ఖాక్ అంటే మట్టి, బూడిద. ఇజ్జత్ అంటే గౌరవం.

'మేము యుగాల తర్వాత పొందాము స్వేచ్ఛా వైభవం
ఎన్నో త్యాగాలు చేశాక పొందాము ఈ ఐశ్వర్యం
చిరునవ్వుతో నేలకొరిగాము తుపాకీ గుళ్ళకు
ఎన్ని ఎడారులు దాటితే చేరాము మేము స్వర్గము
మట్టిపాలు కానివ్వము మా ఆత్మగౌరవం'

ఎన్నో త్యాగాలు చేసి, ప్రాణాలర్పించి, ఎన్నో కష్టాలు ఎదుర్కొని స్వాతంత్ర్యమనే ఐశ్వర్యాన్ని పొందాం మనం. ఆ స్వాతంత్ర్యాన్ని కాపాడుకుంటామే గాని ఆత్మ గౌరవాన్ని విడిచి కొంతమంది స్వార్థపరులకు దేశాన్ని అప్పగించం.

జుల్మ్ అంటే అరాచకం. అహల్-ఎ-వఫా అంటే విశ్వాసపాత్రులు. షోలా అంటే అగ్ని. హవా అంటే గాలి. ఫౌజ్ అంటే సైన్యం. అమన్ అంటే శాంతి. దుష్మన్ అంటే శత్రువు. ఏకతా అంటే ఐకమత్యం. పత్థర్ అంటే శిల.

'సాగవు అరాచకాలు విశ్వాసపాత్రుల ముందర
నిలువలేరు ఎవ్వరూ గాలిమంటల ముందర
లక్ష సైన్యాల తోడుగా శాంతిపై పోరు సలిపినా
నిలువలేరు ఎవ్వరూ మా ఐకమత్యం ముందర
శత్రువులు కదిలించలేని కొండలాంటి వాళ్ళం'

దేశమంటే విశ్వాసం చూపే దేశభక్తుల ఎదుట ఆరాచకాలు చెల్లవు. గాలి, మంట విజృంభిస్తే వాటి ఎదుట ఎవరూ నిలువలేరు. ఆ గాలి, మంటల వంటి వారు దేశభక్తులు. లక్ష సైన్యాలతో శాంతిని భగ్నం చేద్దామని ఎవరైనా వచ్చినా ఐకమత్యంగా ఎదుర్కొంటే వారు తోకముడవక తప్పదు పర్వతంలా నిశ్చలంగా నిలబడితే ఎంతటి శక్తినైనా అడ్డుకోవచ్చు. స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవటానికి ఐకమత్యం, దృఢ నిశ్చయం ఎంత ముఖ్యమైనవో ఇక్కడ చక్కగా చెప్పారు షకీల్‌సాబ్.

'వక్త్ కీ ఆవాజ్' అంటే కాలమిచ్చే పిలుపు. కదమ్ అంటే అడుగు. జిందగీ అంటే జీవితం. రుఖ్ అంటే దిశ. వతన్ అంటే దేశం. గద్దార్ అంటే ద్రోహి తాకత్ అంటే బలం. ధోఖా అంటే మోసం.

'కాలమిచ్చే సందేశం పాటిస్తూ సాగిపోతాం
అడుగడుగునా జీవితాన్ని నిర్దేశిస్తూ సాగిపోతాం
దేశమందే దేశద్రోహి ఎవరైనా దొరికితే
మా బలంతో వాడిని మట్టి కరిపిస్తూ సాగిపోతాం
ఒకసారి మోసపోయాం, మళ్ళీ మోసపోం'

కాలంతో వచ్చే మార్పులను ఆమోదిస్తూ జీవితాన్ని తదనుగుణంగా మలచుకుంటూ సాగిపోవాలి. దేశాన్ని అభివృద్ధి వైపు నడిపించాలి. దేశద్రోహులెవరైనా ఎదురుపడితే వారిని రూపుమాపుతూ సాగిపోవాలి. వ్యాపారం కోసమంటూ మన దేశానికొచ్చి దేశాన్ని స్వాధీనం చేసుకుని మోసగించిన బ్రిటిష్ వారిలా ఎవరైనా మోసం చేయతలపెడితే వారిని తుడిచిపెట్టాలి. మన సాంప్రదాయాలను గౌరవిస్తూనే కాలానుగుణంగా మారుతూ అభివృద్ధి సాధించాలనే చక్కని సందేశం ఉందిక్కడ.

నౌజవాన్ అంటే నవయువకులు. ఠోకర్ అంటే దెబ్బ. సితమ్ అంటే బాధలు. ఆస్మాన్ అంటే ఆకాశం. తిరంగా అంటే త్రివర్ణ పతాకం. సబక్ అంటే పాఠం. బాపూ అంటే బాపూజీ అని పిలుచుకునే గాంధీజీ.

'మేం దేశపు నవయువకులం, మాతో తలపడితే
మా దెబ్బకు మట్టిలో కలిసిపోతారు ఎవరైనా
కాలప్రవాహంలో కొట్టుకుపోతుంది అరాచకం
ఆకసంలో ఎప్పటికీ ఎగురుతుంది త్రివర్ణపతాకం
బాపూజీ నేర్పిన పాఠాలు మరువబోం'

దేశంలోని యువతరం అంతా కలిసికట్టుగా నిలబడితే శత్రువులెవరైనా నేలకొరగాల్సిందే. అరాచకాలు కాలప్రవాహంలో కలిసిపోతాయి. త్రివర్ణపతాకం ఆకాశంలో ఎప్పటికీ ఎగురుతూనే ఉంటుంది. బాపూజీ నేర్పిన దేభభక్తి ఎన్నటికీ మరువకుండా సాగిపోవాలి.

ఈ పాటలోని సందేశం ఇప్పటి పరిస్థితులకూవర్తిస్తుంది. ఐకమత్యం నిలిచి స్వార్థపరులను అంతమొందిస్తేనే దేశప్రగతి సాధ్యపడుతుంది.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

స్వర సుందరి



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
**డా॥ పి.బి.శ్రీనివాస్**
'హాసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

**మా**ఝాబాల్ (నా బిడ్డ)అని మాస్టర్ వినాయక్ నిర్మించిన మరాఠీ చిత్రంలో దీనావస్థలో వున్న దీనానాథ్ పిల్లలందరికీ నటించే అవకాశం దక్కింది. " అనాథాశ్రమపు పిల్లలు పాడుతూ బిచ్చమెత్తే సన్నివేశమది. అప్పుడే కొత్తగా అనాథలమైన మాకు ఆ సన్నివేశం సహజంగానే నప్పింది. నటనకూడా చక్కగా ఒప్పింది. ఆ రోజుల్లో వినాయక్‌గారే గనక మా కుటుంబాన్ని ఆదుకుని సహాయం చేసివుండకపోతే చిత్రంలోని ఆ దీన సన్నివేశం మా నిజ జీవితాలలో కూడా సంభవించి వుండేదేమో" అని ఇప్పటికీ స్మరిస్తూనే వుంటారు లతా తమ ఆనాటి ఆపద్బాంధవుడిని.

వినాయక్ గారి తదుపరి చిత్రం "బడీ మా"లో నాయికా పాత్రధారి - లతా గానానికి స్ఫూర్తినిచ్చిన నూర్జహాన్! విరామ సమయాలలో నూర్జహాన్ లతా చేత పాటలు పాడించుకుని విని, ముగ్ధురాలైపోయి, నిర్మాతతో అనేవారట- 'వినాయక్ సాహబ్ ఈ చిన్నారి త్వరలోనే పెద్ద గాయకురాలుగా స్థిరపడి అపూర్వ విజయాలని సాధిస్తుంది' అని. ఆ మహాగాయకురాలి భవిష్యవాణి త్వరలోనే నిజంగానే ఫలించి లతకి కిరీటం పెట్టింది. " వదలకుండా సాధకం చెయ్యి, భవిష్యత్తులో నువ్వే స్వరసామ్రాజ్ఞివి" అని ఆశీర్వదించారు ఆ మహోదారహృదయ. క్రమంగా ఇద్దరు



"**హాం**టింగ్ సాంగ్స్"కి లతా పెట్టింది పేరు. ఒకటా రెండా? బోలెడన్ని "లింగరింగ్ మెలొడీస్"! "ఆయేగా ఆయేగా" (మహల్) మోహేభూల్‌గయే సాఁవరియా" (బైజుబావ్‌రా); "తోడ్ దియా దిల్ మేరా" (అందాజ్); "జో వాదాకియావో నిభానా పడేగా" (తాజ్‌మహల్, మహమ్మద్ రఫీతో); "సీనేమె సులగ్‌తేహైఁ అర్‌మాఁ" (తరానాలో తలత్ మెహమూద్‌తో), "ముఝ్‌కో ఇస్‌రాత్‌కీ తన్‌హాయీ మేఁ ఆవాజ్ నదో" (ముఖేశ్‌తో); "లగ్‌జా గలే, నైనా బర్‌సే రింఝుం రింఝుం" (వోకౌన్‌థీ), "ఆప్ కే నజ్‌రోఁనే సంఝూప్యార్‌కే కాబిల్ ముఝే" (అన్‌పఢ్), "న తుం బేవఫాహో, న హం బేవఫాహై" వంటి అసంఖ్యాకాలైన గీతాలు, మన మనసులో తరుచూ రింకారం



'అందాజ్'లో రాజ్‌కపూర్, నర్గీస్

సలుపుతూనే వుంటాయి.

అటువంటి హాంటింగ్ సాంగే అయిన 'రైనా బీతీజాయే' పాట ఒకనాడు టీ.వి.లో వింటూ 'మురళీవాలా' (శ్రీకృష్ణుడి) వేణు గీతాలాపన సాగిస్తోందా అన్నంతగా, మార్దవాన్నీ మాధుర్యాన్నీ మేళవించిన ఆమె తీరు చూసి పరవశుడనై పాటముగిసిన తరువాతకూడా అలాగే కూర్చుండిపోయాను. 'మాడ్యులేషన్' అనే ప్రక్రియని ఆమె ప్రయోగించే విధానాన్ని నేను ప్రత్యేకంగా అధ్యయనం చేశాను. నేను పొందిన పారవశ్యానుభూతిని మనస్సులోనే యిముడ్చుకోలేక ఆమెకి ఒక ప్రశంసాలేఖ వ్రాసి, ప్రత్యుత్తరం పొందానుకూడా.

మెహదీహసన్ రికార్డ్ప్లే చేసి, ఆయన కంఠస్వరానికి ఈడుగా తంబూరాని

గాయనీమణుల మధ్య స్నేహం చిగురించి మూడు పువ్వులూ ఆరు కాయలుగా పెంపొందడం అందరికీ నేడు విదితమైన విషయమే.

'లతామంగేష్కర్' అనే పేరుకి ఇంగ్లీషులో ప్రథమాక్షరాలు 'L.M' లలిత సంగీతానికి అవే Light Music. ఆమె L.M మాత్రమే కాదు C.M, P.M కూడా అనగా Clasic Music, Poetic Music.తనకి ప్రథమస్ఫూర్తి అయిన నూర్జహాన్‌లాగే పాడడం సాగించివుంటే ఆనాటి 'లత' ఈనాటి 'లత'గా రూపొందివుండేది కాదేమో!

నా కప్పుడప్పుడనిపిస్తూ వుంటుంది. సజ్జాద్, నౌషాద్‌ల పాటలు 'ఆజ్ మేరే నసీబ్‌నే" (పాత 'హల్‌చల్' లో నర్గీస్‌కీ) 'ఉన్‌కే సితంనే లూట్‌లియా హాయే క్యాకరేఁ', 'తోడ్ దియాదిల్ మేరా' (అందాజ్‌లో నర్గీస్‌కీ) వంటి అద్భుత సంగీత రచనలు 'లత' పరిపూర్ణత సాధించిన పిదప పాడివుంటే ఆ పాటల ఆలాపన పరాకాష్ఠని అందుకుని వుండేదేమోనని. ఆమె పాత ఆలాపనా పద్ధతి అప్పటికే నిర్దుష్టమై సాగినా,



తరువాత ఆమె పట్టుదలతో పరిశ్రమించి, సాధించిన పరిపక్వత అనన్యసాధ్యం.అని లత పాడిన వైనం తలుచుకుంటే ఒళ్ళు జలదరిస్తుంది.

తన పరివారానికంతటికీ ఆప్తబంధువై ఆదుకుంటూ వచ్చిన మాస్టర్ వినాయక్ కూడా సడెన్‌గా మరణించే సరికి, లతా లేతమనసు ఛిన్నమై ఖిన్నమైపోయింది. ముందు దారి ఏమిటి? గమ్యం ఎక్కడ? అంతా అగమ్యగోచరంగా తోచిన ''లత'' మథనపడుతుండగా, పాపా బుల్‌బులే అనే కెమేరామన్ తారసిల్లారు. ఆయన లతాని సంగీత దర్శకులు హరిశ్చంద్రబాలీకి పరిచయం చేయగా, ఆయన తను కొత్తగా స్వరపరచిన ఒక మంచి పాటని ఆమె చేత పాడిస్తానని హామీ ఇచ్చారు. లతా కొత్త ఇల్లుకి తరలడానికి ఉపయోగపడిన ఆ ఫిలిం అసలు రిలీజే అవలేదట!

నానాచౌక్‌లో లతా కుటుంబం ఒక చిన్నయింట్లో నివసించడం మొదలుపెట్టారు. ఒకనాటి రాత్రి మాయీ మాత్రమే మేలుకుని పిల్లలని నిద్రకి కాపలా వుండి, తనతో తనే పేకముక్కలాట ఆడుకుంటూ వుండగా, అకస్మాత్తుగా, ఒక భీకర వ్యక్తి రక్తసిక్త వస్త్రాలతో, చేతిలో పదునైన కత్తితో ప్రవేశించాడు. ఆ వ్యక్తిని పోలీసులు తరుముకుంటూ వచ్చి మాయీని అతన్ని గురించి వాకబు చేయగా, ఆమె, అతని

జెమినీ సంస్థ హిందీలో నిర్మిస్తున్న "బహుత్ దిన్ హుయే " చిత్రానికనో "దో దుల్హే" చిత్రానికనో "లతా" ఒక సోలో సాంగ్ పాడుతున్నారు. పాటకి ముందు ఒక హమ్మింగ్ లాంటి సాకీ విడిగా రికార్డు చేస్తున్నారు.



సహజత్వంకోసమనో ఏమో, రికార్డిస్టు ఆమెని "మైకు"కి కొంత దూరంలో నిలబడి, మెల్లమెల్లగా అడుగులు వేస్తూ (కంఠస్వరం దూరం నించి దగ్గిరికి వస్తున్న విషయాన్ని సూచించేలా) పాడుతూనే మైకుని సమీపించి సాకీని ముగించమని చెప్పాడు. లతా అలాగే చేస్తున్నా పరిపూర్ణత సిద్ధించాలనో యేమో రికార్డిస్టుగారు, మితిమించి టేకులు తీసుకోసాగారు. లతాలాంటి ఏక సంతగ్రాహిచేత కూడా అన్ని సార్లు పాడిస్తున్నారే అని నేననుకుంటూండగానే, లత "ముఖం"లో ఒకింత విసుగూ, అలసటా కనబడ్డాయి. కొసకి, "లత" నీరసం వల్ల స్పృహ తప్పారు. బహుశా ఏమీ తినకుండానే రికార్డింగుకి వచ్చేశారమో తెలియదు. అందరూ కంగారు పడిపోయారు. ఎన్నో పరిచర్యలు చేశారు. అంత అలసట జెందిన సమయాన కూడా ఆమె పల్లెత్తు మాట అనలేదు కాని స్పృహ తప్పేముందు తనలో తానే ఏదో అనుకున్నారు.

పాటలన్నీ అద్భుతంగా రికార్డయే సరికి, జెమినీ అధినేత "లతా" గౌరవార్థమై, నగర ప్రముఖులందరినీ ఆహ్వానించి ఒక బ్రహ్మాండమైన విందు ఏర్పాటు చేశారు. ఆ సింగింగ్ ఏంజల్‌ని చూసి, నోరు తెరిచి చూస్తూ వుండి పోనివారు లేరానాడు. శ్రీఈమనీ నేనూ పక్కపక్కనే కూర్చుని వున్నాం. ఈ "సప్త స్వరసుందరికి" ఎవరూ సాటిరారనీ - అహఁ - సాటి లేరనీ మా ఇద్దరికీ అనిపించింది - విందు ముగిసిన పిదప, వాసన్‌గారు లతాని ఎంతగానో అభినందించి, ఆశీర్వదించి, ఆమె అనుకుని వుండనంత మొత్తాన్ని స్వహస్తాలతో అందచేశారు.

\- పి.బి.యస్.

శృతిచేసుకోవచ్చునని నేనెప్పుడూ సభాముఖంగా కూడా మెచ్చుకుంటే ఉండేవాడిని. లత గళ స్వరం సాగుతుండగా అసలు తంబూరా అవసరమే వుండదని చెప్పినా అతిశయోక్తి కాబోదు. ఉస్తాద్ బడేగులాం ఆలీఖాన్ సాహెబ్ సాయించినట్టు 'లత' 'అల్లామియాకా కమాల్ హై' అనగా భగవంతుడే సృష్టించిన అతిశయవ్యక్తి! అత్యద్భుతశక్తి!!

గాయనిగా లత సిల్వర్‌జూబ్లీ జరిగినప్పుడు "సప్త స్వర సుందరీ" అనే శీర్షికతో ఓ ప్రశంసా గీతం హిందీలో రచించి, స్వరపరచి హెచ్.ఎం.వి. కంపెనీలో టేప్ లో రికార్డు చేసి ఆమె ఇంటికివెళ్లి సమర్పించాను.

**'సంగీత్ గగన్ కా ధ్రువ్ తారా, యే నామ్ లతాకా హై ప్యారా**
**బహ్‌తాహై బన్‌కర్ రస్‌ధారా, హర్ గీత్ లతాకా హై న్యారా - ॥ సం ॥**
**హై సాత్ సురో నే ఖుద్ మిల్‌కర్, ఇక్‌రూప్ లియా వర్ నారీకా**
**ఆరామ్‌హై దేతీ జోగమ్‌కో, దరియా బన్‌కర్ దిల్‌దారీకా - ॥ సం ॥**
**మదిరాకీ మాదక్‌తా సే భరీ, మధురాయీ కీ హై పిచ్‌కారీ**
**నస్‌నస్‌మె సుధారస్ బర్‌సాతీ, కిత్‌నీ హైదవాయే, హిత్‌కారీ - ॥ సం ॥**
**గంగాకీ లహర్ ముర్‌కీ హై బనీ, ఆవాజ్ మధుర్‌మురలీ హై బనీ**
**హోజా ఏ ఫిదా జిస్‌నే భీ సునీ, దునియాతో లతాహీ కీ హై ధునీ ॥ సం॥**
**సబ్‌రాగో కీ హై పట్‌రానీ, మిల్‌తా హి నహీ జిస్‌కా సానీ**
**సబ్‌నటియోకీ హై స్వర్‌దానీ, జిస్‌నే నథా కావట్ నహీజానీ - ॥ సం ॥**
**ఫన్‌కీ హీ ఖిద్‌మత్ కరనేకో, కరతీహై ముహబ్బత్ నజ్‌మోంసే**
**లోగోంకా మన్ బహ్‌లానేకో, కర్‌లీహై శాదీ నగ్‌మోంసే - ॥ సం ॥**
**కిత్‌నీహై బడీ యే కుర్‌బానీ, కిత్‌నీ అడియల్‌యే మన్‌మానీ**
**లేతీహుయీ ఇక్ బేదార్ అదా, చమ్‌కేగీ లతా లౌ బన్‌కే సదా -॥ సం ॥**

అనే ఆ ప్రశంసాగీతం, ఒక పల్లవితోనూ ఆరు చరణాలతోను సప్త రాగమాలికలో విశిష్టంగా రూపొందింది. ఆ పాట వింటూ మధ్యమధ్య ఆమె కనబరిచిన ప్రశంసా సంకేతాలు ఈనాటికీ, నా మనోయవనికపై విస్పష్టంగా మెరుస్తూనే వున్నాయి. ముఖ్యంగా ఒక వాక్యం "కిత్‌నీ హై దవా యే హిత్‌కారీ" ఆమెకి చాలా నచ్చింది. లతా గానం మేలు చేసే ఔషధం అని ఆ వాక్యానికి అర్థం. ఆ వాక్యం తన నోట వెంటనే ఆమె రిపీట్ చేయగా విని, నేను ఉబ్బితబ్బిబ్బై పోయాను.

\- పి.బి.యస్.

# నూర్జహాన్ పాకిస్తాన్ తరలిపోకపోతే లతా పైకివచ్చేదా?

లతా గొంతు విప్పడానికి ముందే నూర్జహాన్ ప్రసిద్ధి కెక్కిన నటగాయని. ఆమె లతాకు ఐడాల్, ఆరాధ్యమూర్తి. నూర్జహాన్‌ను కొద్దికాలం అనుకరించి, తర్వాత తర్వాత స్వంతబాణీ అలవర్చుకుంది. ఈ లోపులే దేశవిభజనానంతరం నూర్జహాన్ పాకిస్తాన్ తరలివెళ్లిపోయింది. అక్కడ తన పాటలతో, నటనతో కొన్ని దశాబ్దాలపాటు ప్రేక్షకుల హృదయాలను గెలుచుకుని 'మల్కా-యే-తరన్నుమ్' పేరు సంపాదించుకుంది. కళారంగంలోనే కాదు, రాజకీయరంగంలో కూడా ఓ వెలుగు వెలిగింది.

నూర్జహాన్ నిష్క్రమణతో లతాకు ఎదురే లేకపోయింది. క్రమంగా శిఖరాలనధిరోహిస్తూ 'భారతీయ స్వరసామ్రాజ్ఞి' అనిపించుకుంది. నూర్జహాన్ దేశం విడిచి వెళ్లివుండకపోతే పరిస్థితి ఎలా వుండేది అన్న విషయంపై ఊహాగానకచేరీలు సాగుతూనే ఉంటాయి. లతపోటీని నూర్జహాన్ తట్టుకోగలిగేదా? లేదా నూర్జహాన్‌ను దాటుకుని లత నంబర్ వన్‌గా ఎదగగలిగేదా?





లతా, నూర్జహాన్‌లకు కొన్ని పోలికలున్నాయి, కొన్ని తేడాలున్నాయి. ఇద్దరూ సెప్టెంబరుమాసంలోనే పుట్టారు. (నూర్జహాన్ 21 న, లతా 28 న) ఇద్దరికీ మధ్య మంచి స్నేహం ఉంది. వేర్వేరు దేశాలలో ఉన్నా ఉత్తరాలు రాసుకోవడం, ఫోన్‌లో మాట్లాడు కోవడం ఉంది. నూర్జహాన్‌కు పాన్ అలవాటు ఉంటే లతకు చూయింగ్ గమ్ నమిలే అలవాటుంది. కానీ నూర్జహాన్ వైవాహిక జీవితం ఎగుడుదిగుడుల మయం. తనకన్నా చిన్నవాడిని పెళ్లి చేసుకుని విడాకులు ఇచ్చింది. పాకిస్తాన్ అధ్యక్షుడు యాహ్యాఖాన్‌తో చనువుగా ఉండి దేశవ్యవహారాలలో చక్రం తిప్పేదని పాకిస్తాన్ పత్రికలు ఆరోపించాయి. లతా బ్రహ్మచారిణిగా ఉండిపోయింది. రాజకీయాలలో ఆసక్తి లేదు.

వాయిస్ విషయంలో కూడా ఇద్దరికీ తేడాలున్నాయి. ఇద్దరికీ అభిమాన సంగీతదర్శకుడైన నౌషాద్ మాటల్లో చెప్పాలంటే - 'లతా నూర్జహాన్ స్కూల్‌కి చెందినదే! అయినా నూర్జహాన్ వాయిస్ భారీ వాయిస్. మంచి బ్రైట్‌గా, వెయిటీగా ఉంటుంది. మూడ్‌కి తగ్గ విధంగా కంఠంలో ఎక్స్‌ప్రెషన్ పలికించగలదు - అదీ స్వరసహితంగా. లతాది నాజూకు వాయిస్ అయినా నూర్జహాన్ వద్ద ఆ కళను పట్టుకుంది."

లతాచే ముందులో పాడించిన సంగీతదర్శకులు - అనిల్‌బిశ్వాస్, ఖేమ్‌చంద్ ప్రకాష్, నౌషాద్, ఘులాం మొహమ్మద్, శ్యామ్‌సుందర్, సజ్జాద్, హన్స్‌రాజ్ బెహల్, సి.రామచంద్ర - వీరందరూ నూర్జహాన్ చేత పాడించినవారే. వారు లతా తొలిరోజుల్లో ఆమెను నూర్జహాన్‌లా పాడించడానికి ప్రయత్నించారు. కానీ శంకర్-జైకిషన్‌లు నూర్జహాన్‌తో కలిసి పనిచేయలేదు. అందువల్ల 'బర్సాత్'లో లతాచే పాడించినప్పుడు నూర్జహాన్ మోల్డ్‌లో పాడించకుండా స్వతంత్రశైలిలో పాడించారు.

హిందీ సినీరంగంలో పంజాబీస్టయిల్ కాస్త వెనుకబడి, మహారాష్ట్ర, బెంగాలీ ధోరణులు ప్రాచుర్యం పొందుతున్న కొద్దీ మాధుర్యం పాళ్లు ఎక్కువయిన లతా స్టయిలే జనాలకి బాగా నచ్చింది. అది గమనించిన కంపోజర్స్ అందరూ ఆమె వైపే మొగ్గు చూపనారంభించారు. శంషాద్ బేగంచేత ఎన్నో మంచిపాటలు పాడించిన నౌషాద్, సి.రామచంద్ర, సచిన్‌దేవ్ బర్మన్ క్రమంగా లతాకే ఛాన్సివ్వసాగారు.

గాయనిగా నూర్జహాన్ కంటె లతా ప్రగతి బాగుండడానికి కారణాలు విశ్లేషిస్తూ నౌషాద్ అన్నారు - "పాకిస్తాన్ వెళ్లడంతో నూర్జహాన్ పరిధి చిన్నదయిపోయింది. అక్కడ పంజాబీ, ఉర్దూ భాషలలో తప్ప పాడలేదు కదా. కానీ లతాకు భారతీయ భాషలన్నిటిలోనూ పాడే అవకాశం ఉంది. పలు భాషలు, పలు కంపోజర్స్, పలు సన్నివేశాలు. వైవిధ్యం పెరిగినకొద్దీ ఎదిగే అవకాశాలు మరింత వచ్చిపడతాయి."

రాజా భరతన్ అనే విఖ్యాత జర్నలిస్టు లతామంగేష్కర్‌ని డైరక్టుగా అడిగేశారు - "నూర్జహాన్ వలసపోకుండా ఉంటే మీరీ ఉన్నతస్థానాన్ని పొందగలిగే వారా?" అని. దానికి లతా చెప్పిన సమాధానం - "మీరో విషయం విస్మరిస్తున్నారు. నూర్జహాన్ నటీమణి, గాయని. తెరపై ఆవిడ నటించిన పాటలు మాత్రమే ఆవిడ పాడేది. మరి నేను అందరికీ పాడతాను. అందుచేత ఆవిడ నాకు రైవల్ అనడానికి వీలులేదు. పైగా నూర్జహాన్ టాప్‌లో ఉన్న పీరియడ్‌లో కాస్త ఇటూ అటూగా సురయ్యా కూడా ఉండేది. శంషాద్ బేగమ్ మాట సరేసరి. వీరే కాకుండా జోహ్రాబాయి అమీర్‌బాయి, గీతా రాయ్, రాజ్‌కుమారి, మోహన్‌తారా తాల్‌పాడే, లలితా దేవూల్‌కర్, సురీందర్ కౌర్ వంటి ఎంతో మంది గాయనీమణులు ఉండేవారు. ఎవరిస్థానం వారిదే! అందువల్ల నూర్జహాన్ ఇక్కడే ఉండిపోయినా నా స్థానానికి నేను వచ్చేదాన్ని. ఉన్నతస్థానాన్ని నిలుపుకోవాలంటే ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి. సిగరెట్టు, తాగుడు, ఫాస్ట్ లైఫ్ వంటివాటికి దూరంగా ఉండాలి."

వీటన్నిటికీ బానిసయిన నూర్జహాన్ ప్రథమస్థానాన్ని నిలుపుకుని ఉండేది కాదని లతా అభిప్రాయమయితే ఆమె పొరబడిందనే చెప్పాలి. 1971లో యాహ్యాఖాన్ ప్రియురాలిగా రాజకీయంగా అప్రదిష్టపాలయిన నూర్జహాన్ అతి త్వరలోనే పాకిస్తాన్ నంబర్ వన్ గాయనిగా తన పూర్వస్థానాన్ని పొందగలిగింది. అదీ నూర్జహాన్ టేలంట్!

- కమ్యూనికేటర్ ఫీచర్స్

గురించి ఏమీ తెలియదనీ, తన చూడనే లేదనీ చెప్పి ఒప్పించి, పోలీసుల్ని పంపివేశారు.

దాంతో అంతటి భీకర వ్యక్తి మెత్తపడిపోయి కొన్ని రోజుల తర్వాత తిరిగివచ్చి, మాయీ పాదాల మీద పడి "అమ్మా! ఆ రోజున మీరు పోలీసులకి నన్ను అప్పజెప్పి వుంటే, నేనీపాటికి జైల్లో ఖైదీగా బందీ అయివుండే వాడిని. నన్నెందుకని రక్షించాలని అనిపించింది మీకు?" అని దీనంగా ప్రశ్నించాడు.

"నాయనా, నేనిక్కడే వుండవలసినదాన్ని. నిన్నప్పుడు అప్పగించి వుంటే జైలు నించి తిరిగిరాగానే, నాపైనా, ఈ చిన్న పిల్లలపైనా కక్షగట్టి కసి తీర్చుకోకుండా వుండేవాడివా?" అని ఎదురుప్రశ్న వేశారు మాయీ.

" నన్ను రక్షించిన కరుణామయీ మాయీ! ఇకపైన, నేను ఈ చుట్టుపక్కల తిరుగుతూనే వుంటాను. మీలో ఎవ్వరిపైనా ఈగనైనా వాలనీయను. నిశ్చింతగా వుండండి." అని వాగ్దానం చేశాడతను. చెప్పిన ప్రకారంగానే, అక్కడ ఆ కుటుంబం నివసించినంత కాలం వాళ్లందర్నీ కంటికి రెప్పలా కాపాడేవాడు. ఆపత్కాలంలో దేవుడే అలా ప్రతీజీవికీ, ఏదో రూపాన, ఏదో విధాన సహాయం చేస్తూ వుంటాడనిపిస్తుంది ఇలాంటి సందర్భాలలో.

ఇంటి దగ్గర ఆలయంలోనే చిన్న లత, తన కోసం తనే బిగ్గరగా పాడుతూ, ప్రారంభ శిక్షణ ఇచ్చుకునేది. పూజారి వచ్చి, కోప్పడి వారించినా అతను వెళ్లిపోగానే, మళ్లీ సంగీతాభ్యాసం ప్రారంభించేది. ఆమె ఆనాటి దీక్షా, శ్రద్ధా, పట్టుదలా తోడై ఆమె అనన్య ప్రతిభకి అసామాన్య ప్రభని చేకూర్చి, భవిష్యత్తుని మహోజ్జ్వలంగా రూపొందించి, అపార కీర్తి ప్రతిష్ఠలనీ, అనంతమైన ఐశ్వర్యాన్నీ సంపాదించి ఇచ్చాయి. కృషితో నాస్తి దుర్భిక్షం అనే సూక్తికి "లత" కన్న తగిన ఉపమానం ఎక్కడ దొరుకుతుంది!

-(సశేషం)

## లతా గానలహరి

చిత్రం: అమర్ ప్రేమ్ రచన: ఆనంద్‌బక్షి సంగీతం: ఆర్.డి.బర్మన్

ఆ...
రైనా బీతీ జాయే శ్యామ్ న ఆయే ॥2॥
నిందియా న ఆయే ॥2॥
రైనా బీతీ జాయే శ్యామ్ న ఆయే, రైనా బీతీ జాయే
షామ్ కో భూలా షామ్ క వాదా రే ॥2॥
సంగ్ దియే కే జాగే రాధా
నిందియా న ఆయే ॥2॥
రైనా బీతీ...రైనా బీతీ జాయే
కిస్ సౌతన్ నే రోకీ డగరియే ॥2॥
కిస్ బైరన్ సే లాగీ నజరియా
నిందియా న ఆయే ॥2॥
రైనా బీతీ జాయే ... రైనా బీతీ జాయే
బిరహా కీ మారీ ప్రేమ్ దివానీ ॥2॥
తన్ మన్ ప్యాసా అఖియోఁ మేఁ పానీ
నిందియా న ఆయే ॥2॥
రైనా బీతీ జాయే ...రైనా బీతీ జాయే




## బాణీ ముత్యాలు



ప్రేమనేది ఉన్నదా
అది మానవులకే ఉన్నదా
హృదయముంటే తప్పదా
అది బ్రతుకుకన్నా గొప్పదా

చిత్రం : ప్రేమలు-పెళ్ళిళ్ళు
పాట పల్లవి : మనసు లేని దేవుడు మనిషికెందుకో మనసిచ్చాడు

ఆత్రేయ



మతి తప్పిన కాకుల రొదలో
మౌనమే వెలుగు
దహియించే బాధల మధ్యన
సహనమే వెలుగు

చిత్రం : గోరంతదీపం
పాట పల్లవి : గోరంతదీపం కొండంత వెలుగు

సి.నారాయణరెడ్డి



అయిదుసరుకుల మేళవింపుతో
తొమ్మిది తలుపుల భవనం
అందులోన నివాసం మాని
హంస చేరురా గగనం
తానేలేని సదనంలో తలుపులు ఎందుకురా
తిరిగిరానే రాని పయనంలో పిలుపులు ఎందుకురా

చిత్రం : (కృష్ణ) దేవదాసు
పాట పల్లవి : ఇది నిశీథి సమయం

ఆరుద్ర

సేకరణ : ఎన్.అరవింద, హైదరాబాద్.



పిల్లనగ్రోవికి నిలువెల్ల గాయాలు
అల్లన మోవికి తాకితే గేయాలు

చిత్రం : సప్తపది
పాటపల్లవి : గోవుల్లు తెల్లన

వేటూరి సుందరామమూర్తి



చుట్టమల్లే కష్టమొస్తె కళ్లనీళ్లు పెట్టుకుంటు
కాళ్లు కడిగి స్వాగతించకు
ఒక చిన్ననవ్వు నవ్వి సాగనంపకుండా
లేనిపోని సేవచెయ్యకు

చిత్రం : చిరునవ్వుతో
పాట పల్లవి : సంతోషం సగంబలం హాయిగ నవ్వమ్మా

సిరివెన్నెల సీతారామశాస్త్రి

# హ్యూమర్ బాక్స్



"అయితే మీ ఆయన మరణానిక్కారణం హృదయవేదనేనంటారు"

"నిజం యువరానర్ నాకు హృదయవేదన కలగటం వల్లనే గదా నేను ఆయన మీదికి కత్తిపీట విసిరింది"



"ముద్దాయి ఫిర్యాదిని కొట్టేటప్పుడు అక్కడే వున్నానన్నావు గదా, సాయం చేసి ఎందుకు ఇద్దర్నీ విడదీయలేదు?"

"ఆ స్టేజిలో ఎవరు ముద్దాయి అవుతారో ఎవరు ఫిర్యాది అవుతారో ఎలా నిర్ణయించగలం యువరానర్"



ఓ మత ప్రచారకుడు బోధిస్తున్నాడు.

"ఇంకొన్ని రోజుల్లో అష్టగ్రహ కూటమి రాబోతున్నది. అప్పుడు ఈ ప్రపంచం అంతమైపోతుంది"

వింటున్న తాగుబోతు "పోతేపోయిందిలే స్వామీ. ఈ వెధవ ప్రపంచం లేకపోతే బ్రతకలేమా ఏమిటి?" అంటూ లేచిపోయాడు.

"నెల రోజుల్లో విరిగిన మీ కాలు బాగుచేసి నడిచేట్లు చేస్తానన్నాను. ఇప్పుడు మీరు శుభ్రంగా నడుస్తున్నారు చూశారా!"

"మీ బిల్లు చెల్లించడానికి కారు అమ్మాను గదా. ఇంక నడవక చస్తానా"



**ఈ జోక్‌లను పంపినవారు :**
**సి.హెచ్.బృందావనరావు, విజయవాడ.**



"డాళింగ్! మన ప్రేమ వివాహానికి మన పెద్దలు అంగీకరించకపోతే ఆత్మహత్య చేసుకుందాం"

"నేను ఆ విషయం ముందే గ్రహించి నా ఆత్మను ఏనాడో హత్య చేసాను కూడా..."



"డియర్! మనపెళ్లి అన్ని తరాల వారికి ఆదర్శం కావాలి"

"అంటే...ఏం, చేద్దాం?"

"సింపుల్. మన పెళ్లి మన పిల్లల సమక్షంలో మన పెద్దల దీవెనలతో చేసుకుందాం".

"సార్ ! మీ దగ్గర ఏదైనా ఓ మంచి పేరుంటే అమ్ముతారా ?"

"అదేంటి అలా అడుగుతున్నావ్...ఆశ్చర్యంగా వుందే!?"

"మరేం లేదు సార్, మా డాడీ మీలాంటి పెద్దల దగ్గర మంచి పేరు తెచ్చుకోవాలి అన్నారు. అందుకని..."



**ఈ జోకులను పంపినవారు బి.వి.ఎస్.బాబు, తెనాలి.**

"మీరీ మధ్య రిలీజయిన ఓ సిన్మాలో ఛండాలమైన సీన్లన్నీ అస్సలు కత్తిరించకుండా వదిలేసారు...ఓ సెన్సార్ సభ్యుడిగా ఏమిటి మీ సంజాయిషీ?" అడిగాడు విలేఖరి.

"ఆ నిర్మాత...ఆ సిన్మాని మా సెన్సార్ బోర్డు సభ్యులకి అంకితమిచ్చేసారు... మరేం చేయమంటారు?" విసుక్కున్నాడు సెన్సారు సభ్యుడు.



## హ్యూమర్ బాక్స్

అజ్ఞాత ప్రేమికుడు ఫోన్ చేసాడు లలితకి.
"హలో...బావున్నారా" అంటూ
"లేరండి...బయటికి వెళ్లారు!" అని ఫోన్ పెట్టేసింది లలిత- వాళ్ల బావగారు బయటికి వెళ్లిన సంగతి గుర్తొచ్చి!





"ఏ నేరమూ చేయకుండా జీవితాంతం జైల్లోనే మగ్గిపోయే వ్యక్తినేమనాలి?"
"జైలర్ అనాలి"

"అదేంటి రాంబాబు... నువ్ నాకు ఐలవ్‌యూ చెబుతూ కన్నీళ్లు పెట్టుకుంటున్నావ్... ఆనందబాష్పాలా?"
"ఆనంద బాష్పాలు కాదు ఉషశ్రీ... కన్నీళ్లే...ఇవాళ్టి వరకూ భరించిన చెంప దెబ్బలు పాతిక....ఈ రోజు ఇంకెన్ని భరించాలోనని!''
అన్నాడు రాంబాబు తన బుగ్గల్ని రెండు చేతుల్లో దాచేసుకుంటూ.



"నా కోసం ప్రాణాల్నైనా త్యాగం చేస్తావా డియర్?"
"లేదు డాళింగ్...చచ్చాక స్వర్గంలో లభించే ఆ రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ కంటే నువ్వే బావుంటావుగా అందుకని అలాంటి పిచ్చిపని ఛస్తే చెయ్యను"



ఈ జోకులను పంపినవారు లకనం మూర్తి, కాకినాడ.

"నువ్వు ఎగురవేసిన గాలిపటం ఏకంగా ఆకాశాన్ని తాకుతున్నట్లు ఎగురతుందేమిట్రా?"
"మన షాపులోని ధరలు ఆ గాలిపటం మీద వ్రాసానులే, నాన్న!"



"అస్సలు డాన్స్ రాదంటూనే చక్కగా డ్యాన్స్ చేసి అతిథులనందర్నీ మెప్పించడం నిజంగా అపూర్వం"
"అది సర్లెండి... యింతకీ నా ప్యాంట్‌లో బొద్దింకల్ని వడేసిన వాడెవడు?"



ఈ జోకులను పంపిన వారు బచ్చు వీర్రాజు, రాజమండ్రి

ఒక టాక్సీ డ్రయివరు చాలా స్పీడుగా కారు నడుపుతున్నాడు. టర్నింగులో కూడా అదే , స్పీడు....ఆ కారులో కూర్చున్న ఓ పెద్దాయన చూసి చూసి ఇలా అన్నాడు " కనీసం టర్నింగులోనైనా స్పీడు తగ్గించవయ్యా! భయం వేసి ఛస్తున్నాం"
డ్రయివరు: "భయమైతే చక్కా కళ్లు మూసేసుకోండి...నాలాగ"



"బంగారం తులం రూ॥100/-, నెయ్యి రూ॥ 10/- కిలో, గోధుమపిండి కిలో రూ॥ 2/-, కొత్త మోటారుబైక్ రూ॥ 1000/- అదీ నెలకి 100/- చొప్పున ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో..."
"నిజంగానా! ఎక్కడండి? ఏ దేశంలో"
"ఎక్కడా లేదు, కనీసం ఊహల్లోనైనా ఆలోచిస్తే తప్పేముంది?"



"అబ్బాయ్! నీవు పెద్దయ్యాక ఏం చేస్తావ్?"
"సైన్యంలో చేరాలని అనుకుంటున్నానండీ..."
"మరి శత్రువులు పట్టుకుని చంపేస్తానంటే...."
"శత్రువుల్లో చేరిపోతా!"



ఈ జోకులను పంపినవారు జి.బిలక్ష్మి, హైదరాబాద్.



# బాపు విశ్వరూపం 17

ఇండియన్ సినిమాల కన్నిటికీ పాటలు ప్రాణం. వెస్టర్న్ సినిమాలలో అయితే మ్యూజికల్స్ ఉంటాయి, లేదా పాటల్లేని మామూలు సినిమాలుంటాయి. కానీ ఏ సబ్జెక్ట్‌కి సంబంధించినా, మన సినిమాలలో పాటలు తప్పనిసరి. పాటల సాహిత్యం, సంగీతంతో బాటు చిత్రీకరణకు కూడా ఎంతో ప్రాధాన్యం ఉంది. పాటలు బాగా చిత్రీకరించ గలిగే దర్శకుడిని ప్రత్యేకంగా పేర్కొనడం మన ఆనవాయితీ.

బాపు, రమణల సినిమాలలో పాటలకు ఓ ప్రత్యేకస్థానం ఉంది, వాటి చిత్రీకరణకు కూడా. చిత్రకారుడైన బాపు తొలిసారిగా మెగాఫోన్ చేపట్టినప్పుడు ఎంచుకున్నది పాట చిత్రీకరణే! 'సాక్షి'లోని 'అమ్మ కడుపు చల్లగా, అత్త కడుపు చల్లగా' పాట పిక్చరైజేషన్ తో బాపు చలనచిత్రరంగ ఆరంగేట్రం జరిగింది. రికార్డుటైములో (ఆ రికార్డును బాపు కూడా మళ్లీ బ్రేక్ చేయలేదు) ఆ ఆరు నిమిషాల పాటను మూడుగంటల్లో ఎలా పిక్చరైజ్ చేయగలిగారని అడిగితే 'ఇగ్నొరెన్స్ ఈజ్ బ్లిస్' అని నవ్వేశారు బాపు.

బాపు తీసిన పాటలు ఎందుకంత బాగుంటాయో క్లూ ఇవ్వడం జరుగుతోంది. ఆయన ప్రతీ ఫ్రేమునూ ముందే ఆర్టిస్ట్ ఎక్స్‌ప్రెషన్‌తో సహా బొమ్మ వేసి పెట్టుకుంటారు. దాన్నే తెరకెక్కిస్తారు. ప్రపంచంలో ఇలా చేసేవారు - రష్యన్ డైరక్టరు కీ॥శే॥ ఐసెన్‌స్టీన్, బెంగాలీ దర్శకుడు కీ॥శే॥ సత్యజిత్ రాయ్, బాపు, ఈ ముగ్గురే అట!

ఉదాహరణకి 'మిస్టర్ పెళ్లాం'లోని మొదట వచ్చే పద్యం తీసుకోండి. దాన్ని బాపు మనసులో ఎలా రూపొందించుకున్నారో ఆయన గీసుకున్న బొమ్మలు చూడండి. ఇవన్నీ తెరపై ఎలా అనువదింపబడ్డాయో ఈ సంచికలోనే ఉన్న బాపురమణీయం శీర్షికలో చూడవచ్చు.

ఈ విధమైన పద్ధతుల వల్ల నటీనటులు, టెక్నీషియన్లు దర్శకుని భావాన్ని సులభంగా గ్రహించగలరనీ, అందుకనే బాపు తీసిన పాటలు అంత బాగుంటాయని మనం అనుకుంటాం కానీ బాపుగారు ఒప్పుకోరు. 'తక్కిన దర్శకులు మాత్రం చక్కగా తీయడం లేదా, ఏదో నాకు బొమ్మలు వచ్చు కాబట్టి అలా వేసి చూసుకుంటున్నాను. వాళ్లు ఇటువంటివి ఏవీ అక్కర్లేకుండానే తీసి చూపిస్తున్నారు." అంటారు. దటీజ్ బాపు!



# ఇంద్ర



- కండ్లకుంట శరత్‌చంద్ర

ట్రింగ్‌ట్రింగ్...! ట్రింగ్‌ట్రింగ్‌ట్రింగ్...!!

"ఒరేయ్...! ఇక్కడ అనిల్‌గాడ్ని సైకిల్ కుమ్మింది. త్వరగారా!" అన్నాడు భార్గవరాయుడు అవతలి నుండి.

"ఇంతకూ... ఏ ఆసుపత్రిలో వేసారో చెప్పిచావు." అన్నాను.

"నిజామ్స్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో... వార్డ్ నెంబర్ 15."

"నిమ్స్ అని చావొచ్చుగా! అంతగా దీర్ఘం తియ్యాలా...! సరే.. ఇప్పుడే ఓ రెండు మూడు గంటల్లో వచ్చేస్తా." అన్నాను.

"ఇక్కడికి రావడానికి... మూడు గంటలెందుకు?"

"ఒరేయ్ పిచ్చిమాలోకం! నేను, మూడు బస్సులు మారి రావాలి. ఒక్కొక్కస్టాపులో అధమపక్షం అరగంటైనా... బస్సు కోసం వేచి చూడాలి. నువ్వు పెట్టెయ్యి." అని చెప్పి ఈ మూడు గంటల కాలక్షేపం కోసం 'తెలుగు సాహిత్యంపై సమగ్ర పరిశీలన!' అనేపుస్తకాన్ని తీసుకుని, అవతలికి నడిచాను.

* * *

బస్టాపులో ఇద్దరమ్మాయిలు, ఓ వయసు మళ్లినావిడ, ఓ కుర్రాడు... బస్ కోసం వేచియున్నారు... పాపం నాలాగే అమాయకులు.

నేను వారిని పట్టించుకోకుండా... నా పుస్తకాన్ని తెరిచి అందులో మునిగాను. అధమపక్షం... ఓ పావుగంట గడిచుంటుంది. ఆ కుర్రాడు నా వెనకవచ్చి నిలబడి, నేను చదువుతున్న పుస్తకంలోనికి తొంగిచూసాడు.

"వ్వా... ట్! తెలుగు పుస్తకం రీడ్ చేస్తున్నారా... షేమ్‌షేమ్!" అన్నాడు గట్టిగా. నేను ఛటుక్కున వెనక్కి తిరిగి, వాడి చెంప పగలగొట్టి ఆనందిద్దామనుకుని

"ఏంబాబూ...! తెలుగు పుస్తకం చదవకూడదని... కొత్తగా ఏదైనా... ఆర్డినెన్స్ వేసారా...! అలాంటిదేమైనా వుంటే... దినపత్రికలలో వచ్చేదిగదా! నేను... ప్రతిరోజూ... క్రమం తప్పకుండా దినపత్రిక చదువుతానే! అలాంటి ఆర్డినెన్సేమీ... రాలేదే!!" అన్నాను మొహం అమాయకంగా పెట్టి.

"హవ్వ...! హవ్వ...! వెరీ... వెరీ... బ్యాడ్...! ట్వంటీఫస్ట్ సెంచరీలో.... ఇంకా దినపత్రిక, దినపత్రిక... అంటూ... టెల్గుపేపర్ చదువుతారా!" అన్నాడా కుర్రాడు మహదాశ్చర్యంగా.

వాడికి సమాధానం చెప్పేలోగానే... సిటీబస్ దూసుకురావడం... నేను, పుస్తకాన్ని చంకలో పెట్టుకుని... పి.టి.ఉషలా పరుగెత్తి, జాంటీరోడ్స్‌లా గెంతి, కడ్డీని దొరకబుచ్చుకుని, బల్లిలా లోపలికి పాకడం జరిపోయాయి.

'కుంజరయూథంబు దోమకుత్తుకజొచ్చెన్!' అంటే ఏమిటో రాయల వారికి, 'ఎలుకలు తమ కలుగులోనికి ఏనుగునీడ్చెన్!!' అని సమస్యాపూరణం ఇచ్చిన ఓ రాజా వారికి, ఈ సిటీబస్ చూస్తే... 'సమాధానం' ప్రత్యక్షంగా అర్థమౌతుంది. ఈ బస్సులో నిలబడ్డాక ఏ కడ్డీని ఆధారంగా పట్టుకోవాల్సినవసరం లేదు. నా చుట్టూ... ఆ మాటకొస్తే... ప్రతి ఒక్కరి చుట్టూ మిగతావారు అష్టదిగ్బంధనంలా అమరివున్నారు.

నేను, పుస్తకం తెరిచి.... మళ్లీ అందులో మునిగాను. అందులోని భావాలను ఆస్వాదిస్తూ... ఆనంద పారవశ్యంలో తేలిపోతుండగా... నాచుట్టూ నిలబడున్నవారు ఆ పుస్తకంలోనికి ఒకేసారి తొంగిచూడడం... ఒకేసారి గతుక్కుమనడం జరిగింది.

ఎనిమిదవ ప్రపంచ వింతను చూస్తున్నట్లు... మూడవ ప్రపంచ యుద్ధం జరిగి... బంగ్లాదేశ్ ఏకఛత్రాధిపత్యం వహిస్తున్నట్లు.... నా వైపు చూడడంతో... ఈ సారి వాళ్ళందరి కళ్ళూ నీమరేగు పండ్లంత లావయ్యాయి.

"ఇదేంటండీ... వండర్ కాకపోతే...!

2003లో తెలుగుబుక్ రీడ్ చేస్తున్నారు."

"ఛ!చ! వెరీ... బ్యాడ్!"

"ఏంట్సార్...! ఇలా తెలుగు సాహిత్యం గురించిన చెత్త చదువుతున్నారు. ఛ! చ!" అన్నాడొకడు, వాడి నెల జీతాన్ని నేను లాక్కుపోతున్నానేమో అన్నంత ఆవేశంగా.

"ఏం...! చదవొద్దా...!!" అన్నానేను.

"అదేంట్సార్...! కావాలంటే... ఇంగ్లీష్‌బుక్స్ చదవండి." అన్నాడో పెద్దమనిషి.

"అది చదివినా చదవకపోయినా ఫరవాలేదు. కానీ... మీరు తెలుగుపుస్తకం చదవకూడదు. ఎందుకంటే... ప్రపంచమంతా ఇంగ్లీష్‌వైపు వరుగెత్తుతోంది. మన భారతదేశంలో... అందులోనూ... మన ఆంధ్రప్రదేశ్... ఇంగ్లీష్ వాడకంలో ముందంజలో వుంది." అన్నాడతడు. ఎవరో నా చేతిలోని పుస్తకాన్ని లాక్కున్నారు. నాపుస్తకం బస్సంతా తిరుగుతోంది.

దేవుడు నాపై జాలి చూపించి... నేను దిగాల్సిన స్టాపును రప్పించడంతో.... 'చావలేదు... జీవుడా!' అనుకుంటూ బస్ దిగాను.

ఎవరో... కిటికీలో నుండి నా పుస్తకాన్ని, నామొహానికేసి విసిరి "హలో... మాస్టారూ...! డోన్ట్ రీడ్ టెల్గూ బుక్స్. నాలెడ్జ్ ఇంప్రూవ్ చేసుకోవాలనుకుంటే... ఎంగి...లీషు... రీడ్ చేయండి!" అన్నారు నవ్వుతూ.

పుస్తకాన్ని చేతిలోనికి తీసుకున్నాను. బస్సు తుర్రుమంది. 'హమ్మో...! ఇంకా నయం. ఈ రోజు ఆదివారం కాబట్టి సరిపోయింది. లేకపోతే... చాలామంది భావిభారత పౌరులు ఎక్కుండేవారు. నన్నొక డైనోసారస్‌లా చూసుండేవారు(అంటే అంతరించిపోయిన జీవన్నమాట!) అని అనుకుంటూ నిమ్స్ దారిపట్టాను.

* * *

ఎలాగైతేనేం... మొత్తం మీద నిమ్స్ ఆసుపత్రికి చేరాను.

"మావా...!" నన్ను చూడగానే అనిల్‌గాడు, బ్యారుమన్నాడు.

వాడిచుట్టూ... భార్గవరాయుడు, బఠాణీ గింజల ప్రసాద్, తెల్లమల్లికార్జున్, అశోక్... ఇత్యాది జీవులన్నీ కూర్చుని క్యారు క్యారుమంటున్నాయి.

నేను, అనిల్ దగ్గరకు వెళ్ళి కూర్చున్నాను.

వాడు నోరు తెరవబోతుంటే, అశోక్ వాడి నోరు ఛటుక్కున మూసి, "కాచిగూడలో, చిరంజీవి నటించిన 'ఇంద్ర' సినిమాలో వేసిన స్పెషల్‌స్టెప్పు పోస్టర్‌ను అతికించారు గదా! వీడు... చిరంజీవి వీరాభిమాని గదా! ఆ పోస్టర్‌ను చూస్తూ... రోడ్డు మధ్యలో నిల్చున్నాడు. వీడి అదృష్టం బావుండి... ఏ స్కూటరో, కారో వచ్చి డాష్ ఇవ్వకుండా... సైకిల్ వచ్చి డొక్కలో కుమ్మింది!" అన్నాడు.

"లోపల అవయవాలు స్థానభ్రంశం చెందాయట! అందుకే.... ఓ ఎనిమిది ఆపరేషన్లు చెయ్యాలట! వీడ్ని పాతిక రోజులు



ఇక్కడే వుంచాలట! తెల్లగుడ్డ లేసుకుంటాడు చూడూ... ఆయన చెప్పాడు." అన్నాడు తెల్లమల్లికార్జున్.

"ఒరేయ్...! నువ్విక్కడ వీడికి తోడుగా వుండు. వేం బయటకెళ్ళి సాంబారు తాగివస్తాం." చెప్పాడు ప్రసాద్.

వాడికి ఒక్క ఇడ్లీకి నాలుగు కప్పుల సాంబారు తెప్పించుకుతాగడం అలవాటు. అందుకే... ఇడ్లీ తినొస్తాం అనే బదులు సాంబారు తాగొస్తాం అంటుంటాడు.

అందరూ కట్టగట్టుకుని అవతలికి వెళ్లారు. అనిల్‌గాడు బేలచూపులు చూస్తున్నాడు.

"ఒరేయ్...! నోర్మూసుకుని నిద్రపో!" అన్నాను.

వాడు బుద్ధిమంతుడిలా తలూపి, ఛటుక్కున కళ్ళు మూసుకున్నాడు. నేను పుస్తకం చదువుకోసాగాను.

అంతలో ఓ నర్సు లోపలికొచ్చి, అనిల్ వైపు మామూలుగానూ, నా వైపు 'తెలుగు' పుస్తకం చదువుతున్నందుకు అదో మాదిరిగానూ చూసింది.

"వ్వాట్...! టెల్గు... బుక్...! వాటె.... వండర్!" అంది.

"మీరు... ఇంతకుముందు ఫలానా టీవిలో... 'కిక్కిరి బిక్కిరిఖై!' అనే ప్రోగ్రామ్‌కు ఏంకర్‌గా పనిచేసారు కదూ...!" అన్నాను, ఆమెవైపు మిర్రిమిర్రి చూస్తూ.

"అది నేను కాదు. మా సిస్టర్! మేము 'హలో సిస్టర్స్!'" అంది.

"అంటే...?!?!"

"మీకు సినిమా నాలెడ్జ్ లేనట్లుందే! అంటే... ట్విన్స్‌మన్నమాట. అవునూ... మీరు టి.వి. బాగా చూస్తారా!"

"వార్తలు మాత్రం చూస్తాను."

"మరి... కిక్కిరిబిక్కిరిఖైలో మా చెల్లాయిని



ఎలా గుర్తుంచుకున్నారు?" అంది. "వార్తల మధ్యలో ప్రకటనలు వస్తాయి గదా! మీ చెల్లాయ్‌ వచ్చి, తెంగ్లం మీలాగే మాట్లాడుతుంది." అన్నాను.

"తెంగ్లం...! అంటే?!"

"అంటే... తెలుగు+ఆంగ్లం అన్నమాట!" చెప్పాను.

"మీతో మాట్లాడుతుంటే... నా హెడ్ తిరుగుతోంది." అంది.

"ఏం?" అడిగాను.

"మీ ప్యూర్ టెల్గుతో... నేనస్సలు ఎడ్జెస్ట్ కాలేను. అంది

"మీది ఆంధ్రప్రదేశ్‌కాదా...?!" అడిగాను.

"వైనాట్ అనకాపల్లి నా బర్త్‌ప్లేస్, అమలాపురంలో ఎడ్యుకేషన్, హైడ్రా.. బ్యాడ్‌లో జాబ్" అంది.

ఈ వాక్యంలో తెలుగు మాటలెన్ని... ఇంగ్లీషు మాటలెన్ని? ఆలోచిస్తూ వుంటే ఇవాళ మనం మన తెలుగు వాళ్ళు మాట్లాడుతున్న భాషలో అధికశాతం ఇలాగే ఉందికదూ అని అనిపించింది.

ఒక్కసారిగా ఈ భూగోళం... తిరుగుతున్నట్లనిపించింది!

* * *

నేను ఆసుపత్రినుండి బయటికి నడిచాను.

టీ తాగుదామని ఓ హోటల్ కెళ్ళి కూర్చున్నాను.

నా ఎదురుగా ఓ వ్యక్తి కూర్చుని ఏదో 'విచిత్రమైన' పదార్థాన్ని చిత్రవిచిత్రంగా తింటున్నాడు.

వెయిటర్ నా దగ్గరకొచ్చి, విచిత్రంగా కళ్ళెగరేసాడు.

'.... ఛాయ్!!" అన్నాను.

ఆశ్చర్యం...! మహదాశ్చర్యం...!!!

హోటల్‌లో కూర్చుని వున్న ప్రతిజీవీ... నా వైపే మళ్ళింది.

నేనేమన్నాననీ... ఓ ఛాయ్... అన్నానంతే!

హైదరాబాద్‌లో, టీ తీసుకురమ్మంటే... వింతగా చూస్తారు. ఛాయ్‌తే! అంటే గానీ... వాళ్ళకు అర్థం కాదు. నేను సరిగ్గానే చెప్పానే!!

"చెప్పానుగా! అలా గుడ్లప్పగించి... మిర్రిమిర్రి చూస్తావేం! ఓ ఛాయ్!" మళ్ళీ అన్నాను.

ఈసారి జనాలందరూ మరింత విచిత్రంగా చూస్తూ నా దగ్గరికొచ్చి నిలబడ్డారు.

నాకెందుకో కాస్త భయమేసింది.







నాకు ఎదురుగా కూర్చున్నాయనే, "ఏమివాయ్...! అట్లా... ప్యూర్ టెల్గుదా మాట్లాడ్తాండావు. ఉనక్కు... ఇంద్ర, ఇమిళ, ఇన్నడ... తెరియుమా! ఛాయ్... అంటా ఉండావేంది." అన్నాడు.

నేను జుట్టు పీక్కుని, 'బాబూ...! ఏమివాయ్... అంటూ 'కన్యాశుల్కం'లో వెంకటేశాన్ని, గిరీశం పిలిచినట్లు బాగానే పిల్చావుగానీ... మీరేం మాట్లాడ్తున్నారో నాకర్థం కాలేదు.

"అసలు... మీరంతా ఎందుకు... నా చుట్టుమూగారు? నావైపు వింతగా ఎందుకు చూస్తున్నారు?!" అన్నాను.

"నువ్వు ప్యూర్‌టెల్గు... అదే... ఆంధ్ర ముదా స్పీకుతుంటివి! అందుకే సర్‌ప్రైజ్ అవుతుండాము. ఉనక్కు 'ఇంద్ర' తెరియుమా?" అన్నాడింకొకడు.

నేను, రెండు చేతులూ జోడించి, 'అయ్యా! మీరిలా అరవం, ఆంగ్లం, తెలుగు కలిపి మాట్లాడకండి. 'టీ' చెయ్యమంటే... నూనె, ఉప్పు, మెంతులపొడి వేసి చేసినట్లుంది... మీ భాష!" అన్నాను.

వాళ్లందరూ మొహామొహాలు చూసుకున్నారు.

అంతటితో ఊరుకోక, మళ్ళీ నేనే, "మీరంతా తమిళనాడు నుండి మా ఆంధ్రప్రదేశ్‌కు వలస వచ్చినట్లున్నారు. మీ భాషతో నన్ను హింసించకండి. మధ్యమధ్యలో... 'ఇంద్ర' 'ఇంద్ర'... చిరంజీవి సినిమా పేరు జపిస్తున్నారేం!" అన్నాను.

నా ముందు కూర్చున్నతను, ముందుకు వంగి నాకో 'లెంపకాయ' ప్రసాదించాడు. నేను కెవ్వుమన్నాను.

నా పక్కనున్న వ్యక్తి, "చూడండి! మీరు ఎక్కడో... ఫారెన్స్ ప్రాంతాల నుండి వచ్చినట్లున్నారు. నౌ.... ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక... మూడు స్టేట్స్... మిక్సయిపోయాయి. ఇప్పుడు మన స్టేట్‌పేరు.... ఇంద్రకర్ణాడు!" అన్నాడు.

నేను గుడ్లు తేలేసి, "హేమి... టీ! మూడు స్టేట్సూ మిక్సయ్యాయా! నాకు తెలియకుండా ఎప్పుడు కలిసిపోయాయివి! కొంపదీసి... మీరంతా పిచ్చాసుపత్రి నుండి తప్పించుకొచ్చారా!" అన్నాను.

అక్కడున్న వాళ్ళలో ఓ పెద్ద మనిషి, క్యాలెండర్ వైపు చూపించాడు. '2050' అని వుంది.

"ఇది... 2003 కదా!"అన్నాను

"అదే దీ సంగతి! మీరు 2003లో నిద్రపోయి... బహుశా ఈరోజే లేచుంటారు, మీకు చాలా చెప్పాలయితే! ఇంగ్లీష్ లాంగ్వేజ్

ఫోర్స్ బాగా డెవలప్ అవ్వడంతో... 'ఇంగ్లీషు'లోని 'ఇం'ను, 'ఆంధ్ర'లోని 'ద్ర'ను కలిపి 'ఇంద్ర' అనే కొత్త భాషను తయారు చేసారు. అలాగే... తమిళానికి, కన్నడానికి ఇంగ్లీషును కలిపి ఇమిళ, ఇన్నడ భాషలను రూపొందించారు. ఒకప్పుడెప్పుడో... బహుశా 1953లో అనుకుంటాను... భాషాప్రాతిపదికన తమిళనాడు, ఆంధ్ర రాష్ట్రాలు ఏర్పడ్డాయి.

ఇప్పుడు మూడు రాష్ట్రాలలోనూ... 'ఇంగ్లీష్' కామన్ లాంగ్వేజి కాబట్టి... అదే భాషా ప్రాతిపదికన... మూడు రాష్ట్రాలనూ కలిపి... ఇంద్ర కర్ణాడుగా రాష్ట్రాన్ని ఏర్పరిచారు."

నేను, నోరు తెరుచుకుని అతడు చెప్పేది విన్నాను.

"అసలిదంతా... ఎందుకుజరిగింది? ఈ భాషా మార్పిడి ఆమోదానికి కారణం ఏంటి?"

"దీని సంగతేంటో... తెలుగు అకాడమికి వెళ్ళి తేల్చుకుంటాను." అన్నాను ఆక్రోషంగా.

"ఏమిటీ... తెగులు అకాడమా! అదెక్కడుంది?" అని పక్కనున్న వాడివైపు తిరిగి, "ఏరా...! వేరీజ్... తెగులు అకాడమీ?" అన్నాడు.

"ఇంకోసారి... తెగులు అన్నారంటే... మర్యాద దక్కదు. తెలుగు అనండి!" అన్నాను.

వాళ్ళందరూ 'ఇంద్ర' నవ్వు నవ్వుకున్నారు.

"ఒరేయ్! టెల్గూ అకాడమి అంటే ... 'ఇంద్ర' అకాడమి రా!" అన్నాడు ఇంకొకడు.

నేను గబగబా ఇవతలికొచ్చాను. బయట ఆటోలు లేవు. రంగురంగుల బస్సులూ, టాక్సీలు వున్నాయి. ఆ బస్సుల మొహానికేసి చూద్దును గదా...!

Black కుంట, Red దర్వాజా!, Fourమినార్... ఇలా ఇంగ్లీషు, ఆంధ్ర భాషల్లో కలిపి... అంటే 'ఇంద్ర' భాషలో వున్నాయి. అవేవీ నాకు అర్థం కావడం లేదు.

ఇక తప్పదన్నట్లు 'టాక్సీ!' అరిచాను.

ఓ టాక్సీ వచ్చి, నా ముందు ఆగింది. 'ఇంద్ర అకాడమికి తీసుకెళ్ళు!' అన్నాను. "ఛీ... ఛీ...! అలా స్పీకొద్దు. Could you take me to ఇంద్ర అకాడమి? అనాలి. అలా అంటేనే ..... I'll come" అన్నాడు టాక్సీవాడు.

ఇక తప్పదన్నట్లు అలాగే ... స్పీకాను చచ్చినట్టు....

"అఘ్గదీ...! సిట్!" అంటూ తలుపు తెరిచాడతను.

పావుగంట తర్వాత టాక్సీ ఆగింది. వాడికి డబ్బులిచ్చి పంపేసి, వెనక్కి తిరిగాను. ఇంద్ర భవనం అగుపించింది. దానిముందు ENDRA అకాడమి!' అని నీలం రంగు అక్షరాల్లో పెద్ద.....గా... రాసుంది. నేను ఆలస్యం చెయ్యకుండా లోపలికి నడిచాను. లోపల పెద్ద పెద్ద గదులున్నాయి. జీవాలన్నీ కంప్యూటర్ ముందు కూర్చుని కీబోర్డును టకటక లాడిస్తున్నాయి. ఆఫీసులోని బోర్డులన్నీ ఇంద్ర భాషలోనే వ్రాయబడున్నాయి. నేను, చివర కూర్చున్నావిడ దగ్గరకు వెళ్ళి నిలబడ్డాను.

ఆవిడ, తలెత్తి నావైపు చూసేట్లులేదు.




"అమ్మగారూ...! మీ దృష్టిని... ఇటు సారిస్తారా!" అన్నాను.

ఆమె, ఏదో విద్యుద్ఘాతం తగిలినట్లు విలవిలలాడుతూ నావైపు చూసి "తె... లు... గు! తె... లు... గు!" అంది.

"ఆఁ...! తెలుగే మాట్లాడుతున్నాను! ఏమిటండీ... ఈ దారుణం. ఇంగ్లీష్‌ను, ఆంధ్రమును కలిపి 'ఇంద్ర'గా మారుస్తుంటే... మీరంతా చూస్తూ ఎలా ఊరుకున్నారు?! దేశ భాషలందు తెలుగు లెస్స అని తెలీదూ...!" అన్నాను.

అందరూ, పనులు మానేసి నావైపు వింతగా చూసారు.

"లుక్...! మీతో ... టెల్గులో స్పీకేవాళ్ళు... హియర్... ఎవరూ... నో!" అంది.

"పోనీ... పూర్తిగా ఇంగ్లీష్‌లో మాట్లాడుకుందాం!" అన్నాను.

"అదిక్కడెవ్వరికీ... డోన్ట్‌నో!" అంది.

నేను జుట్టు పీక్కున్నాను.

"మీరు హెయిర్ ఎంత పీక్కున్నా... జరిగేదేంనో! మేము మీ మీద సింపతీ చూపించి... టెల్గులోనో... ఇంగ్లీష్‌లోనో స్పీకుతామనుకున్నారా! నెవ్వర్...! అస్సలు మాకెవ్వరికీ... టెల్గురాదు! ఇంగ్లీషూ రాదు! వేమందరం ఇంద్ర మీడియంలో చదువుకొచ్చాం. సో... యూపో..!" అంది.

"హు...! ఈ విషయాన్ని సుందరంగారు... చాలా సార్లు కార్టూన్‌లలో గీసారు. అవన్నీ నిజాలని ఇప్పుడిప్పుడే తెలిసొస్తోంది!" అన్నాను.

"యు... మీన్... ఫేమస్ కార్టూనిస్ట్... సుందరం! హి ఈజ్ జీవించే ఉన్నాడ్స్!" అంది. ఎడారిలో మంచినీళ్ళు దొరికినట్లు... హిమాలయాలలో మిర్చీబజ్జీ దొరికినట్లు...



హైజాక్ చేయబడ్డ విమానంలో నుండి తప్పించుకొచ్చినట్లు... ఇలా రకరకాల ఫీలింగులొచ్చాయి. మాకాలం వ్యక్తి... ఒకరు... జీవించున్నారన్నమాట! అనుకుని, "ఆయనెక్కడుంటారు?" అన్నాను.

ఆమె, టకటక కీ బోర్డుని హింసించి, "హిజ్ ఫోన్ నెంబర్... రాస్కోండి. 3A4P14K15D" అంది.

ఇదెక్కడి చోద్యం...!?! ఫోన్ నెంబర్‌లో ఆంగ్ల అక్షరాలున్నాయి?!" అన్నానేను.

"ఎస్...! ఇంగ్లీషు మీద మాకున్న అభిమానం వల్ల... న్యూటెక్నాలజీ డెవలప్ చేసుకున్నాం. టెలిఫోన్ నెంబర్స్‌లో... మా లాంగ్వేజ్ లైకింగ్‌కు సింబల్‌గా.... ఇంగ్లీష్ ఆల్ఫాబెట్స్ ఆల్సో అరేంజ్ చేసుకున్నాం." అంది.

అక్కడ ఇంకో నిమిషముంటే నాకు స్కిజోఫ్రీనియా వస్తుందనిపించి, చకచకా బయటికి నడిచాను.

ఫోన్ చెయ్యగానే, "హలో...! సుందరం హియర్!!" వినిపించింది.

"సుందరం గారూ...! నేనూ... మీ 'కాలం' మనిషిని!! నా పేరు... ఫలానా!" అన్నాను.

"వావ్...! మాకాలం మనిషివా! అయితే మా ఇంటికొచ్చెయ్. మాట్లాడుకుందాం." అన్నారాయన?

"నాకంతా గందరగోళంగా వుంది. మీ ఇల్లు ఎలా కనుక్కోవడం?"

"అయితే... ఇంటికొద్దులే...! బుద్ధా లేక్‌కు వచ్చెయ్!"

"బు... ద్ధా.... లే...క్!! అదెక్కడుంది?!!"

"బుద్ధా లేక్ అంటే.... మన హుసేన్‌సాగర్ అన్నమాట. నీ వెధవ సందేహాలు కట్టిపెట్టి... త్వరగా వచ్చేయ్!!" పెట్టేసారాయన.

నేను టాక్సీ అధిరోహించి, బుద్ధాలేక్ వద్ద వాలాను.

"నమస్తే!" అన్నారెవరో వెనకనుండి.

నేను వెనక్కి తిరిగి, "మి... మి... మీరు..." అన్నాను.

"సుందరం."

"సార్...! మి... మి... మీరూ... నన్నెలా పోల్చుకున్నారు?" అడిగాను.

"నీ బిత్తరచూపులూ, తత్తరపాటూ చూసి!" అన్నారాయన.

'అసలేంటండీ... ఈ దారుణం?! ఈ ఇంద్ర భాష సంగతేమిటి?" అన్నాను. సుందరం, కార్టూన్‌లలో నవ్వుతారే... అలా నవ్వేసి, "నీకు తెలియనిదేముంది చెప్పు. మన ఆంధ్రప్రదేశ్‌లో... ఆంధ్రభాషను తుంగలో తొక్కి, ఇంగ్లీష్ భాష నాట్యం చేయసాగింది. మన భాష యొక్క ఆత్మ గౌరవానికి ముప్పు వాటిల్లింది.

పిల్లల్ని ఇంగ్లీష్ మాధ్యమంలో చదివించకపోతే భవిష్యత్తులో చాలా నష్టపోవాల్సొస్తుందనే భ్రాంతి... తల్లిదండ్రులను భయపెట్టింది. మరికొందరు తెలుగును చిన్నచూపు చూసారు. ఎక్కడ చూసినా, తెలుగు, ఇంగ్లీష్ కలిసి తెంగ్లంలా మాట్లాడేవారి సంఖ్య రోజురోజుకూ పెరిగిపోయింది. 2030వ సంవత్సరానికి... ఈ మార్పు పూర్తిగా వచ్చేసింది. ఇక తప్పదన్నట్లుగా... తెంగ్లాన్ని... 'ఇంద్ర'గా మార్చారు.

ఈ విధానం 2040 వచ్చేసరికి తమిళ, కర్ణాటక రాష్ట్రాలకు సోకింది. 2044లో మూడు రాష్ట్రాలూ కలిసిపోయాయి. ఇప్పుడు ప్రతి పాఠశాలలోనూ... ఇంద్ర, ఇమిళ, ఇన్నడ భాషలు బోధిస్తారు. వీటిలో ఏదో ఒక భాషను... పిల్లలు ఎన్నుకుంటారు." వివరించారు సుందరంగారు.

"ఎన్ని భాషలొచ్చినా... తెలుగుకేం భయంలేదు... అన్నారే కొందరప్పుడు" అన్నాను. సుందరంగారు నవ్వి, "తర్కాలు, వాదనల కంటే... అనుభవం గొప్పది. ఔనా! ఇప్పుడు అనుభవిస్తున్నాంగా! అన్నట్లు... నువ్విక్క డుండాలంటే... కచ్చితంగా 'ఇంద్ర' భాష నేర్చుకోవాలి" అన్నారాయన నావైపు జాలిగా చూస్తూ.

"నేనుండను. నేను ఉత్తర భారతదేశం వెళ్ళిపోతాను. స్వచ్ఛమైన హిందీలో మాట్లాడొచ్చు, ఎంచక్కా!" అన్నాను.

"అదేం కుదరదు. ఇప్పుడక్కడ... హింగ్లీష్ నడుస్తోంది. నువ్వు కచ్చితంగా 'ఇంద్ర' నేర్చుకోవాలి, మరి!" అన్నారాయన.

నాకు మళ్ళీ భూగోళం తిరిగుతున్నట్ట నిపించింది.

"నేను... నేర్చుకోను." అని అరిచాను పడిపోతూ...

* * *

మొహం మీద ఎవరో నీళ్ళు చల్లారు.

నెమ్మదిగా కళ్ళు తెరిచి చుట్టూ చూసాను. మిత్రబృందమంతా నా చుట్టే వుంది. నావైపు మిర్రి మిర్రి చూస్తున్నారందరూ.

'ఏరా... ఏమైంది? అలా పడిపోయావ్!" అన్నాడు అశోక్.

"ను.... ను... నువ్వు... తె... తె... తెలుగు మాట్లాడుతున్నావేంటి? ఇంద్ర కదామాట్లాడాలి" అన్నాను.

"ఇంద్ర సినిమా పదిసార్లు చూసావుగా. ఇంకా దానిగురించే ఆలోచిస్తున్నావా!" అన్నాడు ప్రసాద్, చేతిలోని పత్రికతో, నాకు గాలి విసురుతూ.

ఆ పత్రిక ఛటుక్కున లాక్కుని చూసాను. "ఇదేంటి...? ఈ పత్రిక తెలుగులో వుంది. ఇంద్రభాషలో కదా వుండాలి!" అన్నాను.

"ఒరేయ్ వీడికి రామ్‌గోపాల్‌వర్మ భూత్ ఆవహించిందా!" అన్నాడు భార్గవరాయుడు. ఈ లోగా నర్సు ముందుకొచ్చి "వాట్ హాపెండ్...! అలా... అన్‌కాన్షియస్‌గా పడ్డారేం! ఎనీ సమస్యల్స్!" అంది.

"వా‹...!" నేను మళ్ళీ పడిపోయాను.

ఆ తర్వాతేం జరిగిందో ... 'ఇంద్ర' సాక్షిగా నాకు తెలీదు.

---

## ఘంటసాల క్విజ్ -5 విజేతలు

1. మొదటి బహుమతి - డాక్టర్. సయ్యద్ రహమతుల్లా, పర్లాకిమిడి (ఒరిస్సా)
2. రెండవ బహుమతి - డి.వెంకటరావు, సాలూరు
3. మూడవ బహుమతి - యన్నం వేంకట నర్సిరెడ్డి, ఉప్పలపాడు

**కరెక్టు సమాధానాలు:**

1. తాతమ్మ కల
2. ఋణానుబంధం
3. బహుదూరపు బాటసారి
4. సముద్రాల (జూనియర్)
5. జగ్గయ్య

**బహుమతులు:**

1. మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
2. రెండవ బహుమతి : 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
3. మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.



# అంతేరా... బామ్మర్ది

ఆదివిష్ణు





## జరిగిన కథ



భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ ప్రియుడు వేణుకి నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమకోసం హైదరాబాదులోనే ఉద్యోగం కై చూస్తూంటాడు. అతని బావ రంగనాథం తన బాల్యమిత్రుడు బసవరాజును స్వయంగా కలిసి అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాథాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాథం బసవరాజుపై మండిపడుతూంటాడు. బావగారి పేరు చెప్పకుండా ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళతాడు. బసవరాజు అతన్ని చూసి ఇంప్రెస్ అయి ఉద్యోగం ఇస్తాడు. ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నందుకు ఉగ్రుడైన రంగనాథం వేణుని ఇంట్లోంచి పొమ్మంటాడు. ఆ విషయం బసవరాజుకి చెప్పి బసవరాజు ఇంట్లో తిష్ఠ వేస్తాడు వేణు.

(ఇక చదవండి)

వేణు అనుకున్నట్టుగానే ఆ యింటికి పాణి వచ్చేడు!

అతని చేతిలో పేపరుంది!

వేణుని చూచి 'గుడ్ మార్నింగ్' అన్నాడు పాణి.

వేణు చేతులు జోడించేడు!

పాణి తిన్నగా బసవరాజు గారి గదివేపున నడిచేడు.

ఆ గది ముందు నిలబడి తలుపు తడుతూ 'సార్' అని పిలిచేడు.

తలుపు తెరుచుకుంది.

బసవరాజే తలుపు తెరిచేడు. పాణిని చూస్తూ అడిగేడు -

"ఎనీ న్యూస్?"

"యస్సర్! మీరు తప్పకుండా తెలుసుకోవలసిన వార్త!"

"కమిన్!"

పాణి బసవరాజు గదిలోకి వెళ్లేడు.

ఆ తర్వాత తలుపులు మూసుకున్నాయి.

వేణు ఆ గదివేపు విడ్డూరంగా చూస్తూ నిలబడ్డాడు.

గదిలో -

బసవరాజు సోఫా అలంకరించి వున్నాడు...

పాణి పేపర్ని తెరుస్తున్నాడు.

బసవరాజు కుతూహలంగా అడిగేడు -

"ఏ భాష పేపరో?"

"బెంగాలీ సార్!"

"ఊ... చదువు!"

ఒక వార్తని పాణి బెంగాలీ భాషలో చదివేసేడు.

అతను చదువుతున్నంత సేపూ - బసవరాజు శ్రద్ధగా విన్నాడు.

"అదీ సార్ విషయం!" అన్నాడు పాణి!

"తెలుగులో చెప్పు!"

"మీ లాంటి కోటీశ్వరుడు -"

"పోలికలొద్దు! పేరు - వాడి పేరు చెప్పు"

"బసూ సన్యాల్! బసూ సన్యాల్ అనే కోటీశ్వరుడి దగ్గిర చటర్జీ అనే కారు డ్రైవరు చాలా కాలంగా - ఎంతో నమ్మకంగా పనిచేస్తూ -"

"అంటే? నేను అనే నా దగ్గిర - రంగడు అనే డ్రైవరు మాదిరి అన్నమాట!"

"ఎక్జాట్లీ సార్!"

"ఊ... ఇప్పుడు చెప్పు!"

"కలకత్తా నుండి ఖర్గపూర్‌కి - అయిదు లక్షల రూపాయిల్తో - బసూ సన్యాల్ ప్రయాణం చేస్తున్నాడు. చటర్జీ కారు డ్రైవ్ చేస్తున్నాడు."

పాణి చెబుతున్న ప్రకారం - బసవరాజు కళ్లెదుట దృశ్యం నడుస్తోంది!

సన్యాల్ ఎట్లా ఉంటాడో తెలీదు గనక - సన్యాల్ స్థానంలో బసవరాజున్నాడు!

చటర్జీ బొమ్మ కూడా తనకి తెలీదు గనక - చటర్జీ స్థానంలో రంగడు డ్రైవ్ చేస్తున్నాడు!

పాణి చెబుతున్న ప్రకారం దృశ్యం నడుస్తోంది!

అదొక నిర్మానుష్యమైన రోడ్డు!

తూనీగలాగా పరిగెడుతోంది కారు!

అర్ధరాత్రి దాటి అరగంటయ్యింది!

చటర్జీ సడన్‌గా కారు ఆపేడు!




ఎందుకు ఆపేవని సన్యాల్ అడిగేడు!

ఇంజన్‌కి చిన్న ట్రబులొచ్చిందని చటర్జీ చెప్పేడు!

చటర్జీ కారు దిగి బోనెట్ ఎత్తేడు!

ఎంతసేపటికి పని పూర్తి కాలేదు!

బసూ సన్యాల్ కూడా కారు దిగేడు.

ఇంజన్ దగ్గిరికి వెళ్లి చూస్తున్నాడు!

అదే అదనుగా భావించి చటర్జీ తన యజమాని తలమీద ఇనుపరాడ్‌తో గట్టిగా కొట్టేడు!

ఆ దెబ్బకి -

బసూ సన్యాల్ అక్కడికక్కడే ప్రాణాలు విడిచేడు!

శవాన్నీ కారునీ ఆ నడి రోడ్డు మీదే వదిలేసి - చటర్జీ అనే ఆ డ్రైవరు - కారులో వున్న అయిదు లక్షల పైకం తీసుకుని పారిపోయేడు!

ఇంత వార్త విన్న బసవరాజు తట్టుకోలేకపోయేడు!

అందువల్ల బాగా నీరసపడిపోయి నీరసంగానే అన్నాడు -

"ఈ రాత్రి నేను కూడా - ఏడు లక్షల రూపాయిల్తో కార్లో కడప ప్రయాణం పెట్టుకున్నాను మిస్టర్ పాణి!"

"ఎన్ని లక్షల్తో వెడుతున్నారో తెలీదు గాని - కార్లో కడప వెడుతున్నట్టు నాక్కూడా తెలిసింది సార్!"

"నా కారుని రంగడు డ్రైవ్ చేస్తాడు!"

"నేచురల్లీ సార్!"

"రంగడు మంచి నమ్మకస్థుడు!"

"చటర్జీ కూడా ఆ టైపే సార్!"

"రంగడు కూడా -దారి మధ్యలో కారుని అనవసరంగాఆపి -"

"ఇంజన్ ట్రబులని కారు దిగుతాడు సార్"

బసవరాజు భయంగా అన్నాడు -

"వద్దు! ఆ తర్వాత ఏం జరుగుతుందో నాకు చెప్పద్దు!"

"చెప్పను సార్!"



"తీసేయ్! ఆ రంగా గాడ్ని ఉద్యోగంలోంచి వెంటనే తీసెయ్!"

"అల్లాగే సార్!"

"ఎప్పుడో చంపవలసిన నన్ను - ఇన్నేళ్లూ చంపనందుకు - అతనికి పాతికవేల రూపాయలు నా కానుకగా యిచ్చి యింటికి పంపించు! ఇక నుండి నా కారుకి నేనే డ్రైవర్ని!"

"చాలా మంచి నిర్ణయం సార్!"

"వెళ్లింక! నేచెప్పిన పని మీదుండు!"

"ఒ.కె.సార్!"

అని పాణి ఆ గది నుంచి బయట పడ్డాడు!

* * *

ఆ ఉదయం...

రంగనాథం ఇంట్లో...

గోడవారగా కుర్చీ వేసుకుని - అందులో కూచుని - కాళ్లు రెండూ గోడకి తన్నిపెట్టి అంటున్నాడు రంగనాథం -

"నీకు మా బసివిగాడి సంగతి తెలీదు! కాలాంతకుడేవాడు!"

అన్నపూర్ణమ్మ బియ్యం చెరుగుతోంది. చెరుగుతూనే అన్నది -

"ఆ విషయం ఇన్నేళ్ల తర్వాత ఇప్పుడు తెలిసిందా మీకు?"

"తెలివిగా మాటాడకు! వాడి తత్త్వం నాకు మొదట్నుంచీ తెలుసు!"

"ఎప్పుడూ చెప్పేరు కాదే?"

ఆ మాటకి కోపం వచ్చింది. కుర్చీలోంచి చివాలున లేచి అన్నాడు -

"అవునే! చెప్పకపోవడం నాదే తప్పు! చాలా పెద్ద తప్పు! అసలు నేను చేసేవన్నీ తప్పుడు పనులేగదా? అప్పుడు - ఆ రోజుల్లో - మా కాలేజీ రోజుల్లో - తాయారు విషయంలో కూడా తప్పే చేసేను!"

బియ్యం చెరగడం మాని ఆశ్చర్యంగా అడిగింది అన్నపూర్ణ -

"తాయారా? ఆవిడెవరు?"

"ఎందుకంత కుతూహలంగా అడుగుతున్నావ్?"

"తాళికట్టిన భర్త - పరస్త్రీ పేరు కలవరిస్తుంటే - ఏ భార్య అయినా నాలాగే అడుగుతుంది!"

"పరస్త్రీ అని ఎవరన్నారు? తాయారు మా క్లాసుమేటు!"

"అంటే? క్లాసుమేటులు పరస్త్రీలు కాదా?"

చేతిలో వున్న పుస్తకాన్ని విసిరేసి అన్నాడు-

"కాదు! ఎట్టి పరిస్థితుల్లోనూ కాదు!"

"పోన్లెండి! తాయారుతో ఏం తప్పు చేసేరు?"

"అంటే ఏమిటినీ ఉద్దేశం? తప్పులు చేయడానికే ప్రత్యేకంగా పుట్టిన రవుడీ ముండాకొడుకుననుకుంటున్నావా?"

"బాగుంది చోద్యం! మీరే అన్నారుగా - తప్పు చేసేనని?"

"జడ పట్టుకు లాగితే పెద్ద తప్పయిపోతుందా?"

"అమ్మో! అల్లాంటి పనులు కూడా చేసేవారా?"

"పళ్లు రాలగొడతా! నేను చేసేనంటా వేమిటి?"

"నేను అనలేదు. మీరే అన్నారు!"




"అవునే! ఏదో అనబోయి ఏదో అనడం మా వంశాచారం! మా వంశం మొత్తం - తాత తండ్రుల నుంచీ - ఇదే తంతు!"

"ఆడపిల్ల జడపట్టుకు లాగింది చాలక - వంశాచారమని గొప్పగా చెప్పుకుంటారే - సిగ్గులేకుండా?"

"చంపుతా! జడపట్టుకులాగింది నేను కాదు! ఆ బసివిగాడు! వాడు చేసిన తప్పు నా నెత్తినేసుకోమని బతిమాలితే కాదనలేక సరే అన్నాను! తాయారు జడలాగింది వాడు! లెక్చరర్తో చివాట్లు తిన్నది నేను! అర్థమైందా?"

"తాయారు మంచిది గనక సరిపోయింది! అదేనేనైతే - చెప్పుచ్చుక్కొట్టేదాన్ని!"

"ఎవర్ని?"

"జడలాగిన మనిషిని!"

"తాయారు కూడా అప్పుడు అపనే చేసింది!"

"రామ! రామ! ఒక ఆడపిల్ల చేత చెప్పుదెబ్బలు కూడా తిన్నారా?"

"నరుకుతా! పిచ్చిపిచ్చిగా మాటాడకు! నా జీవితంలో ఇప్పటివరకు నేనెవర్తోనూ చెప్పుదెబ్బలు తినలేదు!"

"తప్పు చేసింది మీరని మీచేత చెప్పించేరన్నారు గదా!"

"చెప్పిన మాట కరెక్టే! జడలాగింది బసివిగాడని తాయారుకి బాగా తెలుసు! అందుకే వాడ్ని కొట్టింది!"

"అలాంటప్పుడు - మీ ఫ్రెండు కోసం ఏదో త్యాగం చేసినట్టు అంత ఉపోద్ఘాతమెందుకు? జడలాగింది అతను. చెప్పుదెబ్బలు తిన్నది అతను! ఇందులో మీ త్యాగమేముంది? బడాయి కాకపోతే!"

అప్పటిగ్గాని రంగనాథానికి మంటెక్కలేదు!

అంచేత అరవడం మొదలెట్టేడు -

-(ఇంకావుంది)






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



# హనుమంతుడి పాట్లు



1936లో "సంపూర్ణ రామాయణం" సినిమా వచ్చింది. రాజమండ్రిలో శ్రీ దుర్గా సినీ టోన్ అనే చిన్న స్టూడియో లాంటిది వుండేది. వాళ్లే తీశారు. స్టూడియో అంటే ఆ రోజుల్లో ఏముంది? రెండు మూడు షెడ్డు లాంటివి వేసి, సెట్టు కట్టే వారు. కొన్ని సెట్లు ఓపెన్ గ్రౌండ్‌లోనే వేసేవారు. అంటే దశరథుడి దర్బారుంటే పైన ఏమీ వుండదన్నమాట. సింహాసనాలన్ని ఎండలోనే వుంటాయి. నటించేవాళ్ళు, ఆ సింహాసనాల మీద కూచుని ఎండలో నటించేవారన్నమాట- ఇప్పుడు అవుడ్డోర్‌లో నటిస్తున్నట్టు. ఆసినిమాలో, నాకు తాతగారి వరస అవుతారు- సుబ్బారావు గారనీ ఆయన దశరథుడి పాత్ర ధరించారు. నా చిన్నతనంలో ఆయన ఆ సినిమా విషయాలు చెబుతూ వుండేవారు. జనం కావలసిన దృశ్యాల్లో ఏం చెయ్యాలి? ఎక్కడెక్కడికో వెళ్ళి తీసుకొచ్చే వారుట. ఉదయం నుంచి, సాయంకాలం వరకూ వాళ్ళువుండి, చెప్పినట్టు చేస్తే "కుంచెడు బియ్యం, పావలా" ఇచ్చేవారుట, దానికోసం ఆశపడి వచ్చేవారుగాని, సినిమా మీద మోజుండి కాదు. అయితే, వానర సైన్యం కావలసినప్పుడు మాత్రం చాలా ఇబ్బందులు పడ్డారుట. వాళ్ళందరికీ కోతి మూతులు తగిలించాలి గదా. తోకలు తగిలించాలి గదా. ఇప్పటిలా, జూనియర్ ఆర్టిస్టులంటూ లేని రోజులు పైగా రాజమండ్రి, ఏ మద్రాసో, బోంబాయో అయితే,అంత కాకపోయినా కొంతమందయినా దొరుకుతారు. ఆ సినిమాలో హనుమంతుడి వేషం వేసినవారు- ముసునూరు సూర్యనారాయణ బాగవతార్. ఆయన గొప్ప హరికథకుడు, భావయుక్తంగా పద్యాలు, పాటలు పాడేవారు. ఆయన చెప్పేవారు. "నేను హనుమంతుడి వేషం ఏమిటి? నాకు ఎగరడం రాదు, డాన్సు రాదు అన్నాను. పాటలు పాడాలని నన్ను పెట్టుకున్నారు. నాకు హనుమంతుడి మూతి పెట్టారు. రెండు డిప్పల్లాంటివి తెచ్చి, నోటికి కిందా మీదా పెట్టి క్లిప్పుల్తో బిగించారు. నోరు పూర్తిగా మూసుకు పోయింది! ఎలా మాట్లాడాలి? ఎలా పాడాలి? అలాగే వీలైనంతవరకూ నోరు పైకి సాగ దిస్తూ పాడం డన్నారు. అలా నోరు కదుపుతున్నప్పుడల్లా, నొప్పి! పెదవుల నొప్పి, దవడలు నొప్పీ.

పొద్దున్న బిగించిన ఆ నోటి డిప్పల్ని సాయంకాలం లాగారు. నోరు వాచిపోయింది. అప్పుడన్నాను- "నాయనా! రేప్పట్నుంచీ ఈ డిప్పలు అవసరం లేదు. నామూతి చూడండి ఎర్రగా ఎలా వాచిందో! సహజమైన ఆంజనేయుడి మూతి!" అన్నాను.

మూతితోపాటు తోక తగిలించేవారు. ఆ తోక బరువు, నెత్తిమీద కిరీటం బరువు, భుజం మీద గద బరువూ- ఇవన్నీ కలిసి నా బరువు కంటె బరువయి నాకు "మహాభారం" కల్పించాయి. ఆ తోక వుంటే కూచోడానికి లేదు, నిలబడే వుండాలి. పోనీ, పనిలేనప్పుడు తోక తీసేద్దామా అంటే, మళ్లీ తగిలించడానికి అరగంట పడుతుంది! అప్పట్లో టెక్నిక్‌లు పెరగలేదు, పద్ధతులు తెలీవు. ఇప్పుడెలా వున్నాయో మరి! ఆ హనుమంతుడి దెబ్బతో మళ్లా ఎక్కడా ఏ సినిమాలోనూ ఏ వేషం వెయ్యలేదు. ఓ రెండు గంటలపాటు హరికథలు చెప్పుకోడంలోనే సుఖం, హాయీ, భక్తీ రక్తీ అన్నీ వున్నాయి.

బి.ఎ.సుబ్బారావు ''వైరావణ'' (1964) తీస్తే అందులో హనుమంతుడి వేషం రేలంగిది. "హనుమంతుడు కమేడియనా?" అని అడిగార్ట రేలంగి. "కాదురా, నీకో వెరైటీ- వెయ్యి" అన్నారుట సుబ్బారావు. రేలంగి చెప్పినది: "నాకా పర్సనాల్టీ లేదు, కండలూ, ఛాతీ ఏవీ? పైగా నా ముఖం మారిపోతుంది. నడక మారింది. అప్పటికే కాళ్ల రెండూ పట్లు. సరిగి నడవలేని స్థితి వచ్చేసింది. చెప్తే విన్నాడా సుబ్బారావు? చిన్ననాటి స్నేహితుడు, సరే అన్నాను. ఒక షూటింగులో తిన్నెమీద కూచోబెట్టి, "రామా రామా" అంటూ లేవాలన్నాడు. నావల్ల కాలేదు. కూచుని లేవాలంటే, ఎవరో లేవనెత్తాలి, లేదంటే ఒక చెయ్యి పక్కన ఆనుకుని లేవగలను. రెండు చేతుల్తోనూ దండం పెడుతూ, లేవమన్నాడే సుబ్బారావు- ఎలాసాధ్యం? "రామా రామా!"




అనడం మాటకేంగాని, సుబ్బారావుని తిడుతూ కూచున్నాను. ఎలాగో లేచానులెండి మొత్తానికి. అబ్బో హనుమంతుడి వేషమా- తలచుకుంటే భయం భయం".

ఆ "సంపూర్ణ రామాయణం"లో వయసుని బట్టి నలుగురైదుగురు రాముడి పాత్రలు వేశారు. ఒక రాముడు- దశరథ పాత్రధారి సుబ్బారావు కొడుకే వేశాడు. వాడిపేరు నారాయణరావు. వాడికో పద్యం వుంది. ఆ పద్యం చదువుతున్నప్పుడు, సినిమాలో కిందకి చూస్తూనే, అంటే తలపూర్తిగా దించుకునే చదివాడు. "ఏంరా! అసలు తలెత్తలేదేం- సిగ్గా భయమా?" అని నేను అడిగితే- "అదేంకాదు. చదవలసిన పద్యం కాయితం మీద రాసి, కింద గడ్డిలో పెట్టారు. మరి అది చూస్తూ పాడాలి గదా. తలకిందికే వుంటుంది. ఎంత చదివినా కంఠతా రాలేదు మరి!" అని చెప్పేవాడు.

* * *

మనకి తొలినుంచి "సినిమా చమత్కారులు" న్నారు. ముప్పైఏళ్ళ కిందటే నేను మంచి జోకులు విన్నాను- ఎవరు పుట్టించినవోగాని. ఒక సినిమా 'ఫ్లాప్' అయింది. దాని గురించి ఒకాయన- "ఫ్లాపేం కాదు. ఏడువారాలు ఆడుతుంది." అన్నాడు. "అదేమిటి? అదెలా?" అని అడిగితే, "శుక్రవారం నాడు విడదలయిందా- లెక్క వేసుకోండి. శుక్రవారం, శనివారం, ఆదివారం - అలా లెక్కచూస్తే గురువారం నాటికి ఏడువారాలు కాలేదా?" అని చమత్కరించాడు.

ఇంకో సినిమా చూసి, ఇంకొక పెద్ద మనిషి చేసిన చమత్కారం: "ఇది సెవన్‌వీక్స్ సినిమా. గ్యారంటీగా సెవెన్‌వీక్స్. ఎలా అంటే- డైరక్షన్ వీక్ (ఈ వీక్ స్పెల్లింగు, అర్థం వేరు) హీరో వీక్, కథ వీక్, మ్యూజిక్ వీక్-'' అంటూ చెప్పుకొచ్చాడు.

* * *

రిలీజయిన ఒక సినిమా గురించి ఒకాయన ఇంకొకాయన్ని అడిగాడు: "ఫలానా సినిమా ఎలా పోతోందిట?"

ఆయన అన్నాడు: ''బాగానే పోతోంది. నిమిషానికి తొంభై అడుగుల చొప్పున, ప్రొజెక్టర్లో -స్పీడుగానే పోతోంది".

రెండోసారి వచ్చిన ''పోతన'' (1966) సినిమా గురించి, ఎలా పోతోందని అడిగితే- ఆచార్య ఆత్రేయ అన్నమాట: "పోతానా - అంటోంది".

ఇద్దరు మాట్లాడుకుంటున్నారు.

"ఫలానా సినిమా ఎలా వుంది?"

"టాక్ బాగానే వుంది"

"మరి, దెబ్బ తిందన్నారే"

"బాగులేదన్న టాక్ బాగా వచ్చిందిమరి!"

* * *

కొన్ని అర్థంకానివీ, నవ్వొచ్చేవీ మాటలున్నాయి.''అందరూ సినిమా బాగుందంటున్నారు. కలెక్షన్లే లేవు"

"సినిమా బాగులేదని టాక్ వచ్చిందండీ, కలెక్షన్లు మాత్రం సూపర్!"

* * *

సినిమాలకి 'పాటల పుస్తకాలు' అంటూ రావడం 'సతీసావిత్రి' (ఈస్టిండియా: 1933) లో మొదలైంది. అప్పుడు దాని ధర ఎంతోగాని, తర్వాత తర్వాత పాటల పుస్తకం కాని. (ఇప్పటివాళ్ళకి తెలియా లంటే- రూపాయిలో అరవై నాలుగోవంతు) కొన్ని సినిమా హాళ్లలో నేల టిక్కట్టు ఖరీదు 'అణా' వుండేది. (రూపాయిలో పదహారో వంతు) కొన్ని 'డేరా'ల్లో ముక్కానీ (మూడోకానులు. అణాకి నాలుగు కాను లన్నమాట) వుండేది. అణా ఇచ్చి ముక్కానీ టిక్కట్టు కొంటే, కానీ తిరిగి ఇవ్వాలి. కానీ, కాని ఇవ్వకుండా పాటల పుస్తకం 'చిల్లర'గా ఇచ్చేసేవారు!

అప్పట్లో పాటల పుస్తకాల్లో పాటలపైన రాగం, తాళం వేసేవారు. కొన్ని పాటలపైన 'మాండ్ జిల్లా" అనీ, "కల్యాణి జిల్లా'' అనీ వుండేది. ఈ 'జిల్లా'కి అర్థం ఏమిటని- గాలిపెంచల నరసింహారావు గారిని అడిగితే- "జిల్లా అంటే కొన్ని వూళ్ల సముదాయం. అలాగే, ఈ పాట ఒకే రాగంలో వుండదు. ఇంకా కొన్ని రాగాలు కలుస్తాయి. ఇలా, రాగాల మిశ్రమం గనక, ఊళ్లకలయిక జిల్లా అయినట్టు- దీన్నీ జిల్లా అన్నారు. 'మాండ్ జిల్లా' అంటే, మాండ్ రాగం ప్రధానంగా వుంటుందన్నమాట." అని వివరించారు. ◆



భక్త పోతన

## 'సం' గీతా రహస్యాలు



'పల్నాటియుద్ధం' (1947) సినిమాకి గాలిపెంచల నరసింహారావు సంగీత దర్శకుడు. పేరు వెయ్యలేదుగాని సహాయకుడు ఘంటసాల. 'సోలో'గా ఆయన పాడిన నేపథ్యగీతం "తీరిపోయెనా మాతా' కాకుండా, గోవిందరాజు సుబ్బారావుకీ పాడారు. అక్కినేని నాగేశ్వరరావు "రండోయి నవ యువకులు" అన్నపాట పాడగా, కోరస్‌లోని చరణాలు నాగేశ్వరరావు తో కలిసి పల్లవి ఘంటసాల పాడారు. ఇప్పుడా పాట వింటే, ఘంటసాల కంఠం ప్రస్ఫుటంగా వినిపిస్తుంది.

-ఆర్కే

# కిశోర్ కుమార్ పరిచయం చేసిన గాయని



కిశోర్‌కుమార్ గాయనిగా పరిచయం చేసినా, నటిగా పేరు తెచ్చుకున్న సులక్షణా పండిట్

కిశోర్‌కుమార్ గాయకుడే గాక నిర్మాత కూడా. తన సినిమాల్లో కొన్నింటికి సంగీత దర్శకుడిగా పనిచేశాడు కూడా. అయినా తన కొడుకు అమిత్‌కుమార్ని తప్ప వేరే కొత్త వాయిస్‌లను పరిచయం చేయాలన్న ఉత్సుకత ఎప్పుడూ కనబరచలేదు. ఒక్క సులక్షణా పండిట్ విషయంలో మాత్రమే మినహాయింపు జరిగింది.

శాస్త్రీయసంగీత నిష్ణాతులైన రాజస్థానీ కుటుంబం నుండి వచ్చిన సులక్షణా పండిట్‌ను కిశోర్ సునీల్‌దత్ ట్రూప్‌లో కలిశాడు. జవాన్లకోసం సిక్కిమ్‌లో తన అజంతా ఆర్ట్స్ పేర కార్యక్రమం నిర్వహిస్తూ సునీల్‌దత్ ఆమెను వెంట తీసుకెళ్లాడు. ఆమె గాత్రం విన్న కిశోర్ తనతోబాటు 'గాతారహే మేరా దిల్' (గైడ్) పాడమని అడిగాడు. దానికి వచ్చిన ప్రజాదరణ చూశాక కిశోర్‌కు ఆమెపై నమ్మకం కలిగింది. బొంబాయి తిరిగివచ్చాక తనతోబాటు స్టేజిషోలలో పాల్గొనమని అడిగాడు. సినిమాలలో వేషాలక్కూడా ప్రయత్నించమని సలహా ఇచ్చాడు.

"నాకు పాటలు పాడడమే ఇష్టం, యాక్టింగ్ కాదు." అంది సులక్షణా. "అయితే పదికాలాలు అందరూ నిన్ను గాయనిగా గుర్తుంచుకొనే పాట ఇస్తాను చూడు." అని తన స్వంతచిత్రం 'దూర్ కా రాహీ' లో పాటపాడే అవకాశాన్ని ఇచ్చాడు. "బేకరార్ దిల్ తూ గాయెజా" అనే పాటని మేల్ వెర్షన్ తను పాడి, ఫిమేల్ వెర్షన్‌ను ఆమె చేత పాడించాడు.

ఆ తర్వాత ఖయ్యాం సంగీతదర్శకత్వంలో 'సంకల్ప్' సినిమాలో 'తూహీ సాగర్‌హై తూహీ కినారా' కు ఫిలింఫేర్ ఎవార్డు గెలుచుకున్నా సులక్షణాకు ఎక్కువ పేరు, గుర్తింపు వచ్చింది 'దూర్ కా రాహీ' పాటతో ననే చెప్పాలి. ఆ సినిమా రిలీజ్ కావడం లేటయినా పాట మాత్రం ఎంతో ప్రజాదరణ పొందింది.

కిశోర్‌కుమార్ కూడా మొదట్లో యాక్టింగ్ వైపు మొగ్గు చూపలేదు. గాయకుడు కావాలనే కలలు కన్నాడు. కానీ భుక్తి కోసం వేషాలు వేయవలసినదే అని అన్నగారు అశోక్‌కుమార్ శాసించడంతో




## నవ్వుల సందడి







"కార్టూనులు వదలగొట్టు
ప్రభుత్వాల గురక
కారు ట్యూను చేసినట్లు
నడుచు బ్రతుకు నడక"

ఈ పుస్త... ో 'ఏవియం' గారి కార్టూనులు పాతిక పైగా వున్నాయి. వాటిలో కొన్ని విశేషించి చెప్పుకోదగ్గవి వున్నాయి. రోడ్డు రవాణా సంస్థ వారు బస్ షెల్టర్ సూచించే సైన్ బోర్డులు బిగించే 'పోస్టులు' ఎంత 'బలంగా' వుంటాయో తెలిపే కార్టూన్ ఒకటి వుంది. 'అవి పిట్టలు వాల్తేనే వంగిపోతాయి' అని చెప్పడానికి కార్టూనిస్టు రెండు బొమ్మలు వేశారు. మొదటి బొమ్మలో ఒక పిట్ట వాలి వుంటుంది. 'పోస్టు' బాగానే వుంటుంది, వంగకుండా. రెండో దాన్లో రెండు పిట్టలు వుంటాయి 'పోస్టు' వంగి వుంటుంది. మొదటి బొమ్మలోనే 'పోస్టు' వంగినట్టు చూపివుంటే మనకి 'మెసేజ్' అందేది కాదు. మంచి 'కాప్షన్ లెస్' కార్టూను.

'మీరు ఏ క్షణం ఏ పార్టీలో వుంటారో తెలీక ఓ లైను బీజేపీ కీ ఓ లైను కాంగ్రెస్‌కీ అనుకూలంగా రాశా' అన్న కార్టూన్ ఇప్పటి





**కిశోర్ ఆప్తమిత్రులలో ఒకడు, ఇన్‌స్పెక్టర్ వేషాల ద్వారా ప్రఖ్యాతుడు - ఇఫ్తికార్**

తలవొగ్గాడు. తనలాగే సులక్షణా కూడా గ్లామరస్ ఫీల్డయిన యాక్టింగు కాదని సంగీతం వైపే మొగ్గు చూపడం అతన్ని ఇంప్రెస్ చేసి వుంటుంది. (కానీ ఆమె అదృష్టమో, దురదృష్టమో 'ఉల్‌ఝన్' (తెలుగులో జడ్జిగారి కోడలుగా పునర్మింప బడింది) వంటి సినిమాల హీరోయిన్‌గానే సులక్షణా గుర్తుండిపోయింది.

కిశోర్‌కి గల అతి కొద్ది మిత్రులలో ఇఫ్తికార్ ఒకడు. వారిద్దరికీ గల అనుబంధం కూడా సంగీతమే! పోలీసు ఇన్‌స్పెక్టర్ పాత్రల ద్వారా అందరికీ గుర్తుండిపోయే ఇఫ్తికార్ 1943లో నటుడిగా రంగప్రవేశం చేయడానికి ముందు హెచ్.ఎమ్.వి.లో గాయకుడిగా పేరు మోశాడని చాలామందికి తెలియదు. చిన్నప్పుడు చాలా సుఖప్రదమైన జీవితాన్ని గడిపినా, వేషాలు దొరక్క మలమలమాడినప్పుడు కూడా ఇఫ్తికార్ తన గౌరవాన్ని పోగొట్టుకోలేదు. "ఇత్తెఫాక్"(1969)లో ఇన్‌స్పెక్టర్ వేషం వేసి బిజీ అయ్యేవరకూ ఇఫ్తికార్ సగటుజీవితాన్నే గడపవలసివచ్చింది. ఆ వేషం తర్వాత తిరిగిచూడనక్కర లేకపోయింది. అతనితో స్నేహం బలపడినతర్వాత కిశోర్‌కుమార్ తన స్వంత సినిమాలన్నిటిలోనూ అతనికి వేషం ఇచ్చాడు.

ఇఫ్తికార్‌లోని సంగీతాభిరుచియే అతన్ని కిశోర్‌కు దగ్గరచేసినట్టు సులక్షణాకు సంగీతం పైన ప్రేమయే ఆమెను కిశోర్‌కు ఆత్మీయురాలిని చేసింది. అప్పటికి అతని భార్య మధుబాల మరణించింది. స్టేజిషోల ద్వారా పాప్యులర్‌గా ఉన్నాడు. అతను సులక్షణా పండిట్ పట్ల ఆకర్షితుడయ్యాడని, ఆమెను వివాహం చేసుకుంటాడనీ పుకార్లు వచ్చాయి. కానీ ఏమయిందో ఏమో కానీ చేసుకోలేదు.

వారిద్దరిమధ్యా స్నేహబాంధవ్యాలు చెడ్డాయి. సులక్షణా తన చెల్లెలు విజేతాను కూడా సినీఫీల్డులోకి తెచ్చింది. ఆమె కూడా గాయని, నటి. 'జీన్నీ ఔర్ జానీ'లో కిశోర్, విజేతా కలిసి పాడిన పాటలో కిశోర్ కంటె తన చెల్లెలే బాగా పాడిందని సులక్షణా అన్నట్టు వార్తలు వచ్చాయి. తనలా అనలేదని సులక్షణా సర్దుకుంది.

సులక్షణా సంజీవ్‌కుమార్‌ని పెళ్లాడబోయి అతను వెనుకడుగేయడంతో ఆగిపోయింది. గాయనిగా తెరమరుగయిపోయింది. నటిగా కొంతకాలం వెలిగి మటుమాయమయి పోయింది. ఏది ఏమైనా కిశోర్ సులక్షణాను పెళ్లాడలేదు. దరిమిలా 1975 లో యోగితాబాలిని పెళ్లాడాడు.



**కిశోర్, యోగితాబాలి సిక్కు పద్ధతిలో వివాహం - కన్యాదాతగా షమ్మీకపూర్, వరుని పక్షాన మెహమూద్.**

**-సి.ఎస్.ఎన్. మూర్తి**

---

రాజకీయ నాయకుల మనస్తత్వానికి అద్దం పడుతోంది.

అలాగే ఇంగ్లీషు మాస్టారు తెలుగులోనూ, తెలుగు మాస్టరు ఇంగ్లీషులోనూ 'పిష్' చెయ్యడం తమాషాగా వుంది.




'మీరడిగిన పాతిక లక్షల పాలసీ చేయిస్తా. కాని మీరు బస్సూ, రైలూ, కారూ, విమానం ఎక్కగూడదు' అనే కార్టూన్‌లో ప్రస్తుతం ఎక్కువగా జరుగుతోన్న ప్రయాణ ప్రమాదాలపై మంచి చురక వుంది.




'కళాసాగర్' గారివి రెండు మంచి కార్టూన్లు వున్నాయి.




ఒకావెకి 'కలర్' టీవీ లేదు. పక్కింటావిడకి వుంది. అందుకని ఆమెకి టీవీలో 'బ్లాక్ అండ్ వైట్' ప్రోగ్రాములు రావడమే ఇష్టం. కాబట్టి ఆవె నిర్వాహకుల్ని ఎప్పుడూ పాత సినిమా పాటలే కావాలని అడుగుతుంటూంది. మంచి వూహ.




ఇంకో కార్టూన్‌లో తెలుగు రాని గాయకుణ్ని తెలుగు సినిమాలో పాడడానికి ప్రత్యేకంగా తీసుకొస్తారు. ఇవాళ మనం చూస్తున్నదే గదా!

**-నిశాపతి**




శ్రీమతి ఆశాపూర్ణదేవి రాసిన 'అగ్నిపరీక్ష' అనే ఓ బెంగాలీ నవల ఆధారంగా బెంగాలీలో ఓ సినిమా తీశారు. ఆ సినిమా ప్రింట్‌ని చూసి 'యాంటీ సెంటిమెంట్' అని తక్కిన నిర్మాతలందరూ నిరుత్సాహపరుస్తున్నా అన్నపూర్ణ పిక్చర్స్ అధినేత దుక్కిపాటి మధుసూదన్‌రావుగారు తెలుగులో రీమేక్‌గా నిర్మించారు. ఆ చిత్రమే




ఆ చిత్రంలోగల 9 పాటలలో 4 పాటలను గత సంచికలో విశ్లేషించగా ఈ సంచికలో మరో నాలుగు....

ఆ: ఆకాశ వీధిలో అందాల జాబిలి
వయ్యారి తారను చేరి ఉయ్యాలలూగెనే
సయ్యాట లాడెనే ॥ఆకాశ॥
జలతారు మేలి మబ్బు
పరదాలు వేసి తెరచాటు చేసి
అ: పలుమారు దాగిదాగి
పంతాలు పోయి పందాలు వేసి
ఆ: అందాల చందమామ దొంగాటలాడెనే
దోబూచులాడెనే ॥ఆకాశ॥
అ: జడివాన హోరుగాలి
సుడి రేగి రానీ జడిపించబోనీ
ఆ: కలకాలము నీవేనేనని
పలుబాసలాడి చెలిచెంత చేరి
అ: అందాల చందమామ
అనురాగం చాటెనే నయగారం చేసెనే ॥ఆకాశ॥



ఈ పాటను మధ్యమావతి రాగాన్ని ప్రధానంగా తీసుకుని స్వరపరచటం జరిగింది. అక్కడక్కడ అంతర్గాంధారం, చతుశృతి దైవతం వంటి అన్య స్వరాలు పడుతున్నా - దేశ్ రాగంలోకి వెళ్లకుండా కేదారగౌళ రాగంలా అనిపించకుండా మధ్యమావతి లక్షణాలను ప్రతిఫలింపజేస్తూ ఈ పాటను మాస్టర్ వేణు మలచిన తీరును, ఆ విశిష్టతను కేవలం స్వరకర్తలు, వాద్యకారులు మాత్రమే గ్రహించగలరు. పాట సాహిత్యం, పాడిన పద్ధతి ఎంత హుందాగా సాగిపోతాయో చరణాల మధ్య గల ఇంటర్‌లూడ్స్ వాటికి భిన్నంగా కొంచెం హుషారుగా వయ్యారాలతో ఉంటాయి. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావుకి - యుగళగీతాన్ని నృత్య దర్శకులపై ఆధారపడకుండా మూమెంట్స్‌తో సహా స్వతంత్రంగా రూపకల్పన చేసుకుని చిత్రీకరించటం అలవాటు. నృత్య దర్శకులను యుగళ గీతాల చిత్రీకరణ సమయంలో ఆయన రానిచ్చేవారు కాదట. అందుచేత ఈ పాటను అక్కినేని, సావిత్రిపై ఎలా చిత్రీకరిస్తారోనని అనుకుంటూ ఉత్సుకతతో ఎదురుచూసిన నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు గారికి- ఆ ఇంటర్‌లూడ్స్‌ని రేలంగి, రాజసులోచనపై చిత్రీకరించటం చూసి - ఆదుర్తి వారి స్కీమింగ్‌కి ఆనందాశ్చర్యాలు కలిగాయిట. 'ఓ...ఓ.....ఓ..' అనే ఆలాపనతో ఈ పాట మొదలవుతుంది. చిత్రీకరణ ముందు సావిత్రి వచ్చి "ఆర్టిస్టులు'ఓ....ఓ....ఓ....'అంటూ అంతసేపు మూతి అలాపెట్టి లిప్ మూవ్‌మెంట్ ఇస్తే తెర మీద బాగా కనిపించదండీ...ఈ మాట డైరెక్టర్ గారికి చెప్పాలంటే భయంగా ఉంది. ముందు ముందు మీ చిత్రాల్లోని పాటల్లో ఆలాపనలు ఉంటే అవి 'ఓ...ఓ...ఓ....' అని కాకుండా'ఆ...అ..అ...' అని వచ్చేట్టు చూడరూ?" అంటూ మధుసూధనరావు గార్ని బ్రతిమాలిందట. అంతగా లీనం కావటం, అంతటి దార్శనికత ఉండటమే ఆ మహానటి దర్శకురాలు కావడానికి కారణం అయ్యాయేమో!? ఈ పాటకోసం **"ఆకాశ వీధిలో దడదడ ఉరుములు మ్రోగెనే/ జడివాన ముంచుకొచ్చి వడగళ్లు రాలెనే/ కడగండ్లు కల్గెనే"** అనే ఓ చిన్న బిట్‌ని కూడా రాయించి, పాడించి, అసలు పాట తర్వాత వచ్చే చిన్న ప్రహసనానికి వాడుకున్నారు.

1957లో 'బడాభాయ్'అనే ఓ హిందీ చిత్రం వచ్చింది. ఆ చిత్రం ఆధారంగానే తెలుగులో 'శభాష్‌రాముడు' చిత్రాన్ని తీశారు. ఆ 'బడాభాయ్' చిత్రానికి సంగీత దర్శకుడు నాషాద్.(నౌషాద్ కాదు. ఈ నాషాద్ గురించి 'శభాష్ రాముడు' పాటలకు సంబంధించిన విశ్లేషణలున్న ఆపాతమధురంలో చర్చించటం జరుగుతుంది.) సదరు'బడాభాయ్' సినిమాలో స్వరపరిచిన 'చోరీ చోరీ దిల్ క లగానా బురీ బాత్‌హై' పాట ఆ రోజుల్లో పెద్ద హిట్.ఆ

పాట పోలికలు, ఛాయలు ఈ 'ఆకాశవీధిలో అందాల జాబిలి' పాటలో చాలా వరకు కనిపిస్తాయి. మధ్య మధ్య వేణు మార్కు ఉన్నా సరే! ఆ పాటని ఈ పాటని పక్కపక్కన పెట్టుకుని వింటే ఎంత దగ్గరగా ఆ రెండుపాటలూ ఉన్నాయో తెలుస్తుంది. కావాలంటే ఆ 'చోరీచోరీ దిల్ క లగానా బురీ బాత్ హై' పాట ఆధారంగా 'శభాష్ రాముడు'లో స్వరపరిచిన 'కలకల విరిసి జగాలే పులకించెనే' అనే పాటను, 'ఆకాశ వీధిలో అందాల జాబిలి' పాటను కలిపి పాడుకుని ఆ పోలికల్ని పట్టుకోవడానికి ప్రయత్నించి చూడండి. అదో ప్రత్యేకమైన అనుభవంతో మనసులో మిగిలిపోతుంది. ఇక్కడ చెప్పుకోవలసిన ఓ గమ్మత్తు ఏమిటంటే ఆ హిందీ పాటల ఆధారంగా స్వర పరచబడిన ఈ రెండు తెలుగుపాటల్నీ శ్రీ శ్రీయే రాశారు... అదీ విశేషం!

ఆ: పెను చీకటాయె లోకం
చెలరేగే నాలో శోకం
విషమాయె మా ప్రేమా
విధియే పగాయె ॥పెను॥
ఆ: చిననాటి పరిణయ గాధ
ఎదిరించలేనైతినే ॥చిన॥
ఈనాటి ప్రేమగాధ తలదాల్చ లేనైతినే
కలలే నశించిపోయే
మనసే కృశించిపోయే
విషమాయె మా ప్రేమా విధియే పగాయె ॥పెను॥
అ: మొగమైన చూపలేదే
మనసింతలో మారెనా ॥మొగ॥
నా ప్రాణ సతివని తెలిపే
అవకాశమే పోయెనా
చిననాటి కలతల వలన
హృదయాలు బలి కావలెనా
విషమాయె మా ప్రేమా విధియే పగాయె ॥పెను॥



ఈ పాట మొత్తం ఉన్న పాటలలో కెల్ల ఆణిముత్యంలాంటి పాట. కళ్యాణి రాగంలో శోకరసం కూడా ఎంత గాఢంగా పలుకుతుందో తెలియజేసే పాట ఇది. శరీరం రోమాంచితం అవుతూ ఉండగా గుండె చెమరించటం, కళ్లలో రసబిందువులతో కూడిన సన్నటి పొర కదలాడటం వంటి అనుభూతులు- ఈ పాటలో మాస్టర్ వేణు స్వర రచనకు ఘంటసాల చూపిన గళ మధురిమ ద్వారా అవగాహనలోకి వస్తాయి. గమకాలు సహజంగా పడటం అంటే ఎలా ఉంటుందో తెలుసుకోవాలంటే- రెండో చరణంలో 'మొగమైన చూపలేదే మనసింతలో మారెనా' అన్న వాక్యంలో 'లేదే' వద్ద - 'మారెనా' - వద్ద గమనిస్తే చాలు. ఇక స్వరపరంగా తెలుసుకోవాలంటే ఉత్తరాది సంగీత దర్శకుడు నౌషాద్ అంటే మాస్టర్ వేణుకి ఎంతటి గురుభావమో, ఈయనంటే ఆయనకి ఎంతటి వాత్సల్యమో సినీ సంగీత ప్రపంచంలో అందరికీ తెలుసు. జి.కె.వెంకటేష్ లాంటి సంగీత దర్శకులు సైతం 'నౌషాదే వేణు, వేణుయే నౌషాద్' అని వారి అనుబంధం గురించి ప్రకటించారు కూడా. వారిద్దరి 'రాగస్వామ్యం' ఎటువంటిదంటే- ఒకే రాగాన్ని తీసుకుని ఇద్దరూ చెరోపాట స్వరపరిస్తే - ఒకే తల్లి పిల్లల్లా ఒకే మూసలోంచి వచ్చినట్టు ఉంటాయి. నౌషాద్ స్వరరచనలో 1960 లో వచ్చిన 'కోహినూర్' చిత్రంలోని 'దో సితారోం కా జమీపర్ హై మిలన్' పాట, 1962లో వచ్చిన 'సన్ ఆఫ్ ఇండియా' చిత్రంలోని 'దిల్ తోడ్‌నే వాలే' పాట, 1964లో వచ్చిన 'లీడర్' చిత్రంలోని 'తేరే హుస్న్‌కి క్యా తారీఫ్ కరూం' పాట, 1967లో వచ్చిన 'రామ్ ఔర్ శ్యామ్' చిత్రంలోని 'ఆజ్‌కీ రాత్ మేరే దిల్‌కీ సలామీ లేలే' పాట... ఇవన్నీ 'పెను చీకటాయే లోకం' పాటతో రసబాంధవ్యం కలిగున్నట్టు అనిపిస్తుంది. ముఖ్యంగా ఆర్కెస్ట్రయిజేషన్‌లో క్లారినెట్, ఫ్లూట్, వయొలిన్ వాద్యాల నడక, వాటి సమ్మేళనంతో తీసుకువచ్చే ఎఫెక్ట్‌లూ - ఇవన్నీ ఈ పాటలను పక్కపక్కన నిలబెట్టి చూస్తే నౌషాద్‌కు వేణుకు ఎంతటి భావ సారూప్యత ఉందో, స్వరపరంగా వారిరువురూ ఎంత దగ్గరగా స్పందిస్తారో తెలుస్తుంది.

ఆ: వాడిన పూలే వికసించెనే-చెర
వీడిన హృదయాలు పులకించెనే
అ: తీయని కలలే ఫలియించెనే-ఎల
కోయిల తన గొంతు సవరించెనే ॥తీయని॥
ఆ: వేయి రేకులు విసిరింది జలజం
అ: తీయ తేనియ కొసరింది భ్రమరం
ఆ: లోకమే ఒక ఉద్యానవనము
లోటు లేదిక మనదే సుఖము ॥తీయని॥
అ: పగలే జాబిలి ఉదయించనేల
ఆ: పగలే చాలును పరిహాసమేల
అ: తేట నీటను నీ నవ్వు మొగమే
తెలియాడెను నెలరేని వలెనే ॥వాడిన॥
ఆ: జీవితాలకు నేడే వసంతం
అ: చెదిరి పోవని ప్రేమానుబంధం
ఇ: ఆలపించిన ఆనందగీతం
ఆలకించగ మధురం మధురం ॥వాడిన॥



ఈ పాట సింధుభైరవి రాగాన్ని - మధ్య మధ్య పీలూ రాగాన్ని - కలుపుకుంటూ మలచబడ్డ పాట. 'పగలే జాబిలి ఉదయించెనేల' అన్న చరణంలోని మూడు లైన్లనూ తిలంగ్ రాగచ్ఛాయలో స్వరపరిచారు. ప్రియురాలి ముఖబింబాన్ని నీటిలో చూసి పగలే జాబిలి ఉదయించినట్టు

వర్ణిస్తే బాగుండునన్న ఆలోచన-తమిళ వెర్షన్‌కు రాసిన ఉడుమలై నారాయణ కవిది. 'ఇది బాగుంది ఇలాగే తీసుకుందాం' అని ఆ చరణం వరకూ ఆ భావాన్ని తెలుగులో రాశారు శ్రీ శ్రీ.

రచయితగా శ్రీశ్రీ, గాత్రధారులుగా సుశీల, ఘంటసాల, పాత్రధారులుగా సావిత్రి, అక్కినేని - ఈ మూడు పాటలకూ కామన్ అయినా మూడు పాటలూ దేనికదే ఓ ప్రత్యేకతతో ఉండి హిట్ అవ్వటం ఇవాళ ఓ విశేషంగా చెప్పుకోదగ్గ విషయం. ఇది కాక మరో విశేషమేమిటంటే - అన్నపూర్ణ సంస్థ ఆప్తులైన ఆత్రేయ కూడా ఈ చిత్రంలో ఓ పాట రాశారు. 'రెండు కుటుంబాలను కలపటానికి చిన్నపిల్లలకు పెళ్లి చేసావు కానీ దూరం ఇంకా పెరిగింది' అనే భావంతో రచనా పరంగా లోతులకెళ్లి ఆత్రేయ రాసిన ఆ మూడు చరణాల పాట సుశీల-ఘంటసాల పాడగా రికార్డు చేసారు. కన్నాంబ-ఎస్వీరంగారావు మొదలైన వారిపై చిత్రీకరించారు కూడా. కానీ సెన్సారు ఆఫీసరు జి.టి.శాస్త్రి అభ్యంతరం చెప్పారు.'పిల్లలకు పెళ్లి చేసినట్లు చూపించినా కారకులైన వారికి కోర్టులో శిక్ష పడేట్టు చూపించారు కాబట్టి సరిపోయింది. కానీ ఈ పాట మాత్రం బాల్య వివాహాలని సమర్థిస్తున్నట్లు ఉంది. చట్ట రీత్యా అది నేరం. తీసేయక తప్పదు' అన్నారాయన ఓ ఆప్తుడిగా (కూడా) సలహానిస్తూ. ప్రొడక్షన్ వ్యవహారాలు చూసే సంపత్ అనే కుర్రాడి దగ్గర్నుంచీ దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు వరకూ అందరికీ కళ్లలో నీళ్లు తిరిగాయి. అంత బాగా వచ్చిందాపాట. కానీ మధుసూదనరావు గారు సెన్సారు ఆఫీసరు చేసిన ఆర్గ్యుమెంట్స్‌కి కన్విన్స్ అయ్యారు. గుండెను రాయిగా చేసుకుని ఆ పాట మొత్తం తొలగించారు. సర్టిఫికేట్ కోసం తీసేసి రెండో రోజుకే జత చేసి ప్రదర్శనలు జరుపుతున్న ఈ రోజుల్లో - ఆ నాడు కట్ చేసిన ఆ పాటకు సంబంధించిన సమాచారం ఇవాళ ఆవగింజంత కూడా దొరకదంటే ఆశ్చర్యంగానే ఉంటుంది.

అ: మైడియర్ మీనా ! మహా మంచిదానా !
వీలు చిక్కెనా? నేటికి జాలికల్గెనా
ఆ: మైడియరు సారూ ! అహతగ్గించు జోరు
నవ్వి పోతారు నలుగురు నవ్వి పోతారు
అ: తగ్గు తగ్గంటావు తప్పించుకుంటావు
టైము లేదంటావు టక్కు జేస్తుంటావు
ఎంత వేడినగాని, వినను పొమ్మంటావు
ఏకాకిగా జేసి ఏడిపిస్తుంటావు ॥మైడియర్॥
ఆ: పిలిచి పిలిచీ నన్ను ఉలికింపజేస్తావు
ప్రేమ పాఠాలన్ని వల్లింజేస్తావు
పదిమందిలో నీవు పలచనైపోతావు
నా బ్రతుకు తీస్తావు నగుపాటు జేస్తావు ॥మైడియర్॥
అ: పస్తులైనా వుండి కాపాడతాను ప్రాణమైనా నీకు ధారపోస్తాను
పూలలోనా బెట్టి పూజించుతాను నీళ్లలోనా ముగ్గి బాసజేస్తాను
ఆ: కొత్తగా నీ పైత్యమేముందిలే కుర్రాళ్లకీ వెర్రి సహజమ్మulే
ఈ రోజుకీ గొడవ చాలించులే
తీరికగ నీ గోల వింటానులే ॥మైడియర్॥



ఈ పాటను కొసరాజు రాయగా మాధవపెద్ది, జిక్కి పాడారు. టైటిల్స్‌లో జిక్కి పేరుని పి.జి. కృష్ణవేణిగా వేసిన చిత్రాలలో ఇదొకటి. పాట సాహిత్యాన్ని ఒక్కసారి గమనించి చూడండి. ఆదర్శంగా వుండవలసిన హీరోహీరోయిన్ల యుగళగీతాల్లో సైతం అనైతికత ధ్వనిస్తున్న నేటి సాహిత్యానికి, హాస్యజంటకు నిర్దేశించబడిన ఆనాటి ఈ యుగళ గీతంలోని నైతిక నిబద్ధతకి, తేడా తల్చుకుంటే ఎవరి హృదయమైనా సరే సిగ్గుతో బాధపడక తప్పదు. ఈ పాట చరణాల మధ్య ఇంటర్‌లూడ్స్‌ని బాగా మనసుకి పట్టించుకుంటే మాస్టర్‌వేణు స్వరపరిచే పాటలని ఎప్పుడు ఎక్కడ వున్నా 'ఇది వేణు మార్క్' అని ఇట్టే పట్టేయవచ్చు. చక్కటి సరదా గీతమిది. ఇక నేపథ్యసంగీతానికి సంబంధించిన విశేషాలు కొన్ని ఉన్నాయి. రేలంగి కారు డిక్కీలో రాజసులోచన దాక్కొని ప్రయాణం చేసిన సన్నివేశంలో ఉపయోగించిన సంగీతం -'కులదైవం' చిత్రంలోని 'ఆడి పాడెను నా మది ఈ వేళా అరుదెంచే ఉగాది శుభవేళా' పాటగా వచ్చింది. అలాగే రేలంగి తన రూమ్‌ని దుప్పట్లతో సగభాగం చేసి రాజసులోచనకు ఆశ్రయం ఇచ్చిన సన్నివేశంలో వినిపించిన ట్యూన్ - అంతకుముందు 'తోడికోడళ్లు' చిత్రంలో ఆ జంట మీదే చిత్రీకరించిన 'నీ తోనే ఉంటాను రమణయ్య మావా' అన్న పాటే. ఇక అక్కినేని, సావిత్రికి సంబంధించి-తాంబూలం సీన్ లోనూ, చిన్న తనంలో తనకు తాళి కట్టింది, తను ప్రేమించింది ఒకరేనన్న నిజం సావిత్రికి తెలిసిన సన్నివేశంలోనూ, చివరికి అందరూ కలిసి భోసనం చేస్తున్న సన్నివేశంలోనూ కామన్‌గా వినిపించిన సంగీతం - తరువాత వచ్చిన 'బాటసారి' చిత్రంలో 'మౌనములు చాలురా మదిని వగ ఏలరా' పాటగా రూపుదిద్దుకుంది. అవన్నీ ఇప్పుడు గమనిస్తే ఆసక్తికరంగా ఉండటమే కాకుండా నిత్యం స్వరాంబుధిలో మునిగి తేలే ఆనాటి అధ్యయన రీతులపై గౌరవాభిమానాలు పెరుగుతాయి కూడా.



అందమైన కళ్లే కాదు
వారసత్వంగా వచ్చేది.....
అపాయకరమైన వ్యాధులు కూడా...
హెపటైటిస్-బి వ్యాధి సోకిన తల్లి తనకు
తెలియకుండానే గర్భస్థ శిశువుకు కూడా
సంక్రమింపచేస్తుంది - ఆ కాలేయపు వ్యాధిని.
మీ డాక్టర్‌ను సంప్రదించండి.
సకాలంలో టీకా వేయించుకోండి. ధర
అందుబాటులో ఉండే అంతర్జాతీయ శ్రేణి
వ్యాక్సిన్ గురించి తెలుసుకోండి.
ప్రజాహితం కోరి విడుదల చేసినది
ప్రాణాంతక హెపటైటిస్-బి వ్యాధి నిరోధక టీకా
శాన్‌వాక్-బి తయారీదారులు:
శాంతా
బయో టెక్నిక్స్ (ప్రై)లి.
3వ ఫ్లోరు, శిరీన్ ఛాంబర్స్, బంజారాహిల్స్, హైదరాబాద్
ఫోన్స్ : 040-23548507, 23608843, ఫ్యాక్స్: 040-23548476
హెపటైటిస్-బి
పసుపు వలయం
ప్రమాద సూచకం
Help. Stop HBV
Shanvac™- B
r-DNA Hepatitis-B vaccine

